# నవజన్మ

వంగమాతృక:

ఆశాపూర్ణాదేవి.

అనుసరణ:

మద్దిపట్లసూరి



జనతా ప్రచురణాలయం
విజయవాడ.2

# న వ జ న్మ

(ప్రసిద్ధ బెంగాలీ నవల)

# 1

బ్రాసుల్‌పూర్ రస్తా - జయచండీదేవి ఆలయంవైపు రెక్కలు చాచుకుని ఉండే రస్తా. ఆ రస్తాని కొద్దిరోజులనుంచి వచ్చిపోతున్న జనానికి విధీ – విరామంలేదు. ఒక్క బాసుల్‌పూర్ అనేకాదు - చుట్టు పక్కల అయిదారు ఊళ్ళనుంచి చండీతలా రస్తాని తండోపతండాలుగా వచ్చి పడుతున్నారు జనం....కాని కారణం ఏమిటి ?

చండీదేవి హఠాత్తుగా ఏదైనా కొత్త మాహాత్మ్యాన్ని కనపరచిందా ? లేక ఈ ప్రాంతంలోని ఆబాలగోపాలమూ ఒక్కసారిగా పరమ ధార్మికులై పోయారా ?

* * *

కాదు, నిజానికి అంతయిదేమీకాదు. జనం రద్దీకి కారణంవేరు. అయితే ఇదికూడా ఒక మాహాత్మ్యానికి సంబంధించిన వ్యవహారమే. ఈ మాహాత్మ్యాన్ని స్వయంగా నారాయణుడే కన్పరుస్తున్నాడు. శంఖచక్ర గదా పద్మధారి అయిన నారాయణుడు స్వయంగా మర్త్య లోకానికి అవతరించి, బాసుల్‌పూర్‌లోని జయచండీదేవి ఆలయం మండపంలో అధిష్ఠితుడైనాడు.

ఎందుకయినాడు ? ఆ ప్రశ్న విశ్వాసం లేనివాళ్ళు వేసేది ! లీలామానుష విగ్రహుని అనంత లీలలకి కారణాన్ని వెతుక్కుంటూ పోవటం మూర్ఖత్వంకాక ఏమవుతుంది? ప్రస్తుతానికి ఆయన బాసుల్‌పుర వాసులను ఉద్ధరించటానికే మానవరూపాన్ని ధరించాడని అనుకోవచ్చు.

ఓ తాంబూలం అయిదు కానులూ పెట్టాలి.

భూతభవిష్యద్వర్తమానాలన్నీ చెపుతా డాయన .... అదృష్టానికి అభయమిస్తాడు.

నాలుగయిదు రోజుల్లోనే ఈ సంగతి ఆనోటా - ఆనోటా అయిదారు ఊళ్ళదాకా ప్రాకిపోయింది. లోకుల నోళ్ళు బాగా ప్రచారంకల పత్రికలకంటె త్వరగా పనిని నెరవేర్చగలవు. ఈ సంగతి పల్లెటూరు వాసులకు మాత్రమే తెలుసు. అంచేత ఈ 'చండీతలా' రస్తాకి ఈ కొద్ది రోజులనుంచి ఒక్క క్షణంకూడా తెరపిలేకుండా ఉంది. రైలు రోడ్డు వెంట తండోపతండాలుగా వస్తున్నారు జనం. చిన్నలైన్, చిన్నబండి లోంచి వేలం వెర్రెత్తిపోయిన జనం - వేలకివేలు దిగుతున్నారు. అందరూ చండీతలా వైపుకే వెడుతున్నారు.

పిల్లలు, పెద్దలు, ఆడవాళ్ళు, మగవాళ్ళు, భాగ్యవంతులు, కింపురుషులు, గౌరవనీయులు, సాధువులు, సన్యాసులు, బిచ్చగాళ్ళు, ఫకీర్లు, సాతానులు, జంగాలు అందరూ వెడుతున్నారు. పర్దాల్లో వుండేవాళ్ళకి, లజ్జావతులైన వాళ్ళకి కూడా ఈ కారణంగా వీధిలోకి వచ్చేందుకు అవకాశాలు లభించాయి. వాత్సల్యంగల తల్లులు పసిపిల్లల్ని చంకనేసుకుని కూడా వెడుతున్నారు నారాయణుని 'దర్బారు'కి....పసిపిల్లలకి భూతకాలమయితే లేకపోవచ్చు; భవిష్యత్తనేది ఉంటుందిగా ?

కుంటి గోవిందు 'బాగ్దే'కూడా వెడుతున్నాడు కర్రతాటించుకుంటూ - గోసాయీలకి, బ్రాహ్మలకి చాటుగా. వాతరోగంతో కాళ్ళు పడిపోయిన చౌధురీ గృహిణికూడా ఎద్దుబండి యెక్కి ప్రయాణమయింది. అసలు సంగతి ఏమిటంటే, చర్మచక్షువులతో నరనారాయణుని ఒక్కసారి దర్శనం చేసుకోకుండా విడిచిపెట్ట రెవ్వరూ. ఎందుకు విడిచిపెట్టా లసలు ? ఈ సుయోగం మాటిమాటికీ లభిస్తుందా ? అయితే, గొలుసులో గొళ్ళాల్లాగా అందరూ బారులుతీరి వెడుతుంటారు - అని కనుక అనుకుంటే కాదు పొరపాటది. ఎదుటివైపు నుంచి అడ్డదిడ్డంగా కూడా వస్తున్నారు కొందరు. వాళ్ళ మూలంగానే అంత కోలాహలంగా ఉంది దారి అంతా.

తెలతెలవారుతూండగా వెళ్ళినవాళ్ళందరూ పెందరాళే ముందు తిరిగి వస్తు న్నారు. ఎదురు - బదురుగా వస్తూ పోతున్నవాళ్ళు ఒకర్ని ఒకరు ఢీ కొట్టుకుంటూ ఉండటంవల్ల రేగుతున్న గోల సవ్యంగా లేదు. ఉత్తేజితు లైన తీర్థప్రజ ఒకరిమీద ఒకరు కురిపించుకునే తిట్లూ అవీ నారాయణ దర్శనాభిలాషులకిగాని,నారాయణుని దర్శించుకుని ధన్యులై తిరిగి వస్తున్న వాళ్ళకిగాని ఎవరికీ శోభస్కరంకావు. కాని శోభస్కరపు హద్దుని దాట కుండా నడిచి వెడదామన్న ఇంగితం మాత్రం పిసమెత్తయినా లేదెవరికీ.

ఈ కలకలలు, ఈ కటూక్తులు, తోపులాటలు, ఈ గందరగోళ మంతా అణగినా మళ్ళీ మధ్య మధ్య నారాయణుని మాహాత్మ్యాన్ని గూర్చిన ప్రశంసలు విన్పిస్తూనే వున్నాయి. 'అహా ! ఏమిదర్శనం.... నరజన్మ సార్థకం ! జీవితాన్ని తరింపచేయటానికే ఇలా వచ్చారు. కోటి కోటి యుగాలనాటి పుణ్యం ఏ కొంచెమో ఉండబట్టే ఇలాంటి మహత్తర సందర్శన భాగ్యం లభిస్తోంది. కాని తనివితీరా చూడనీయటంలేదు. ఆ మందిరం తలుపు ఒక్కసారి అలా తీసి, అలా వేసేస్తున్నారు మళ్ళీ. లోపలికి వెళ్ళనీయటమే లేదు. లోపల ? అహఁ. ఇంకేమీలేదు....అదే క్షణిక దర్శనం....'

• • • •

ఘోషాల్‌గారిల్లు ఊరికి చివర. జయచండీ ఆలయానికి వెళ్ళే దారి - తిన్నగా ఈ ఘోషాల్‌గారింటి ముందునుంచే వెడుతుంది. ఈ ప్రాంతంనుంచి వెళ్ళేవాళ్ళందరూ ఈ ఘోషాల్‌గారింటి ముందునుంచే వెళ్ళటం, రావటం. అయితే మరొక అడ్డదారి, దగ్గరదారి ఉంది. అది వారి వంటింటి వెనుకవైపు మెల్లాలోంచి. ఆమెల్లా దాటి పొదలు, ముళ్ళ కంచెలు దాటి వెళ్ళగలిగితే,పెద్ద రస్తానుంచి వెళ్ళేదానికంటె చాలా దగ్గిర. పిల్లలూ వాళ్ళూ తరచు ఈదారినే వెళ్ళివస్తూ ఉంటారు. ముళ్ళకంచెల్నీ, పల్లేరు కాయల్నీ వాళ్ళు లెక్కచెయ్యరు.

ఘోషాల్ గృహిణి నిభానని, ఈ రాకపోకల్ని వ్యతిరేకించేది మాత్రమేకాదు - అనధికారంగా ప్రవేశించి తుర్రున పరుగులెత్తుకుపోయే

కుర్రవాళ్ళమీద ఆమె కురిపించే తిట్లున్నాయే వాటికి యదార్థానికి ఏదైనా శక్తే కనుక ఉంటే ఆ కుర్రవాళ్ళు చండీతలా వరకు చేరుకుంటారా లేదా అన్నది సందేహమే. కలియుగంలో పదజాలానికి పదును మొక్కవోవటం వాళ్ళ పరమ అదృష్టం.

నిభానని ఒక్కతేకాదు. ఆమె కూతురు సుధాముఖికూడా తన పేరులోని మాహాత్మ్యాన్ని విస్మరించి బోలెడంత విషాన్ని క్రక్కుతూం టుంది. మెల్లాలోకి వచ్చే తడికె తలుపును పద్ధానుగుసార్లు మూస్తూ వుంటుంది. కాని అది స్థిరంగా ఉండటంలేదు. విభీషణుడిలా గృహ విచ్ఛేదకారిణి వారి గృహంలోనే ఉంది. ఆమె ఎవరోకాదు. నిభానని కోడలు వాసంతి. బిడ్డా—పాపాలేని వాసంతి దగ్గిర పిల్లలకి చాలా చనువు. అత్తగారు ఆడబిడ్డ కను చాటవగానే వాసంతి టక్కున ఆ తలుపుతీసి ఉంచుతుంది. ఇహ ఎవరైనా కనుక దొరికారంటే వాళ్ళని ప్రశ్నలతో విసుగెత్తించేస్తూంటుంది. ఆ నారాయణు లెలాంటివారు ? ఎలా ఉంటారు? మనుషుల అదృష్టాల్ని చదివినట్టు ఎలా చెప్పగలుగుతున్నారు ?"

కాని యెందుకు ?

నాలుగు ఊళ్ళవాళ్ళు చండీతలాకి పరుగులెత్తుతున్నారు. దర్శనం చేసుకుని ధన్యులవుతున్నారు. వాసంతి ఒక్కతె మాత్రం ఇతరుల నోటి ఎంగిలికి ఎందుకు ఆశించాలి ? ఇదే ఇక్కడేఉంది అసలు సంగతి. ఊళ్ళోవుండే కోడళ్ళకి, పని మనుషులకి, అందరికీ చండీతలాకి వెళ్ళేం దుకు అనుమతీ హక్కు ఉన్నాయి. వాసంతికి ఒక్కదానికే లేనిది. వాసంతి భర్త శశధరుడి కఠోరమైన ఆజ్ఞ ! అతడుచెప్పే యుక్తియేమీ లేదు పెద్దగా. బొమికెలన్నీ బయటికొచ్చి సన్నగా, కోలగా ఉండే ముఖాన్ని వికృతంగాపెట్టి "ఛా ఛా ! అలాంటి హద్దూ పద్దూలేని వాటికి ఆడవాళ్లు ఎగబడతారా యెక్కడయినా ?" అంటాడు.

అక్కడికి వెడుతున్న మహిళాజనం యావన్మందీ ఆడవాళ్ళ క్రింద లెఖ్ఖకావట్లు....

* * *

భార్యని, చెల్లెల్ని ఇద్దర్నీ అతడు గట్టిగా వారించాడు. కాని చెల్లెలు సుధాముఖి అతడి నిషేధాన్ని ఇహ మన్నిస్తుందని తోచదు. ఆ దారి అసలు వాళ్ళ యింటిముందునుంచే.సుధాముఖి హృదయం ఉద్వేలమై ఆ వెడుతున్న జనంవెంట వెళ్ళిపోతూ ఉంటుంది. శరీరం మాత్రం తలుపులు తెరిచిఉన్న గుమ్మం కమ్ములు పట్టుకుని నిలబడి ఉంటూ ఉంటుంది.

బెనర్జీగారి భార్య అక్కడికి వెళ్ళి తిరిగి వస్తూ వస్తూ సుధాముఖి ఇలా నిలబడి ఉండటం చూసి, ఆగి "నువ్వు చూసిరాలా సుధా ?" అని అడిగింది చిరునవ్వుతో.

"ఉహూఁ. అంత అదృష్టం ఇంకా పట్టలేదు"అని ఒక విధమైన ముఖభంగిమతో వ్యక్తం చేసింది.

బెనర్జీ భార్యకి శశధర్ స్వభావం తెలుసు. ఏటేటా ఇంతింత పెద్ద పెద్ద ఉత్సవాలు జరుగుతూంటాయి చండీతలాలో. భార్యనీ, చెల్లెల్నీ మాత్రం అక్కడికి వెళ్ళటానికి వీల్లేదని వారిస్తూ ఉంటాడు. ఈ సంగతి కూడా బెనర్జీ గృహిణికి తెలియనిది కాదు. ఓవేళ చాటుగానో, మాటుగానో సుధాముఖి అక్కడికి వెళ్ళినా కోడలు వాసంతి జన్మలో వెళ్ళదక్కడికి. అన్న సంగతి ఆమెకి బాగా తెలుసు. అయినా అపరిమితమైన ఆశ్చర్యాన్ని ముఖంలో వ్యక్తంచేస్తూ "ఏమన్నావ్ ? ఇంకా వెళ్ళలేదూ? మీ గుమ్మంముందునుంచి ఇంతమంది జనం వేలంవెర్రిగా పరుగులెత్తుతున్నారు; మీరేమీ కదలకుండా ఇంట్లో కూర్చుంటున్నారా ? భలేదానివే! మీ వదినకూడా వెళ్ళలేదా ?" అని అడిగింది.

సుధాముఖి నిర్లక్ష్యంగా ముఖభంగిమ పెట్టి - "నేనే వెళ్ళలేక పోయాను. ఇహ మా వదినా వెళ్ళటం ?" అన్నది.

"ఆఁ. అవునూ,ఇలాంటి సుయోగం జీవితంలో మళ్ళీ వస్తుందా?"

సుధ విరక్తి భావంతో "ఏం చెప్పను పెద్దమ్మా ! అన్నయ్య సందర్భా సందర్భజ్ఞానంలేని వాడవటం మూలంగానే మాకు జీవితంలో ఎన్నడూ ఏదీ ఒనగూడలేదు. దేశంలోని ఆడవాళ్ళందరూ వెడుతున్నారు. ఇహ మేంవెడితే కొంపలంటుకుంటాయా ?" అన్నది.

బెనర్జీ గృహిణి నిరాశా సూచకమైన నిట్టూర్పు విడుస్తున్నట్లు నటిస్తూ— "నేనేం చెప్పనమ్మా ! మీ ఇంట్లో అంతా విడ్డూరం మరీను. అయినా నాకు తెలియకడుగుతానూ - వెళ్ళనివాళ్ళు యెవరు ? క్రొత్తగా పెళ్ళి అయిన ఆడపిల్లలుకూడా వెడుతున్నారుకదా ! వాళ్ళకి మాత్రం మానమర్యాదల్లేవూ !"

తమ యింటికి వెళ్ళిపోదామనే తలంపుతో పెద్ద పెద్ద అడుగులు వెయ్యసాగింది బెనర్జీ గృహిణి.

ఆమె బయలుదేరగానే సుధ యింక మనస్సుని అణచుకోలేక పోయింది. గబగబా గుమ్మం వదలివచ్చి, ఆమె వెనకాలే వెడుతూ— "నువ్వు స్వయంగా వెళ్ళి చూసివచ్చావ్ కదా పెద్దమ్మా! ఎలా ఉంటాడు చూట్టానికి ?" అని అడిగింది.

బెనర్జీ పత్ని ఇంచుమించు వైకుంఠ లోకంవరకు దృష్టి సారించి, నిట్టూర్పులు విడుస్తూ "ఏమేమి చూశానో నేను. అవన్నీ ఈ పాప ముఖంతో ఏమని చెప్పనమ్మా! ఏం చూశానో ఆ అంతర్యామికే తెలుసు. కాని ఆఁ, ఒక్కటి అడుగుతాను సుధా ! అన్నయ్య ఆశ్రయంలోనే ఉంటున్నావనుకో. అలా అని అన్నయ్య ఇంత కఠినంగా శాసిస్తే దాన్ని మన్నించాల్సినంత ఖర్మ ఏమొచ్చింది ? మీ అమ్మ యింకా బ్రతికఉంది. అన్నయ్య ఏం నీ పరలోక బాధ్యతని ఏమయినా వహిస్తాడా ? పోనీ భవిష్యత్తులో అదృష్టం ఎలా రాసిపెట్టిఉందో ఒక్కసారి వెళ్ళి తెలుసుకు రా అమ్మా !" అన్నది.

విచలిత అయిన సుధ ఈసారి సంకల్పం దృఢం చేసుకుంది. ఉత్తేజితమయిన రుద్ధకంఠంతో – "ఏమిటి ? ఎంత కావాల్సి ఉంటుంది పెద్దమ్మా ?" అని అడిగింది.

"ఏమీ అక్కర్లా. ఒక తాంబూలం, పోతే అయిదు కానులు. ఆయనకి యేం, డబ్బుమీద కాపీనంటే వెర్రిదానా ?"

సుధామయి వెనక్కి తిరిగివచ్చి "ఇంక మళ్ళీ గుమ్మంలో నుంచోకుండా సరాసరి లోపలికి వెళ్ళిపోయింది.

• • • •

ఘోషాల్‌గార్ల స్థితి తక్కువదేమీకాదు. వర్ధిష్ణువులైన గృహస్థు లని చెప్పవచ్చు. లోపలివైపు యింట్లో వంటయిల్లు, సరుకులగది, పశువుల చావడి, ధాన్యంఉంచే కొట్టు ఇలాంటివన్నీ మట్టితో కట్టించినవే అయినా, పడకగది మాత్రం గట్టిగచ్చు చేయించినగది. మూడు నాలుగు గదులు, వరండాలు, రస్తామీదికి చాలా దగ్గరగానే కన్పిస్తూంటుంది. కసీసం బాసుల్‌పూర్‌లోని ఇళ్ళ దృష్ట్యా. ఈ రస్తాయే చండీదేవి ఆలయానికి అభిముఖంగా వెడుతుంది.

సుధాముఖి లాగానే విషాదప్రతిమలా వసారాలో కాళ్ళు చాచుకుని కూర్చుని ఉంది వాసంతి. అయితే వీధివైపు వసారాలోకాదు; వంటయింటి వెనుక వసారాలో. ఆ వసారా కిందనుంచి ఓదారి వారి పెరటివైపు చెరువు దగ్గరకి వెడుతుంది. మరొకదారి గుమ్మం చివరనుంచి కొంతదూరం వరకు వెళ్ళి ముళ్ళతోపులో కలిసిపోతుంది.ఆ కలిసిపోయిన దారే కుర్రవాళ్ళందరూ వచ్చేపోయే దారి.

అలా కూర్చుని ఉండగానే ఇద్దరు ముగ్గురు మాట్లాడుకుంటున్న గుసగుసలు వాసంతి చెవిని పడ్డాయి.

"అదుగో అయింది. తలుపు వేసేసిఉంది"

"ముసలిదెంత దయ్యంరా ! తలుపు వేసేసింది.

"గోడ దూకగలవా ?"

"ఫో. చూస్తుంది పద, ఆ పెద్దరస్తానే తిరిగి పోదాం"

వాసంతికి సంగతేమిటో ఊహించటానికెంతోసేపు పట్టలేదు.ఆమె మెల్లిగా లేచి అటూ యిటూ చూసుకుంటూ వచ్చి, చప్పుడుకాకుండా తలుపు గొళ్ళెం తీసింది. ఊరికే తీయటమేకాదు, తపీమని చప్పున ఓ కుర్రవాడి చెయ్యి పట్టుకుని మెల్లిగా "ఏరా కిష్టూ ! నువ్వు మళ్ళీ వెడుతున్నావా యేం ?" అని అడిగింది.

కిష్టు చెయ్యి వదిలించుకోటానికి ప్రయత్నిస్తూ - చిన్ననవ్వునవ్వి మెల్లిగా "మెల్లిగా పిన్నీ ! మీ ఆ దయ్యంలాంటి ముసలి అత్తగారు కనుక విన్నదంటే చచ్చామన్నమాటే.విడిచిపెట్టు, పోతాను" అన్నాడు.

కాని వాసంతి విడిచిపెట్టలేదు. అలాగే పట్టుకుని ఆపి, "ఉండూ! నిన్న వెళ్ళి వచ్చానని చెప్పావుగా! మళ్ళీ వెడుతున్నా వెందుకు?" అని అడిగింది.

కిష్టు యేమిటో చప్పున చల్లారినట్లు అయ్యాడు. కొంచెం బిక్క మొహంతో వెళ్ళాను కాని, ఎక్కడ చూశాను? నేను, గోపాల్, ఉమాపత్, మేమెవ్వరం చూడలేదు" అన్నాడు.

"అదేమిట్రా? ఎందుకని? చూడాలనివెళ్ళి చూడకుండా ఎందుకొచ్చారు?" అని అడిగింది వాసంతి గట్టిగా.

"ఎట్లాచూడ్డం? చూడటానికి డబ్బులక్కర్లేదా యేం?"

వాసంతి ఆశ్చర్యపోతున్నట్లుగా "ఓరి ఎంత తెలివితక్కువ వాడివిరా నువ్వు? ఏదో అణాకాని ఖర్చవుతుందనే భయంతో అంత గొప్ప నారాయణుని చూడకుండా వస్తారా?" అని అడిగింది.

"అణాకానీయే కాని, ఆ అణాకానీ మాత్రం యెవరిస్తారు?" కిష్టూ, విచిత్రమైన భంగిమంగా ముఖంపెట్టి, సాధ్యమయినంత జాలి కలిగించేట్లుగా "నాన్న డబ్బు యిస్తాడా! ఒక్క కానీ కావాలని అడిగితే 'వీపు తాటఒలిచేస్తాను' అంటాడు" అన్నాడు.

"నాన్న అంటాడులే! మగవాడుగా!" వాసంతికి మగవాళ్ళ హృదయ విహీనతని గురించి అనుమానమేమీలేదు. కాని స్త్రీ జాతిమీద అతివిశ్వాసం పెంచుకుని ఉంది ఉంటుంది. అంచేత ఉత్కంఠతో "కాని మరి మీ అమ్మ? మీ అమ్మ ఇవ్వదూ డబ్బులు?" అని అడిగింది.

కిష్టు నిర్లక్ష్యంగా నవ్వి "అమ్మా? ఆ(....అమ్మకాకపోతే మరింకెవరిస్తారు డబ్బులు? అమ్మ యేం మహారాణీయా యేం? నాన్నసలు అమ్మకి మాత్రం యిస్తేకదా!" అన్నాడు.

వాసంతి ఆత్రంగా "సరే, నేనిస్తాను నీకు డబ్బులు! మీరు వెళ్ళి చూచివచ్చి ఏమేమిచూసిందీ నాకు మరి సరీగ్గా చెప్పగలరా?" అని అడిగింది.

కిష్టు, అతడి సావాసగాళ్ళిద్దరూ "తప్పకుండా చెప్పగలం. సరీగ్గా చెప్పగలం. ఇయ్యి మరి డబ్బులు!" అన్నారు.

వాసంతి గబగబా కొంగుముడి విప్పి, ఓ అర్ధరూపాయి ఆ జట్టు నాయకుడైన కిష్టూ చేతి కిస్తూ "ఈ అర్ధరూపాయి తీసుకోండి. ముగ్గురూ చూసిరండి. ఓ కానీవో, అర్ధణావో ఆకు వక్క కాని పట్టుకెళ్ళండి" అన్నది.

కిష్టు ఎంతో ఆప్యాయంగా అర్ధరూపాయి గుప్పిటితో పట్టుకుని, ఓ చిన్ననవ్వు నవ్వి"మిగిలిన డబ్బులు మళ్ళీ వచ్చి తిరిగిచ్చి వెడతాను" అన్నాడు.

వాసంతి నవ్వింది.వాత్సల్యంగా కిష్టు తల అటూ యిటూ ఊగిస్తూ "ఉండనియ్, ఉండనియ్. మంచి లెఖ్ఖగాడివే అయినావులే. మిగిలిన డబ్బులు తిరిగి వచ్చాక మళ్ళీ ఇవ్వక్కర్లేదులే.కాని ఆ డబ్బులతో మీరు చాక్లెట్లు కొనుక్కోండి" అన్నది.

ఆశ్చర్యం, ఆనందం, అమితగౌరవమూ మిశ్రితమైన ఒక అపూర్వమైన ద్యుతి ఆ గ్రామ్య బాలకుల ముఖాల్లో తళుక్కున మెరసింది. ఘోషాల్‌గారింటి పిన్ని మంచిది నిజమే. కాని ఇంతమంచిదా!

కుర్రవాళ్ళు ముగ్గురూ కృతజ్ఞతని చెప్పుకోటానికి తగిన మాటల కోసం తడుముకుంటున్నట్లున్నారు. హఠాత్తుగా ఏమీ చెప్పకుండా తుర్రుమని పారిపోయారు. వాళ్ళు అలా చేసినందుకు వాసంతి ఆశ్చర్య పోలేదని చెప్పటం అనవసరం. ఎందుకంటే వాళ్ళు అలా హఠాత్తుగా తుర్రుమనటానికి కారణమేమిటో వాసంతికి ఆంతర్యంలో తెలియనిదికాదు. వెనుకనుంచి నిభానని వస్తోందక్కడికి - అని ఆమె గ్రహించింది. అలా ఊహించుకుని వాసంతి గబగబా ఒక విధమైన నిర్లిప్తత, నిస్పృహ భావాన్ని ముఖంలోకి తెచ్చుకుని కూర్చుంది.

నిభానని అటూ ఇటూ చూస్తూ, ముఖం వికృతంగాపెట్టి, "ఆ కుర్రవెధవలు ముగ్గురూ అలా పారిపోయారేం వాసంతీ!ఏమిటి సంగతి?" అని అడిగింది.

వాసంతి దానికి ప్రాధాన్యం యేమీ ఇవ్వకుండా "సంగతేముంది

అత్తయ్యా ? కుర్రవాళ్ళ నడకంటేనే పరుగు అసలు ! ఉన్నట్లుండి ఏం గుబులు మల్లిందో తుర్రున పారిపోయారు" అన్నది.

నిభానని జలద గంభీరస్వరంతో "చేపని ఆకుతో కప్పిపుచ్చి లోకాన్ని మాయపుచ్చితేమాయపుచ్చు వాసంతీ ! కాని ఈ నిభానిని మాత్రం మాయపుచ్చాలనిచూడకు. వాళ్ళేదో తప్పకుండా చేచిక్కించుకుని పోయి ఉంటారు. నే కళ్ళారా చూశాను. కిష్టు ఏదో గుప్పిటితో పట్టుకుని పరుగెత్తుతున్నాడు" అన్నది.

వాసంతి కేవలం అమాయకంగా — "చూడండి విడ్డూరం ! ఏం చేచిక్కించుకుపోతాడు? చెట్టంత మనిషిని నే నిక్కడ నుంచుని ఉండగా. ఏమయినా చేతికి దొరికితేమాత్రం అయినట్లేనా ?" అన్నది.

"నువ్వా?" నిభానని ఒక్క విసురుతో తల యిటుత్రిప్పి "ఇదుగో, నువ్వు యిట్లా ఊరికే సమర్థించుకుంటూ రాకు. 'ఎలికకు పిల్లిసాక్ష్యం' అంటారే ఆతంతు సీది. తలుపు ఎవరు తీశారసఖ చెప్పు" అని ఝుఙ్ మంది.

ఈ మాట మధ్యలో సుధాముఖి వచ్చిం దక్కడికి.

బెనర్జీ గృహిణితో మాట్లాడుతున్నప్పుడు ఆమె ముఖంలో కన్పించిన ఉత్తేజన ఇప్పటికీ ఆమె ముఖంలో అలాగే ఉంది.

"అమ్మా ! బెనర్జీగారింటి పెద్దమ్మ ఏమన్నదో విన్నావా ?"

"ఏ సంగతి ?" అని అడిగింది నిభానని గతుక్కుమని.

"సరనారాయణుల సంగతే. ఇంకా ఏ సంగతి ? నాస్తికుడయిన కొడుకుతో కలిసి నువ్వు కూడా నాస్తికురాలివయి పోతున్నావ్! లేకపోతే దేశంలోని వాళ్ళంతా జన్మ సార్ధకం చేసుకోటానికి వెడుతున్నారూ, మన కొంపలో మాత్రం ఎవరికీ కదలికన్నమాట లేదు" అన్నది సుధాముఖి.

నిభానని ఎటూ తేల్చి చెప్పలేని ధోరణిలో - "అవన్నీ డబ్బు గుంజటానికి వేసే మాయవేషాలు అని చెపుతున్నాడు శశిధర్ మరి" అన్నది.

"అన్నయ్య అలా అననిది యెవర్నీ? గోవులన్నా, బ్రాహ్మలన్నా అన్నయ్యకేనాడైనా భక్తి, గౌరవాలనేవి ఉన్నాయా? గురువులు, పురోహితులంతటి వాళ్ళనికూడా ఎగతాళిగా 'బుడి చెంబుల వాళ్ళు' అంటాడు. అన్నయ్య చెప్పినట్లే నడచుకోవాలా యేం? బెనర్జీగారింటి పెద్దమ్మ స్వయంగా వెళ్ళి చూసివచ్చింది శంఖచక్రగదా పద్మధారి అయిన నారాయణుని. భూతభవిష్యత్తులన్నీ చెప్పారుట"

విభావరి మళ్ళీ సందేహాన్ని వ్యక్తంచేస్తూ "శంఖచక్రగదా పద్మలు చేయించి తీసుకువచ్చి పెట్టారట" అన్నది.

సుధాముఖి కింక చిర్రెత్తింది—"నీకు అంత సందేహం ఉంటే నువ్వు వెళ్ళొద్దులే. నేను మాత్రం వెడుతున్నా బాబూ!" అన్నది.

* * *

సుధాముఖికూడా వెడుతోంది.

వాసంతి మనస్సు ఏమిటో విలవిలలాడి పోతున్నట్లుంది. శశిధర్ లాగా తాను నాస్తికురాలుకాదు. అదీకాక, ఎడతెరపి లేకుండా ఎప్పుడూ వెళ్ళే యాత్రికుల్ని చూస్తూంటే ఆమె విశ్వాసం మరింత బలపడటం మొదలెట్టింది. ఆ దుర్లభమైన సందర్శనానికి వెళ్ళలేకపోయానే అన్న దుఃఖంతో తనతోపాటు వెళ్ళలేకపోయిన వ్యక్తి సుధాముఖికూడా ఉన్నది కదా అనే సాంత్వన ఉంటూ వచ్చిందిన్నాళ్ళూ. కాని ఇప్పుడిహ ఆ సాంత్వన కూడా లేకుండా పోతోంది.

అత్తగారు, ఆడబిడ్డల యెదుట ఆమె సహజంగా దేన్ని గురించి చటుక్కున బయటపడి మాట్లాడదు. కాని ఇప్పుడిహ నిబ్బరంగాఉండలేక పోయింది. ఆత్రంగా - "బెనర్జీగారింటి 'పెద్దమ్మ'గారేమన్నారు వదినా! భూతభవిష్యత్తులన్నీ తెలుసుకుని వచ్చారా?" అని అడిగింది.

"ఆఁ. అదింకా చెప్పాలా? ఇలాంటి సుయోగం మళ్ళీ వస్తుందా? ఓ తాంబూలం, అయిదు కాసులూ పెట్టడం అక్కడ. అంతే. తూర్పు ముఖంగా నుంచుని మూడు ప్రశ్న లడగటం. అడగటం తరువాయిగా లోపలి మందిరంలోంచి సమాధానం వచ్చేసేస్తుంది"

వాసంతి కొంచెం ఆశ్చర్యపోతూ - "మూడు ప్రశ్నలకంటె యెక్కువ అడగటానికి వీల్లేదా ?" అని అడిగింది.

"ఎందుకు అడగకూడదూ ?" సుధాముఖి అన్నీ తెలిసినదానిలా చెప్పింది - "డబ్బుఖుంటే సరి, కోటి ప్రశ్నలయినా అడుగచ్చు. ఒక్కొక్కసారికి మూడేసిప్రశ్నలు. నారాయణులేం చిన్నపిల్లలుకారు– ఏదో మాయచేసి, ఒక్క దక్షిణకే పది ప్రశ్నలడిగి సమాధానం రాబట్టు కోటానికి.... హూఁ.... అమ్మా ! నే వెళుతున్నాను. రెండణాలు డబ్బు లియ్యి"

నిభానని విసుగుతో - "డబ్బులడగగానే డబ్బులు నాదగ్గిర ఎక్కడివే ? లేవు నాదగ్గిర. శశిధర్‌ని ఇంటికి రానియ్" అన్నది.

సుధాముఖి వసారాలో కూలబడి - "అన్నయ్య వస్తే అప్పుడు నువ్వు నాకు రెండణాల డబ్బులు యివ్వగలవన్నమాట ! ఎందుకమ్మా ! ఇంత విడ్డూరమైన మాటలు ! రెండణాల డబ్బులులేవూ నీ దగ్గిర ?" అన్నది.

"ఎలా ఉంటాయి ? ఎక్కడినుంచి వస్తాయే ? ఎంతడబ్బా — ఇరవైనాలుగు గంటలూ ఇంటికింద గుండమైపోతూంటే, అహర్నిశలూ అగ్నిలో ఆజ్యం పోసినట్లేగా ఖర్చు ! నీ సరదాలూ, ముచ్చటలూ తీర్చు కుంటూ రావటంతోనే చేతిలో చిల్లిగవ్వలేని దాన్నయాను. ఇప్పుడే నీ కొడుకు మారాం చేసి చేసి, రెండణాలు తీసుకుపోయాడు" అన్నది నిభానని.

"ఎవరు ? బాదలా ?" అంటూ సుధాముఖి జాడించటం మొదలెట్టింది. "అమ్మమ్మవి, నువ్వు మనుమడికి రెండణా లిచ్చినందుకు ఆడిపోస్తున్నావా ? ఎంత చచ్చిన చావూ నాకు ? అందుకనే నీ కంటికి చిల్లపెంకునయి పోయాను నేను. అయినా అదీ అడుగుతాను. 'ఇవ్వలే'నంటే మాత్రం యెలా కుదురుతుంది. అప్రయోజకుడికి తీసుకెళ్ళి కూతుర్ని కట్టబెట్టినందుకు ఆ కర్మఫలం అనుభవించాల్సిందే !"

వాసంతి ఇంతసేపూ ఆకాశంకేసి చూస్తూ,భూతభవిష్యత్ స్వప్నాలలో మైమరచి ఉన్నట్లుంది. తల్లీ, కూతుళ్ళ 'తియ్యని సంభాషణ'తో

వర్తమానంలోకి తిరిగి వచ్చి, ఆదరా బాదరా కొంగుముడి విప్పుతూ—
"ఇదిగో వదినా తీసుకో, ఉన్నాయిలే" అన్నది.

సుధాముఖి వాసంతి నేదో కనికరిస్తున్న ధోరణిలో చెయ్యి చాచి-
"ఇయ్యి. ఆర్జించేది అన్నయ్యయినా వడ్డించేది వదినే అని సామెత
ఉందిగా" అన్నది.

డబ్బులు చేతిలోపడ్డాక ఇంక ఒక్కనిమిషం ఆగలేదు సుధాముఖి.
పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ చండీతలాకి బయలుదేరి వెళ్ళింది.

నిభానని కొరకొరలాడటం మొదలెట్టింది."నా ముఖంమీదే కొంగు
ముడి విప్పి డబ్బులు తీసి పారేసింది. పెద్దవాళ్ళనే గౌరవమర్యాదలే
లేవు. ఎందుకుంటాయి ? శశిధర్ బాగా అలుసిచ్చాడు. కన్నతల్లి గడ్డ
అయింది, పెళ్ళాం కొంగున డబ్బుల మూట ! కలి ఘోరకలి !"

నిభానని కలియుగాన్ని ఎంత పదినోళ్ళతో ఆడిపోయటం మొద
లెట్టినా, అవేవీ వాసంతి చెవి కెక్కలేదు. ఒక్క ప్రశ్నని గురించే ఆమె
మనస్సంతా వ్యాకులమయింది.

భవిష్యత్తు ?

"ఏమిటా భవిష్యత్తు ?"

వాసంతి దృష్టికి అంతా ఒకటే కొండరాతి గోడ. దానికెక్కడా
రవంత పగులుకాని, రంధ్రంకాని లేదు - ఇంత వెలుగుకాని, గాలికాని
చొరటానికి. ఇంతకంటె 'ఉద్ధరింపు' ఏముంటుంది తనకు ? ఈ అంధ
కారాన్ని ఛేదించుకుని ఎప్పటికయినా వెలుగనేది చొరబడుతుందా ?

ఇంత విస్పష్టంగా ఆలోచించలేదు వాసంతి. ఏదో అర్థంకాని ఉపా
యం తోచని వ్యాకులత మనస్సుని ఆవరించు కుంటుంది. పెళ్ళికి ముందు
వరకు వాసంతిది యెప్పుడూ నవ్వుతూఉండే స్వభావం.పృథివిలోని రూప
రసగంధ స్పర్శాదు లన్నిటిమీదా ఆమెకి ప్రబలమైన ఆకర్షణ ఉండేది.
పరిసరాలన్నిటినీ ఎంతో ఉజ్వలంగానూ, మైమరపించగలిగేట్లుగానూ
చేసుకునేది. కాని ఏమైనా అత్తవారిల్లనేది అడకత్తెర....వాసంతిని అత్త
గారు, ఆడబిడ్డ, భర్త ముగ్గురూకలిసి అణచివేశారని చెప్పవచ్చు.

ఆడవాళ్ళ విషయంలో వాళ్లు ఎలా సంచరించటం భావ్యం, ఎలా సంచరించటం భావ్యం కాదో దాన్ని గురించిన సూత్రాలు వెయ్యిదాకా నోటికివచ్చు నిభాననికి. కూర్చున్నా,లేచినా వాటినన్నిటినీ సద్వినియోగం చేస్తూ వచ్చిం దింతకాలమూ. ఇప్పటికీ చేస్తూఉంటుంది. ఇహపోతే ఈర్ష్యావిషం మనిషిని ఎంతవరకు దగ్ధం చేస్తుందో దానికి ప్రబలమైన ఉదాహరణ సుధాముఖి. పేరు మహత్తులో ఆమె ఇంచుమించు 'పద్మ లోచనకి సమగోత్రురాలే.... ఇహపోతే, శశిధర్.

లోకం దృష్టికి శశిధర్ చాలా చెడ్డవాడా అంటే అదికాదు. కొంచెం కటువుగా మాట్లాడుతాడు అన్నమాట ఒక్కటి తప్పించి అతణ్ణి గురించి వేరే అపప్రథ ఏమీలేదా వాడకట్టున. భర్తగాకూడా అతణ్ణి అత్యా చారి అని కాని, పీడించేవాడు, పాషండుడు, దుష్టుడు అని కాని యేమీ అనటానికి వీల్లేదు. కాని ఒక్కదోషంవల్లనే వాసంతి జీవితాన్ని అతడు దుఃఖమయం చేయటంలో కృతకృత్యుడు కాగలిగాడు. అతడు భార్య విషయంలో 'అతిజాగ్రత్త'గా ఉంటాడు.

అంటే - పట్టించుకోకుండా ఉండే భర్త ఎంతో దుఃఖదాయకుడు నిజమే. కాని మరి అతిజాగ్రత్త తీసుకునే భర్తో? భార్యని సర్వ ప్రపంచ దృష్టికీ చాటుగా దూరంగా ఉంచాలని తాపత్రయపడే భర్త ? అన్ని విష యాల్లోనూ ఎంతో స్నేహశీలి అయినా అకారణమయిన సందేహంతో ఆగ్రహపడే భర్త ?

బహుశా ఇంత ఉత్కటమైన సుఖంకంటె, హృదయవిదారకమైన దుఃఖమే నయమేమో !

కాని దోషం ఎవరిమీద మోపటానికీ వీల్లేదు. నిభాననికి ఆజన్మ సంచితమైన కుశిక్షణ - ఆ శిక్షణల ఫలితంగా కోడల్ని అణచివుంచటమే అత్తగార్ల జాతి ఏకైక కర్తవ్యం, అన్నంతవరకే ఆలోచించటం అల వాటు. సుధాముఖి సంగతి చెప్పాలంటే ఆమెలో ఈర్ష్య తప్ప ఉదార తనేది ఎక్కడినుంచి వస్తుందసలు ? ప్రపంచాన్ని ప్రేమదృష్టితో చూడ గలిగిన కళ్ళు ఎక్కడనుంచి వస్తాయి ఆమెకి ? అభాజనుడైన భర్తతో,

బిడ్డతో పుట్టింట్లోపడి ఉండే ఆడదానికి ప్రపంచమంతా హాలాహలమయం తప్ప అంతకంటె ఏమీకాదు, ఇహపోతే శశిధర్ !

ఆలోచిస్తే శశిధర్ మనస్తత్వం మాత్రం ఎందుకు అంతుపట్ట కుండా పోతుంది ? వాసంతి నతడు పెళ్ళి చేసుకున్నాడు — నిజమే. పేదయింటిపిల్ల వాసంతి. పెళ్ళి అయినప్పటినుంచి ఇక్కడే పడిఉంటూ తమ కుటుంబంలో చెప్పులకి పాలిష్ చెయ్యటం దగ్గిర్నుంచి. చండీ పారాయణం వరకు అన్నింటి భారమూ పైనవేసుకునే వ్యవహరిస్తోంది. కాని శశిధర్ మనస్సులో ఎక్కడో తాను అయోగ్యుణ్ణి అన్న భావమేదో ఉన్నట్లుంది.

బహుశా అతడికిలాంటి భావం ఉండటానికి వాసంతి అపురూప సౌందర్యానిదే బాధ్యతయి ఉంటుంది.

* * *

ఇహ మరొకవ్యక్తి ఈ కుటుంబంలో ఉన్నాడు. అతడు సుధా ముఖి భర్త గౌరాంగ్ 'బాడల్'అనే శబ్దానికి కనుక ఏదయినా చిహ్నాన్ని నిలబెట్టాల్సిన అవసరమేవస్తే సునాయాసంగా గౌరాంగ్‌ని తీసుకెళ్ళి నిల బెట్టవచ్చు. చదువు - సంధ్యల ధోరణి అనేది అతడికేనాడయినా ఉందో లేదో చెప్పటం కష్టం. కాని పనిపాటలన్నవి మాత్రం లేవు. నిభానని తన ఒక్కగాని ఒక్క కూతుర్ని తీసుకెళ్ళి అతడి చేతిలో పెట్టింది. అది బహుశా ఆమె తన కాబోయే అల్లుడి రూపాన్ని చూసి, మురిసిపోయే అయిఉంటుంది ? అం. అతడి పేరుమాత్రం సార్థకమైనదే. నామకరణ సమయంలో ఎవరికీ పరిహాస ప్రకృతి రేకెత్తలేదని చెప్పవచ్చు.

అయితే ఇప్పుడు నిభానని రూపవంతుడైన అల్లుణ్ణి 'రబ్బరు బొమ్మ'అని అంటూ ఉంటుంది. అయితే ఆమె అలాఅనటం మరీ అన్యా యంకూడా యేమీకాదు. సంపాదన అంటూ చేతకాని వ్యక్తిని, చేతకాక పోయిందుకు లేశమాత్రమయినా సిగ్గుపడని వ్యక్తిని రాత్రింబగళ్ళు రాగాలు తీసేవాణ్ణి, అవకాశం దొరితితేచాలు తబలాలు తపతప వాయించే

వాణ్ణి, అకారణంగానే అహర్నిశలూ ఆనందసముద్రంలో తేలిపోతూ ఉండేవాణ్ణి అలా అనక. అసలు ఇంకా మరియేమని అనటం ?

భలేవాడు మొత్తానికి గౌరాంగ్. ఈ సంసారంలో అతడు ఇల్లరికపు టల్లుడిలాగా స్థిరంగా ఉండిపోయేవాడే అయినా, అతడి స్థిరత్వం మాత్రం అనిశ్చయం. ఉన్నట్లుగానే ఉంటూ, మధ్య మధ్య హఠాత్తుగా మాయమవుతుంటాడు. ఎక్కడికి వెళ్ళాడు ? ఎందుకు వెళ్ళాడు? అన్న ఆరా తెలుసుకోవటం చాలా కష్టం. వంటచేసి పెట్టుకు కూర్చుని,కూర్చుని చివరికి అతడి కోసం వెతకాల్సివస్తుంది. ఆ వాడవాడ యావత్తూ వెతికి వస్తూ ఉంటుంది నిభానని. ఆవాడకట్టున వున్న కుర్రాళ్ళంతర్నీ పోగు చేసి, సరదాగా పెట్టిన ఓ నాటక సమాజం వుంది. అక్కడికికూడా వెళ్ళి తొంగి చూసి వస్తూ ఉంటుంది. గౌరాంగ్ కనుక కనపడకపోయా రంటే, ఆ జట్టులో వున్న వాళ్ళనందర్నీ తిట్టి,దుమ్మెత్తిపోసి మరీ వసూ వుంటుంది.

శశిధర్ మాత్రం వెతకటానికి బయలుదేరడు,గౌరాంగ్ ఎప్పుడు కనబడకుండా పోయినా సరే, శశధర్ 'వాడి చావుకబురు కనుక తెలిసిందంటే దేవుడికో కొబ్బరికాయ కొడతాను' అంటూ వుంటాడు.

సుధాముఖి భర్త యేమయినాడో అన్న దిగులుతో ఏడుస్తూంటుంది. అన్న అనే మాటలకి అభిమానపడుతూంటుంది. తనని యిలాంటి అభాజనుడి చేతుల్లో పెట్టినందుకు తల్లిని అనరాని మాటలన్నీ అంటూ వుంటుంది. ఆ తర్వాత యిహ ఆ వీధీ, ఈ వీధీ, అన్ని వీధులూ చాంద్రాయిణం తిరుగుతుంది.

మాటిమాటికీ ఒకే సంఘటన పునరావృత్తం అవుతూ ఉండటంతో దాన్ని సహించటం అలవాటయిపోయింది — శరీరానికి మనస్సుకీకూడా. గౌరాంగ్ ఇలా చాలారోజులు అయిపులేకుండా పోయినా,మళ్ళీ హఠాత్తుగా ఎప్పుడో అప్పుడు వేళకాని వేళ సాక్షాత్కరించి 'చచ్చే ఆకలేస్తోందని చెప్పి, పెసరపప్పు పులగంవండి పెట్టమని పురమాయిస్తాడని అందరికీ తెలుసు యిప్పుడు.

అయితే అప్పుడు విరహిణి అయిన సుధాముఖి భర్త కోసం పుల గంపంది పెట్టటానికి బదులు ఏంపెడితే బాపుంటుందని కోరుకుంటుందో, అది హిందూస్త్రీల ఐతిహ్యానికి అనుగుణమైనదికాదు. వంటయింటి భారం వాసంతిమీద ఉంటుంది కనుక 'శ్రీరామరక్ష' అవుతుంది.

* * *

ఈ చంచల ప్రవృత్తుడైన గౌరాంగ్‌నిమీద వాసంతి కెందుకు స్నేహపూర్వకమైన ఆదరభావం వుందో ఎవరూ చెప్పలేరు? బహుశా ఉభయుల ప్రవృత్తులలోనూ ఎక్కడో ఏదో కాస్త ఐక్యత ఉండి వుండొచ్చు. వయస్సులో ఎంతలేదన్నా గౌరాంగ్ వాసంతికంటె నాలు గయిదేళ్ళు పెద్దవాడు. కాని వాసంతికి మాత్రం అతడేదో పెద్ద పరిమాణంలో వున్న పసివాడని అనిపిస్తూ వుంటుంది.

సుధాముఖికి కూడా అలాగే అనిపిస్తుంది. అయితే ఆమె తన మనస్సులో ఉన్నమాటని వ్యక్తీకరించటానికి తటపటాయించదు. బిగ్గరగా సరళమైన టీకతో - 'ముసలి పాపాయ్' మీరు అంటుంది. అలా అన్నందుకు గౌరాంగ్ యేమీ కోపం తెచ్చుకోడు. పైగా మరింత రెచ్చ కొడుతూంటాడు పెళ్ళాన్ని.

అతడికికూడా వాసంతిమీద ఒక విశేషమైన గౌరవం, ప్రీతిభావం ఉన్నట్లు సహజంగానే కన్పిస్తుంటుంది. అది నిభాననిని, సుధాముఖిని ఉత్తపలని చేయటానికి సహాయపడుతూంటుంది.

• • • •

ప్రస్తుతం గౌరాంగ్ ఇక్కడలేని సమయం. ఇది అతడి స్వభావ గుణమే అయినా, కాస్త దిగులనేది కలలోకూడా వుండదు. అంచేత సుధాముఖికి కూడా సుఖంలేదు మనస్సుకి. ఇటుచూస్తే పదిరోజులయింది భర్త యింటికివచ్చి. అక్కడేమో నరనారాయణులు ప్రత్యక్ష దర్శనాన్ని ప్రసాదిస్తున్నారు. గౌరాంగ్ అదృష్టంలో నరనారాయణ సందర్శన

భాగ్యం జారిపోతోంది. దాన్నికూడా మనస్సుని సమాధానపరచుకుని సహించలేక పోతోంది సుధాముఖి.

శశిధర్‌కి 'సిరస్తా'లో పని. ప్రొద్దున్నే ఉద్యోగంలోకి బయలు దేరతాడు ఇంటిదగ్గిరనుంచి. మళ్ళీ మధ్యాహ్నం వచ్చి స్నానం, భోజనం కావించుకుని కాసేపు ఓ కునుకుతీసి, విశ్రాంతి తీసుకుని మళ్ళీ సాయంత్రం ఓసారి బయలుదేరుతూంటాడు కచేరీకి.

* * *

ఇవాళ ప్రొద్దున్నే బయలుదేరేముందు వాసంతి సాహసించి భర్త దగ్గిర ప్రస్తావన తీసుకొచ్చింది.

"ఏమండీ! పదిరోజులయిం దివాల్టికి – ఆడబిడ్డ భర్త ఏమయినాడు? రావటమేలేదు ఇంటికి?"

వసారాలో వేసివున్న పూర్వకాలపు తప్తా బల్లమీద కూర్చుని, ఫలహారం అదీ చెయ్యటమయినాక రెండు తమలపాకులు కూడా వేసుకుందామని వక్కపొడి డబ్బీమూత తీస్తున్నాడు. వాసంతి అన్న మాటకి కనుబొమలు చిట్లించి - "ఏమిటంటున్నావ్?" అని అడిగాడు.

వాసంతి శశిధర్ చేతులు తుడుచుకున్న తడితువాల పిండి, విదిలించి మెల్లాలోని దడిమీద ఆరేస్తూ ఆరేస్తూ, కనుబొమలు చిట్లించుకుని– "అనేందుకేముంది? ఆడబిడ్డ భర్త సంగతి కాస్త వాకబుచేసి కనుక్కోరాదా అంటున్నాను" అన్నది.

శశిధర్ భార్య ముఖంమీదికి కుటిలదృష్టి పోనిచ్చి - "ఆడబిడ్డ భర్తకోసం మనస్సు ఆరాటపడుతున్నట్లుందే చూస్తే" అన్నాడు.

'ఆడబిడ్డ భర్త' అన్న మాటని అనవసరంగానే కొంచెం ఒత్తిపలకటం మరచిపోలేదు శశిధర్.

కాని వాసంతి కీ ఎత్తిపొడుపు గ్రుచ్చుకోలేదు. బహుశా ఇలాంటివి ఆమెకి అలవాటయినవే కనుక అయి వుంటుంది. భర్తమాటకి వెంటనే– "ఎందుకు పడదు? తలపుకి రాగానే అది సమయమయినా, అసమయమయినా ఆరాటపడుతూంటుంది" అని సమాధాన మిచ్చింది గంభీరంగా.

"అలా అయితే దాన్ని తుంచివేసుకోటానికి ప్రయత్నించు" అంటూ వంచె కుర్చేళ్ళు దులుపుకుంటూ లేచి నిలబడి, గొడుగు తీసుకోటానికి గోడవైపుకి చెయ్యి చాచాడు శశిధర్.

వాసంతి తపీమని ఆ గొడుగుని లాక్కుని - "చాల్లెండి. ఒక్క నిమిషం ఓర్పు వహించరు. సరే, అవును కాని నాకు ఆడబిడ్డ. కాని మీకు సయానా తోబుట్టువు. ఆమె ముఖం చూసి అయినా మీరతణ్ణి వెత కక్కర్లేదా అని అడుగుతున్నా !" అన్నది.

శశిధర్ గొడుగు లాక్కుని, చంకలోపెట్టుకుని, మెల్లాలోకి వెడుతూ వెడుతూ - "నీలాగా నీ ఆడబిడ్డ అతగాడికోసం ఆరాటపడి అతలా కుతంమయి పోవటం లేదులే" అన్నాడు.

"అహాఁ. వెళ్ళకండి. అర్థంచేసుకోండి"

"అర్థం చేసుకోలేనిదేం వుంది? కళ్ళకి కన్పించటంలా? వాళ్ళిద్దరి మధ్య పాముకీ, ముంగిసకీ వున్నంత పొత్తు"

వాసంతి వెళ్ళిపోబోతున్న భర్త వెనుక వెనుకనే దగ్గిరగా వచ్చి నిలబడి చిరునవ్వు నవ్వుతూ -"మీరనుకుంటున్నదే సరియైనది కాదండీ, ప్రేమంటే ఏమిటో తెలుసా మీకు కాస్తయినా ?" అన్నది.

"ఎందుకు తెలియదు ? భర్తని త్రోసిపుచ్చి పరపురుషునిమీద మమకారం చూపించటం 'ప్రేమ' అంటే" అంటూ గిర్రున తిరిగి దడి తలుపులాగి, వేసేసి వెళ్ళిపోయాడు శశిధర్.

• • • •

తర్వాత సుధాముర్మఖి చతుజ దర్శనానికి వెళ్ళింది. నిభానని వీధి వెంట పెత్తనాలకి బయలుదేరింది. వాసంతి వంటా, వార్పూ ముగించుకుని 'పనిలేని యిల్లాలు పిల్లిపాలు పితికింద'న్న సామెతగా విరిగిపోయిన కత్తిపీట తీసుకుని ముంగిట్లోవున్న బంతిపూల మొక్కలు, చిలకముక్కుపూల మొక్కలకి కుదుళ్ళు తవ్వుతూ కూర్చుంది. ఈ చిన్న పూల తోటంటే వాసంతికి మహాయిష్టం. రోజల్లా ఇంట్లో వందపనుల మధ్య మునిగి తేలుతున్నా ఈ మొక్కల ఆలనా, పాలనా చూడటం మరచి పోదు.

తలవంచుకుని తనపనేదో తాను చేసుకుంటోంది వాసంతి. ఈ సమయంలో దడి తడిక తోసుకుని ఓ వ్యక్తి లోపలికి వేంచేశాడు.

ఒంటిని ఒక హాఫ్ షర్టు.ధోవతి కొంగు చాలా పొడుగు వచ్చేలా కట్టుకున్న పంచె, చక్కని కళగల ముఖమూ, చక్కగా కత్తిరించుకున్న జుట్టూ, బుజాన ఒక పాత హార్మోనియం,చేతిలో త్రాడుగుచ్చి పట్టుకున్న పెద్ద చేప....

ఇతడే శ్రీయుత గౌరాంగబాబు !

పదిరోజుల అదృశ్యానంతరం ఈనాటకీయ సాక్షాత్కారం ....

తడిక చప్పుడవగానే తల యిటు త్రిప్పింది వాసంతి. గౌరాంగ్‌ని చూసి లేచి నుంచుని - "ఓ అల్లుడుగారా! నేను సుధేమో అనుకున్నాను. ఇన్నాళ్ళకి వేంచేశారు బాబుగారు! ఉన్నట్టుండి ఎక్కడ మాయమయారు? చేప యెక్కడ దొరికింది ? మీరే పట్టారా యేం ?" అని అడిగింది కొంచెం పరిహాసపూర్వకంగా.

గౌరాంగ్ కుడిచేత్తో హార్మోనియం పట్టుకుని నెమ్మదిగా, జాగ్రత్తగా బుజాన్ని క్రిందుగా వంచి, దాన్ని వసారాలో దించి – "అమ్మ బాబోయ్ ! ఒక్కసారిగా పాతిక ప్రశ్నలూ ! ఒక్కటొక్కటే అడగాలి. అది సరేకాని, ఇల్లంతా ఇంత చడీచప్పుడు లేకుండా ఉందేమిటి ? అత్తగారింట్లో లేరాయేం ?" అన్నాడు.

వాసంతి నవ్వుతూ దడి తడికెవైపు చూస్తూ గొంతు తగ్గించుకుని- "కొంపముంచారు. ఇప్పుడేవచ్చి పడుతుం దావిడ ?" కాని యిన్నాళ్ళూ ఎక్కడ మాయమయిందీ ఆసంగతి చెప్పనేలేదు" అన్నది.

"ఎక్కడ మాయమయిందీ"అని అంటూండగానే ఎటువైపునుంచి వచ్చిందో హఠాత్తుగా నిభానని మెల్లా మధ్యకి వచ్చి సాక్షాత్కరించింది. నడ్డిన చేతులెట్టుకుని, ఓ చిత్రమైన భంగిమలో నిలబడి, కోడలి కంఠ స్వరాన్ని అనుకరిస్తూ ""ఎక్కడ మాయమయిందీ చెప్పనేలేదు" ఇవాళ ఇదేదో కొత్త అయినట్లు అడుగుతున్నావే. చెప్పకుండా చెయ్యకుండా ఉన్నట్టుండి మాయమవటం అతడికిదే మొదటిసారా యేం ? బావమరది

ఇంట్లో ఊరికే వచ్చే తిండి వుంది, బావమరది పెళ్ళాం చనువుంది. దిగు లేమిటి ? అవునుగాని గౌరాంగ్ ! ఇన్నాళ్ళ తర్వాత ఇలా వేళకాని వేళ ఓ చేపను సంపాయించుకువచ్చి చొరవడటానికి సిగ్గెలా లేకపోయిందీ అంట" అన్నది.

గౌరాంగ్ ఆ చేపను అలాగే తాడు ఊగిస్తూ పుచ్చుకుని ఉన్నాడు. అత్తగారలా అనగానే ఊహించటంమాని, ఒకసారి చేపకేసి చూసి — "సిగ్గా ? ఏదీ లేందే ?" అన్నాడు.

ఆ సమాధానం విని వాసంతి ఫక్కున నవ్వింది. కాని నిభానని ముఖం మరీ భయంకరంగా మారింది. కోపంతో "ఆఁ. అలా ఎందు కనవ్ ? నీ గుణానికి తగిన మాటే అన్నావ్. కాని ఇంటి యజమానురాలి కోపం చేపని చూడగానే ఎగిరిపోయేటంత విలువలేనిదికాదు. ఆ చేపను తీసుకెళ్ళు. చేపంటే జిహ్వ ఊడిపడేవారి కెవరికైనా ఇయ్యి" అన్నది నిభానని.

ఈ మాటకి సమాధానంగా గౌరాంగ్ చేపని పైకియెత్తి దగ్గిరగా అత్తగారి ముక్కుగోళ్ళు ఉబికేట్లుగా పట్టుకుని "ఏమన్నారు ? ఇంత ఫస్టుక్లాసు చేపని ఎవరికయినా ఇవ్వనా ? తీసుకురా చెల్లాయ్ ! చేపని తరిగే కత్తిపీట తీసుకురా !" అన్నాడు.

వాసంతి పరిహాసంగా కనుబొమలు త్రిప్పి, గొంతు తగ్గించి "ఆ కత్తిపీటతో చివరికి మీ ముక్కు కోసుకోవాల్సి వస్తుంది" అంటూనే కత్తిపీట తీసుకురావటానికేనేమో మెల్లాలోంచి అటువైపుకి వెళ్ళింది.

గొంతు తగ్గించుకుని అన్న మాటలు నిభానని చెవినయితే పడ లేదు. కాని ఆ పరిహాసభంగిమ మాత్రం ఆమెకంట పడకపోలేదు. కోడల్ని నిలువెల్లా ఒక్కసారి కోరచూపుతో చూసి, వీరపౌరుషంతో నాలుగడుగులు ముందుకువచ్చి చూపుడు వ్రేలితో బెదరిస్తూ - "జాగ్రత్త. అమ్మాయీ ! ముందుగానే చెపుతున్నా నీకు. ఆ చేపను నువ్వు ముట్టుకో టానికి వీల్లేదు. ఎవరికీ ఇవ్వకపోతే నక్కలూ, కుక్కలూ తిననియ్ ! పదిరోజులు అయిపులేకుండాపోయి "బాబుగారు"చేపని లంచం తీసుకుని

వచ్చాడు మళ్ళీ. నువ్వేమో అతడికి మహా అలుసు ఇస్తున్నావ్ ! నువ్వు కనుక ఆ చేపని ముట్టుకున్నావో ఒట్టే" అన్నది.

వాసంతి వెనక్కి వచ్చి నిరాశా కంఠంతో బుగ్గని వేలేసుకుని— "ఉన్నట్లుండి ఒట్టు పెట్టుకుని కూర్చున్నారేమిటి అత్తయ్యా ! కోపంవస్తే ఇంక మీకేమీ తెలియదు. ముత్తయిదువులున్న ఇంట్లో చేపని వద్దని తిప్పి పంపించవచ్చా ?" అన్నది.

చివరి ఆయుధాన్ని ప్రయోగించింది వాసంతి.

సుధాముఖి, వాసంతి యిద్దరూ ఈ ఇంట్లో ముత్తయిదువులు. ఎవరికి అశుభాన్ని కలిగిస్తుంది నిభానని ? అల్లుడిమీద అపేక్ష, అంతఃకరణలు లేవు నిజమే. కాని కూతురు కట్టుకున్నా, తిన్నా అతడు చల్లగా ఉంటే నేగా ! ఇటు కంటగింపు అయిన కోడలి అతిశయం కాస్త అణగితే కళ్లు చల్లగా ఉంటాయి. కాని ఇక్కడ కొడుకు శశిధర్ సమస్య.

అంచేత గత్యంతరంలేక నిభానని లోపల్లోపల కాస్త నొచ్చుకుంది. కాని దాన్ని పైమాటతో వ్యక్తంచెయ్యటానికి ఇష్టపడలేదు. "తెలుసుగా అమ్మాయ్! కోపంవస్తే నాకు ఒళ్ళు పై తెలియదని. కాని ఒట్టు అంటూ పెట్టాక సూర్యచంద్రులు దిగివచ్చినా రద్దయిపోదు. అయితే అత్తగార్ని నిర్లక్ష్యంచేసి, ఒట్టుని కనుక ఒప్పుకోనంటావా అది వేరేమాట....తారా ! బ్రహ్మమయీ ! మాతా ! జయచండీ తల్లీ ! ఇంతమందిని నువ్వు నీ దగ్గరకి తీసుకుంటావ్, నన్నెప్పుడు తీసుకెడతావ్ మాతా !" అన్నది.

వైరాగ్యంలోని "చరమసూక్తి"ని ఉచ్చరిస్తూ నిభానని రంగస్థలం వదలి వెళ్ళింది.

* * *

గౌరాంగ్ ఆ చేపను మెళ్లాలో వదిలేసి,నిరాశా భంగిమతో చేతులు రెండూ నడుమున పెట్టుకుని లేచి నిలబడి ఉన్నట్లుండి చేతులుతీసేసి, పంచెచెంగు బొడ్డున దోపుకుంటూ - "అత్తగారికి, ఆమె ఆత్మ నివేదనకి పనికిరాదు కనుక ఈ చేప కీ దుర్గతి. ఏం ఫరవాలేదు. నేనే దీనికి పద్ధతి కలిగిస్తాను. ఒట్టు మిమ్మల్ని ఉద్దేశించికాని, నన్ను ఉద్దేశించికాదుగా ! ఇవ్వండి. ఆయుధాన్నిలా ఇవ్వండి" అన్నాడు.

వాసంతి చెయ్యెత్తి అతణ్ణి ఆపనినుంచి నివృత్తుణ్ణి చేసే భంగిమతో "వద్దులెండి గౌరాంగ్‌బాబూ ! ఇంకా లోకులు నవ్వుకునేట్లు చెయ్యక్కర్లేదు. మగవారై వుండి ఇంకా చేపనికూడా తరుగుతారా ?" అంటూ నవ్వింది.

గౌరాంగ్ వీరదర్పంతో - "ఏం ? నావల్ల కాదనేనా యేం ? అయినా మీయింటి పనులు మగవాళ్ళకి చేతకానివంటూ యేమున్నాయి ? నే నడుగుతున్నాను - ఆడవాళ్ళకి తమ పనుల్ని గురించి గొప్పలు చెప్పుకోవటం మహా ఇష్టం. అందుకని మేం ఏమీ చేతకానట్లు నోరెత్తకుండా ఊరుకుంటాం. ఇవ్వండి కత్తి. మీకు ఆశ్చర్యం కలిగేటంత చక్కగా తరుగుతా" అన్నాడు.

"చాలు మహాశయా ! చాలు. మా ఆడబిడ్డ వచ్చాక దానికి సద్గతి కలిగిస్తుంది లెండి. గొప్పలెవరూ చెప్పుకోరు. మీరు ఇప్పటికే రాత్రిం బగళ్ళు కల్గిస్తున్న ఆశ్చర్యానికి అంతులేకుండా వుంది"

గౌరాంగ్ బొడ్డున దోపుకున్న పంచెచెంగు కిందికి వదిలేసి, వసారాలో ఆసన శుద్ధిగా కూర్చున్నాడు. వాసంతి చేపను తీసుకెళ్ళి వంటింట్లో పెట్టి వచ్చింది.

గౌరాంగ్ హార్మోనియంను పంచె చెంగుతో దులుపుతూ దులుపుతూ, నవ్వుతూ — "పోనీవద్దు. అంతకంటె హాయిగా కూర్చుని కాస్త పాట వినండి" అన్నాడు.

కొంప మునిగింది.

ఈ మిట్ట మధ్యాహ్నంవేళ ఒక్కతే ఇంట్లో గౌరాంగ్ దగ్గిర పాట వింటూ కూర్చుంటుందా వాసంతి ? అదీకాక ఇది సరీగ్గా శశిధర్ ఇంటికి తిరిగి వచ్చేవేళ ! ఇంచుమించు తనకి తెలియకుండానే భయంతో ఓసారి దడివైపు చూసి "ఈ డొక్కు హార్మోనియం వాయిస్తూ పాట కూడా పైగా ?" అన్నది.

"డొక్కు అంటే ?" గౌరాంగ్ చకితుడై "ఈ వాయిద్యంకోసమే పదిరోజుల్నుంచి గోవర్ధన్ అధికారి దగ్గిర మఠంవేసుకు కూర్చున్నాను.

తెలుసా? అతగాడు ఇస్తా ఇస్తా అని ఇవ్వకపోవటం మాట అలావుంచి ఇన్నాళ్ళూ ఎంత వేధించాడని! తేలిగ్గా ఇవ్వటానికి ఒప్పుకున్నాడా? చివరికి అనుకున్నదానికంటే రెండు రూపాయ లెక్కువ యిచ్చి,అప్పుడు తీసుకురాగలిగాను ఒడుపుగా. చూడటానికి డొక్కులా వుంటుంది. కాని వస్తువుమాత్రం ప్రస్తుతం చాలామంచిది. తెలుసా? ఆత్రపడతారుదేనికి? కూర్చోండి సావకాశంగా విందురుగాని" అన్నాడు.

వాసంతి యెందుకు కంగారు పడుతుందో అది గ్రహించే తెలివి గౌరాంగ్‌కి ఎక్కడుంది?

అయితే ఈ అమాయక వ్యక్తికి అది అర్థమయేలా చెప్పేటంత నిర్మొహమాటం వహించటం అసాధ్యం వాసంతికి. అతని ఈ చిన్న కోరికని మన్నించటం తనకి యెంత క్లిష్టసమస్యో! ఈ అజ్ఞానుడికి బోధ పడేలా చెప్పటం యెలా? ఆ నిస్సహాయత భావం వాసంతి ముఖంలో, కళ్ళలో, కాళ్ళూచేతుల కదలికల్లోకూడా వ్యక్తంకాసాగింది. అంచేత దడిమీద ఆరేసిన శశిధర్ గావంచాని నిష్కారణంగానే తీసుకొచ్చి దాన్ని చిలక్కొయ్యని పెడుతూ పెడుతూ వాసంతి కొంచెం గొంతు పెద్దది చేసుకునే "చూడండి. పిచ్చిఅనుకోనా? వెర్రి అనుకోనా? బోలెడు పను లెక్కడి వక్కడ అలాగే వున్నాయి. ఇప్పుడు పాటవింటూ కూర్చోనా?" అన్నది.

బోలెడుపనులు.

గౌరాంగ్ అమ్లాన ముఖంతో "బోలెడుపనులు అంటే? ఇంటిల్లి పాదికీ వంటా అదీ చెయ్యటమేగా! హూఁ" అన్నాడు.

వాసంతి ఓసారి ముఖం అటు త్రిప్పుకుని, నవ్వు నాపుకుని,కోపం వచ్చినట్లు ముఖభంగిమ పెట్టి "ఆఁ. అదయితేమాత్రం వదిలెయ్యమంటారా యేం? ఆడవాళ్ళ పనులు ఆడవాళ్ళు చేసుకుంటారు. అందులో సిగ్గుపడవలసిందేమి వుంది? ఇంకా అసలు మీరే సిగ్గుపడాలి. పనిలేదు! పాటలేదు" అన్నది.

గౌరాంగ్ డొక్కు హార్మోనియంమీద నిర్లక్ష్యంగా ఓ చరపు

చరచి "అయింది. అత్తగారితో, ఆడబిడ్డతో కలిసి ఏకమవటంతో వాళ్ళ గుణం మీకూ అబ్బింది. పనిలేదు, పాటలేదు. మీ ఆయనలాగా కచేరీ కాయితాలమీద కలం ఆడించకపోయినట్లయితే పనేమీ లేనట్లు లెఖ్ఖేనా యేం? జగత్తులో పాటలున్నాయి, జంత్రవాద్యాలున్నాయి,రాగాలున్నాయి, సంగీతం వుంది. కనుకనే ప్రపంచం ఇంకా ఇలా నిలిచివుంది. తెలుసా? అవేలేక కేవలం మీరు వంటచేసే పాత్రలుమాత్రమే వున్నా, మీ ఆయన కచేరీ కాయితాలు మాత్రమే వున్నా పాపం ఈ పృథివి పుట్టెడు దిగులు పెట్టుకుని దభీమనిపోయి గంగలో దూకి మరణించాల్సి వచ్చేది. గానం ముందు తక్కినవాటి కన్నిటికీ విలువేమిటి ?" అన్నాడు.

మాట్లాడుతూనే హార్మోనియం రీడ్స్ అలా పైపైన నొక్కుతూనే వున్నాడు గౌరాంగ్, మాట పూర్తికాగానే ఇంక పాట అందుకున్నాడు.

వాసంతి ఈసారి 'ప్రమాదం వచ్చి పడేట్లుంది' అనుకుంది.

శశిధర్ ఇంటికి వచ్చే 'టైం' దగ్గిరకావస్తోంది. సుధకూడా తిరిగి రాలేదింకా. క్షణక్షణానికీ, ఇంట్లోకివచ్చే దారివైపుకి చూస్తూ, ఏదో హఠాతుగా జ్ఞాపకంవచ్చిన ఫక్కీలో "కొంప తీశారు. వంటింటి తలుపు గొళ్ళెం వేసినట్లులేదు. ఇప్పుడే పిల్లివచ్చి పడి చేపనికాస్తా...."

"అరెరె ! చాలు. ఇంకానయం ఇప్పుడైనా జ్ఞాపకం వచ్చింది" అన్నది.

గౌరాంగ్ హార్మోని ఇంకా వాయించటం ఆపి, దాన్ని ప్రక్కకి తోసేసి — "ఇదుగో, ఇందుకే నాకు వచ్చేది కోపం. ఒక్కసారి రెండు నిమిషాలయినా సావకాశంగా కూచుంటేనా ! సరేకాని, ఇంత పెద్దవాళ్లు మీరింత కంగారుపడటం దేనికి చెప్పండి. ఎప్పుడు కాస్త మంచి విషయం వచ్చినా అప్పుడల్లా మీకు పప్పు అడుగంటడమో, కూర మాడిపోవటమో, చేపని పిల్లి యెత్తుకుపోవటమో ఏదో వస్తూ వుంటుంది. ఉస్ !" అన్నాడు.

వాసంతి వెళ్ళిపోవటానికి వెనక్కి తిరిగింది. గౌరాంగ్ మాటలకి దరహాసోజ్వలమైన ముఖాన్ని మళ్ళీ యిటు త్రిప్పి, కనుబొమలు కుం

చించి - "మంచి మంచి విషయాలు పరాయివాళ్ళకి వినిపించవలసిన అవసరమేముంది బాబూ? మీ ఆవిడనే రెండు నిమిషాలు తీరికగా కూచో పెట్టుకోకూడదూ ?" అన్నది.

గౌరాంగ్ నిరాశోపహతునిలా చేతులు రెండూ నెత్తినిపెట్టుకుని - "మా ఆవిడా ? సుధాముఖా ? అయ్యోరామ ! పాట వినటం మొదలెట్టగానే ఆవలింతలొచ్చి పడతాయి" అన్నాడు.

వాసంతి అతడి భావభంగిమ చూసి కిలకిల నవ్వకుండా ఉండలేకపోయింది. గౌరాంగ్‌తో ఎక్కువగా మాట్లాడకూడదు అని మనస్సులో ఎంత గట్టి ప్రతిజ్ఞ చేసుకున్నా శశిధర్‌కి ఇష్టంకాదుగా, ఆ ప్రతిజ్ఞ అమాయకుడు,సదా హాస్యప్రియుడు అయిన ఇతడి ముందు ఎగిరి చక్కాపోతుంది. అంచేత నవ్వటమవగానే శశిధర్ వచ్చాడో లేదో అని భయ భయంగా చూసింది ఇంకోసారి.

* * *

గౌరాంగ్ ఇంతసేపటివరకు సుధప్రసక్తి తీసుకువచ్చే అవకాశం రాకపోవటం వల్లనేనేమో ప్రశ్నించలేదు. ఈసారి అటూ ఇటూ చూసి - "మంచిమాటేకాని, సుధాముఖి ఎక్కడికి వెళ్ళిం దింతకీ ? ఈ మిట్ట మధ్యాహ్నం ఎండలో వీధి పెత్తనాలకెక్కడికైనా వెళ్ళిందా యేం ?" అని అడిగాడు.

కుతూహలప్రియ అయిన వాసంతి కౌతుక ప్రబోధాన్ని అణచుకోలేకపోయింది. చేతులూగిస్తూ - "ఎక్కడికి వెళ్ళిందో తెలుసుకునే అవసరమేముంది మీకు? సుధ అన్నగారు చెప్పనే చెప్పారు సుధకీ, మీకూ పాముకీ, ముంగిసకీ ఉన్నంత పొత్తు" అని....

ఈసారి నవ్వటం గౌరాంగ్ వంతు అయింది. అతడు ఫక్కున నవ్వి - "భలేమాట అన్నాడు శశిధర్ ! అన్నాచెల్లెళ్ళ నిద్దర్నీ కాస్త రెచ్చకొట్టగలిగామంటే చాలు భలే తమాషాగా ఉంటుంది — తెలుసా మీకు ?"

"మీకు తమాషాగా ఉండేది నేచేస్తే బావుంటుందా మహాశయా !

చూడండి. ఈ పొయిమీదిది మాడిపోవటం కనుక వచ్చి చూశారంటే– "ఇంటికోడలు ఇంట్లో పనులన్నీ వదిలేసి, హాయిగా కబుర్లు చెపుతూ కూర్చుంది" అంటారు. అప్పుడిహ కోపంతో ఆ మొహం ఇంతవుతుంది మంగలంలాగా" అంటూ, ఆ మంగలం పరిమాణాన్ని చేతులతో చూపించ సాగింది.

గౌరాంగ్‌కూడా నవ్వుతూ తన చేతులతో ఆ పరిమాణాన్ని మరింత పెద్దదిగా చూపుతూ -"మీరూ ఇంత పెద్ద బానతో అన్నంవండి పడేస్తురు గాని. భోజనమే కోపానికి మహౌషధం. తెలుసా ?" అన్నాడు.

"చాల్లెండి, ఆగండి మీరు. మీతో మాట్లాడుతూ కూర్చుంటే మీ మాటలతో పొట్ట చక్కలయి చావాల్సిందే !"

అని నవ్వుతూ నవ్వుతూ, మళ్ళీపోయి బల్లమీద చతికిలపడింది వాసంతి.

"అందుకనే అంటున్నా హాయిగా కూర్చుని పాట వినండి అని... ఏంచెయ్యను ? మీకు ఇరవైనాలుగుగంటలూ పనులు. లేకపోతే మీకు పాటలు నేర్పికాని విడిచిపెట్టేవాణ్ణి కాను" అన్నాడు గౌరాంగ్.

"పాటలా ? నాకా ? ఛీ ఛీ !"

"భలే, నవ్వులాటగా ఉందా ? ఆడవాళ్ళు పాటలు పాడరూ ? కావాలిస్తే వెళ్ళిచూడండి కలకత్తా ఇంక. నిజం, మీరు మాట్లాడుతూంటేనే కంఠస్వరం ఇంత బావుంటుంది. ఇహ పాటలు కనుక నేర్చుకున్నా రంటే__"

గౌరాంగ్ నోట్లోమాట నోట్లోనేవుంది ఇంకా. హఠాత్తుగా గొడుగు చంకని పెట్టుకుని, ఠీవిగా వచ్చి ప్రత్యక్షమయ్యాడు శశిధర్. వాసంతి ఇంతసేపూ పడిన జాగ్రత్తంతా వ్యర్థమయింది. ఎప్పుడు కాస్త పరధ్యానంలో పడిందో, ఎప్పుడు ఎంతసేపటికిత్రితం శశిధర్ గుమ్మంలోకి వచ్చి నిలబడ్డాడో యెవరికి తెలుసు ? ఠీవిగా ముందుకి రావటమే కంటపడింది.

వాసంతి భయంతో కొయ్యబారిపోయింది.

♦ ♦ ♦ ♦

చూపుల్లో నిప్పులు కురిపిస్తూ ఓసారి భార్య ముఖంకేసి, ఓసారి గౌరాంగ్ ముఖంకేసి చూసి శశిధర్ గొడుగుని యథాస్థానంలో పెట్టాడు. వాసంతి లేచివచ్చి ఆత్రంగా చెయ్యి చాచినా, భుజంమీది ఉత్తరీయం మడతని తానే తీసి చిలకకొయ్యని పెట్టాడు. తర్వాత గౌరాంగ్ వైపుకి గిరుక్కున తిరిగి కోపం,వ్యంగ్యం నిర్లక్ష్యతలతో కూడిన ఓ అపూర్వమైన దృష్టి పరపి, తీక్ష్ణ కంఠంతో - "ఏం ? ఇహ ఎక్కడా రోజులెక్కడా తేరతిండి దొరకలేదా యేం ?" అన్నాడు.

గౌరాంగ్ ధోవతి చెంగుతో ఎంతో శ్రద్ధగా హార్మోనియం తుడుస్తూ, సహజమైన ఉపేక్షాభావంతో "తిండా ? తిండికి కరువా ? కాని భగవంతుడు ఏరోజుకి ఎక్కడ సిద్ధంచేసి ఉంచితే అక్కడే" అన్నాడు.

"ఓ!, మిట్టవేదాంతం నేర్చుకున్నావల్లే ఉండే చూస్తే. కాని నీకిదే చెపుతున్నాను గౌరాంగ్! ఈ ఇంట్లో ఇవన్నీ సాగవు" అన్నాడు శశిధర్.

గౌరాంగ్ అమాయిక దృష్టితో ఓసారి అటూ ఇటూ చూస్తూ— "ఏవన్నీ ?" అని ప్రశ్నించాడు.

"ఇవే, ఈ పాటలూ, సంగీతాలూ, వేళాకోళాలూ, మర్యాదస్తుల లోగిళ్ళు, గానాబజానాలకి ముంగిళ్ళుకావు. తెలిసిందా ? నీ సంగీత సంతోషచర్చలు ఎక్కడైనా నాటకాల కొంపల్లో సాగించుకో. దరిద్రపు వేషాలెక్కడో అన్నీ"

• • • •

'జడ్జిమెంట్' చెప్పేసి, ఒంటిని చెమటతో తడిసిన చొక్కాను విప్పి మెల్లాలోని దడిమీద ఆరెయ్యటానికి వసారాలోంచి మెల్లాలోకి వస్తూ,శశిధర్ బహుశా బుద్ధిపూర్వకమైన నిర్లక్ష్యతలోనే అయి ఉంటుంది అక్కడవున్న హార్మోనియంను కాలితో ఓ త్రోపు త్రోసేసి వెళ్ళాడు.

వాసంతి కరుణ దృష్టితో మెల్లిమెల్లిగా అక్కడినుంచి తప్పుకుంది.

గౌరాంగ్ కంగారుగా దాన్ని పడకుండా పట్టుకుని "ఇస్. కాస్త కిందచూసుకుని నడుస్తూ ఉండాలి బావా ! దీని విలువ, ఘనత తెలుసుకుంటేగా అసలు యెప్పుడైనా ! 'రసమెరుగని రాచిప్పా' అని ఊరికే అంటారా ?" అన్నాడు.

శశిధర్ నూతివైపుకి వెడుతున్నాడు. వెడుతున్నవాడల్లా ఆగి వెనక్కి తిరిగి "ఏమిటి ? మళ్ళీ పరాచకాలు మొదలెడుతున్నావా? ఇంకా దాని అదృష్టం బావుంది. విసిరిపుచ్చుకుని గోడవతల పారెయ్యలేదు. కాని నేనిదే స్పష్టంగా చెపుతున్నా గౌరాంగ్ ! నీకు యెంతమోజయినా హార్మోనియంని నా యింట్లో అట్టిపెట్టటానికి వీల్లేదు. దాన్ని మీ నాటకం కంపెనీ కొంపలోకి తీసుకెళ్ళి పారెయ్" అన్నాడు.

శశిధర్ నూతిదగ్గిరకి వెళ్ళగానే గౌరాంగ్ ఆ హార్మోనియంని పదిలంగా తీసి, సావిట్లో గదమంచెమీద పెట్టివున్న ట్రంకుపెట్టెల్లో ఓ పెట్టెమీద పెడుతూ పెడుతూ అస్ఫుట కంఠంతో - "ఫో బావా ! కంపెనీలో తీసుకెళ్ళి పడేస్తే వస్తువు దక్కుతుందా? పదిభూతాలు చేరే ప్రదేశ మాయె అది. నీకు తెలియదు. ఏదో తెలిసినట్లు మాట్లాడేస్తావ్ మళ్ళీ !" అన్నాడు.

* * * * *

గౌరాంగ్ అమాయకుడైనా ఒక్కొక్కప్పుడు అతను మాట్లాడే దాంట్లో పొరబాటు యేమీ వుండదు. భోజనమే కోపానికి పరమౌషధం అనటంలో సందేహం ఏముంది !

భోజనం చెయ్యనుకూడా లేదు. నిండుగా వడ్డించిన విస్తరిముందు కూర్చునేసరికే శశిధర్ మనస్సు కొంచెం మెత్తబడింది. కాసిని చేత్తో నీళ్ళు తీసుకుని నోట్లో పోసుకుంటూనే "ఆ దౌర్భాగ్యుడు తిన్నాడా ?" అడిగాడు.

వాసంతి తల త్రిప్పింది.

వేపపొడితో మొదటిముద్ద కలుపుకుంటూ కలుపుకుంటూ, శశిధర్ కొంచెం ఉదారతగా "అతడికి కాస్త పెందరాళే పెట్టకూడదూ ? పైమేం తక్కువయిందా ఇప్పుడు ?" అన్నాడు.

వాసంతి విసనకర్రతో విసురుతూ విసురుతూ - "ముందు తెలియ లేదు. మళ్ళీ బియ్యం పెట్టాను" అన్నది.

"ఇదిగో చూడు, 'ఆడవాళ్ళ తెలివి అధ్వాన్నపు తెలివి'అని ఊరికే అంటారా ? గృహస్థుల ఇళ్ళలో మిట్టమధ్యాహ్నమప్పుడు ఎప్పుడైనా పొట్టలు లెఖ్కపెట్టుకుని పొయిమీదికి గిన్నె ఎక్కిస్తారా ? చారెడు ఎక్కువ పోసే వండుతూ వుండాలికాని" అన్నాడు శశిధర్.

"వండి పారేస్తే మళ్ళీ మీ అమ్మ ఊరుకుంటారా ? తిట్లతో ఇల్లెగర కొట్టేస్తారాయె !"

విసనకర్ర కిందపెట్టి పాలగ్లాసు ముందుకి జరుపుతూ జరుపుతూ అన్నది వాసంతి.

శశిధర్ విస్తట్లోని చేపతల భాగాన్ని తీసి దానిపని పట్టిస్తూ పట్టిస్తూ "పారెయ్యటమా ? వండిన అన్నం పారేస్తారాయేమి వెక్కడయినా ? ఈ బాసుల్‌పూర్‌లో బిచ్చగాళ్ళు లేరా ? వీధి కుక్కలులేవా ? ఇంట్లో పిల్లలులేరా ? అన్నట్లు నీ భోజనంకూడా కాలేదుగా ?" అన్నాడు.

వాసంతి అపురూపంగా కనుబొమలు విరిచి-"ఆఁ. వండినదాంట్లో కొంత ముందుగానే దేవుకుని తిని కూర్చున్నాగా !" అన్నది.

ఆ కనుబొమ ఎరుపుతో జేవురించిన ముఖాన్ని ఒక్కసారి ముగ్ధ దృష్టితో చూశాడు శశిధర్. భార్యంటే శశిధర్‌కి ఏం తక్కువ పేమనా ? అదేంకాదు. ఏకాంతంగా ఉన్నప్పుడు భార్య చిరునవ్వుకి, మాటలకి, ఓరచూపులకి అన్నిటికీ ముగ్ధుడవుతూంటాడు. కాని నలుగురుండగా మాత్రం చూడడు. అలాంటప్పుడు ఈ నవ్వు, సమాధానాలే అతడి మనస్సులో మంటల్ని రేగిస్తాయి.

ఇప్పుడిది ఒంటరిపాటు. అంచేత ఆ కనుబొమ విరుపుకు ప్రీతిగా కొంచెం ముసిముసి నవ్వు నవ్వి "అందులో తప్పేముంది ? అబ్బో ! ఎంత పతిభక్తి" అన్నాడు.

వాసంతి తన చారెడేసి కళ్ళని సూటిగా భర్తవైపుకి త్రిప్పి అతడి ముఖంకేసి లోతుగా చూసి, తర్వాత అభిమానం తొణికిసలాడుతున్న కంఠంతో "ఏం ? దానికి విరుద్ధం ఏమైనా కన్పించిందా మీకు ?" అని అడిగింది.

మనస్సులోని అనుమానాన్ని పైకి కక్కటానికి మంచి అవకాశం చిక్కింది శశిధర్‌కి. అంచేత విసుర్లో అన్నమంతా కలుపుతూ కలుపుతూ "ఎందుకు కన్పించలా ? నాకేదయితే అయిష్టమో, నాకేది కంటగింపుగా వుంటుందో అదే నీకు ఆనందోత్సాహాల్ని కలిగిస్తున్నట్లు కన్పిస్తుంది. ఇదేనా యేం పతిభక్తికి పరాకాష్ఠ ?" అని అడిగాడు.

ఇది కచ్చితంగా దేనికి ఉపోద్ఘాతమో గ్రహించటానికి వాసంతి మనస్సేమీ వెనుతీయలేదు. అయినా అమాయకురాలిలాగా "మీకు ఏది కంటగింపో అదే చేస్తూ తిరుగుతున్నానా యేం నేను ? బావుంది, బావుంది. ఎంతదాకానో ఎందుకు దేశంలోవున్న ఆడవాళ్ళందరూ "చండీతలా"కి వెడుతున్నారు, చతుర్భుజ నారాయణ సందర్శనం చేసుకుంటున్నారు, నేనలా చూశానా? చండీమాత నొక్కసారి దర్శించుకోటానికైనా వెళ్ళలేనంత పాపిష్ఠురాల్ని నేను" అన్నది.

శశిధర్ ఏమయినా ఈ ఆరోపణకి విచలితుడై పోయేటంత చిన్న కుర్రడుకాదు. అంచేత ఏకంగా తుండూ తుపాకిని ఎగరకొట్టేస్తూ — "చండీమాత ఒక్క ఆగుళ్ళోనా ఉందాయేం ? నీ పూజాగృహంలో లేదూ ? జయచండి పటంలేదు నీ పూజగదిలో. పటమూ, పటమూ ఈ రెండేకదా అసలు మూలం" అన్నాడు.

వాసంతి బహుశా ఆ పటాన్ని ఉద్దేశించేయేమో ఒక్కసారి కైవోడ్పుచేసుకుని "అహ. అది ఉందే అనుకోండి పోనీ, కాని నరనారాయణులది ? దానికింక మన పూజామందిరంలో 'ప్రతిష్ఠ' లేనట్లేనా ?" అని అడిగింది.

నారాయణుడు చతుర్భుజుడు.

హహహ అంటూ నవ్వాడు శశిధరుడు. నవ్వి "అంతా ఒట్టిది. ఒట్టిమోసం అంతా. చండీ తిరునాళ్ళప్పుడు నాలుగుకాళ్ళ మనిషి ఎవడో వచ్చాడని వినలా ? ఇదీ అలాంటిదే. ఈసారి నాలుగు చేతులు. అమాయకుల్ని మాయపుచ్చి, డబ్బు సంపాయించటానికి యెత్తు" అన్నాడు.

భర్త నాస్తికత వాసంతికి పరిచితమే అయినా, ఇంతటి నాస్తికతకి

ఆమె కంపించిపోయింది. భర్త అపచారానికి మనస్సులో దేవునికి క్షమా పణలు తెల్పుకొని కోపంతో "చుట్టుప్రక్కల పది ఊళ్ళనుంచి వస్తున్న ఆడవాళ్ళు, మగవాళ్ళూ అందరూ అమాయకులు. మీరొక్కరే తెలివిగల వాళ్లూ. అంతేనా ?" అంది.

"ఓ ! కచ్చితంగా"

కుడి చెయ్యి అంటది అవటంవల్ల శశిధర్ ఎడంచేత్తో రొమ్ము చరచుకుని "ఆ ఆడవాళ్లు, మగవాళ్ళు అందరూ ఒకటోరకం మూర్ఖులు. స్వర్గంలోంచి భగవంతుడు దిగిరావటం, భూతభవిష్యత్తులు చెప్పటం ఇదంతా ఉత్త 'రబ్బిష్' అన్నాడు"

వాసంతికూడా రేగిపోయింది. ఆమె అతి వ్యంగ్యంగా "ఎందుకు చెప్పరూ ? జగత్తులో లేనివా అవి ! గతాలు గతాలుగా ఉన్నాయి. గదా ధరుడైన భగవంతుడూ ఉన్నాడు. అసలు సంగతి అదికాదు. లోకంలో ఉన్న వాళ్ళందరి పెళ్ళాలూ, శాఖోటక వృక్షాల పెళ్ళాలు ఎవ్వరూ వాళ్ళ కేసి కన్నెత్తి చూడరు.పోతే మీ భార్య మాత్రం దివిజలోకంలోని దివ్యాం గన. పీధిలో అడుగుపెట్టగానే ప్రపంచంలోని జనాభా యావత్తూ ఆమె కేసి గ్రుడ్లప్పగించి చూస్తారు. అందుకే మీకింత ఆందోళన" అన్నది.

'శశిధర్ ఒట్టి కొయ్యమనిషి. అతడి హృదయంలో కోమలత్వం అనేదేమీలేదు' అని ఎవరైనా కనుక అనేట్లయితే అది కేవలం పొర బాటే అవుతుంది. అందకత్తె అయిన భార్య ముఖంలోనేకాదు, అసమాన పూరితమైన ఆవేదన అతడిలోనూ ఉంది నిజానికి. అత డిటూ అటూ చూసి నవ్వితే సొట్టలుపడే వాసంతి బుగ్గమీద ఓచిన్న చిటికెవేసి,గొంతు తగ్గించి - ఊఁ. ఇదీ, ఇదీ నిగ్గయినమాట. అందకత్తె అయిన భార్య ఉండటం అపరిమితమైన శోభ అనుకో మనస్సుకి ?" అన్నాడు.

వాసంతి ముఖాన్ని కొంచెం వెనక్కి తీసుకుని "అలా అయితే మంగలిరామి మనుమరాలినే పెళ్ళాడినట్లయితే బెడదలేకుండా పోయేదిగా? అప్పుడిహ పెళ్ళాం చాంద్రాయణం తిరిగినా, సంతకేపోయినా చీకూ, చింతా వుండేదికాదు కదా !" అన్నది.

మంగలి రామి మనుమరాలు ఊళ్ళో కల్లా అనాకారి అని పేరు పడినదని చెప్పడం అనవసరం.

శశిధర్ పీట మీదినుంచి లేచి నిలబడుతూ 'భార్య'ని బజార్లో వదిలేసుకోకూడదు. బందినిగా ఉంచవలసిందే కాని పడక గదిలో" అన్నాడు.

పడక గదిలో ఎందుకయింది. పంజరంలో .... అయ్యో అన్నం అడుగంటు తున్నట్లుందీ ...." అంటూ గబగబా వెళ్ళిపోయింది వాసంతి.

• • • •

వచ్చి చూసేసరికి వంట యింటి కెదురుగా గౌరాంగ్ నిలబడి ఉన్నాడు. అప్పుడే స్నానం చేసి ఒంటిని చొక్కా యేమీలేకుండా నుంచు న్నాడు. ఎండలో నిలబడి, తడిసిపోయిన యజ్ఞోప వీతాన్ని వ్రేళ్ళతో పోగుల్ని విడతీస్తూ ఆర పెట్టుకుంటున్నాడు.

చొక్కా లేకుండా ఉన్న పచ్చని శరీరం మీద ఎండ పడి, నిగ నిగ లాడుతోంది శరీరం....

వాసంతి ఆగిపోయి, ముఖం ప్రక్కకి త్రిప్పుకొని నవ్వి— "ఓ! మేనికాంతి మేలిమి బంగారంలా మెరిసిపోతోంది. సబ్బు రుద్దుకున్నారను కుంటా. ఆహా! ఈ రూపాన్ని ఆడబిడ్డ చూడలేదటండీ ? అన్నది."

చివరి మాట కొంచెం గొంతు తగ్గించి అన్నది. అన్నమాట వేరే చెప్పనక్కర్లేదు. ముందు మాటలు రెండూ వాడి అయిన బాణాల్లాగా వెళ్ళి గుచ్చుకున్నాయి. హాయిగా నిద్రపోదామని పడుకుని ఉన్న శశిధర్ శరీరానికి.

పడుకుని ఉన్నవాడల్లా ఉలిక్కిపడి లేచి కూచున్నాడు. ముఖం లోని నరాలన్నీ ఉబికాయి అతడికి. కళ్ళు కణ కణలాడి పోతున్నాయి.

గౌరాంగ్ నవ్వుతూ— "ఆహా! మీ ఆడబిడ్డ నన్నెప్పుడూ సబ్బు రుద్దుకోగా చూడలేదంటారా ? ....కానీండి. బ్రాహ్మడికి భోజనం వడ్డిం చెయ్యండి. భోంచేసి ఒక్కసారి చండీ తలా కేసి వెడతాను" అన్నాడు.

"అదేమిటి ? భోంచేసి లేచి యిప్పుడే ?"

"ఆఁ వెడతాను." గోడకి ఎత్తి ఉన్న పీట వేసుకుని కూర్చుంటూ మీ ఆడబిడ్డ ఆ గుంపు త్రోపుడికి గువ్వలా కుంచుకుపోయి, క్రొత్తగా వెలసిన నారాయణుని దగ్గరికి చేరుకో గలిగిందో లేదో అసలు ?....ఓ సారి వెళ్ళి చూసి వస్తాను" అన్నాడు.

వడ్డించిన విస్తరికెదురుగా కూర్చుని, వాసంతి రహస్యం చెప్పు తున్నట్లుగా" హూఁ ఆశ్చర్యంగా ఉందే ఆపేక్ష !.... ఆమె అన్నగారు పైగా పాము-ముంగిస అంటారేం మిమ్మల్ని ? అన్నది.

"ఒకరి కొకరం ఎదురవగానే అంతే. చూడండి కాలు గుమ్మంలో పెట్టగానే కయ్యానికి దిగుతుంది. ఒట్టి మొద్దు బుర్ర అన్నమాట కాని, లేకపోతే సుధాముఖి వస్తుతః మంచిదె." అని నవ్వి. మళ్ళీ - "బాదల్ ఇంకా బళ్ళోంచి తిరిగి రాలేదా యేం ?" అని అడిగాడు.

"బడా ?"

వాసంతి నవ్వుతూ అంది— "బళ్ళోకనే వెళ్ళాడు. కాని ఈ మధ్య పిల్లలసలు ఎవరైనా బళ్ళోకి వెడుతున్నారా యేమన్నానా ?" అందరూ చండీతలా దగ్గిరే పడి ఉంటున్నారు.

"ఏమిటి ? ఎప్పుడు వెళ్ళాడు ?"

"ఎప్పుడనగానో వెళ్ళాడు...."

శశిధర్ ఒక్కడూ గదిలో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోటం, వాసంతి గంటసేపు ఆడబిడ్డ మొగుడికి షోడశోపచారాలతో భోజనం పెట్టటం. ఇది శశిధర్‌కి కనుక బుర్ర వేడెక్కించకపోతే, అతణ్ణి సిద్ధ పురుషుడనే చెప్పవచ్చు.

కాసేపు అతడు బలవంతంగా పడుకున్నాడు. కాని అటువైపు నుంచి కిల కిలమని నవ్వులు. పక పకమని నవ్వులు శబ్దవేధి బాణాలు వచ్చి తగిలి, అతణ్ని మంచం మీద ఉండనివ్వలేదు. ఆ నవ్వుల ధ్వని ఆగిపోయాక కొంచెంసేపు నిస్తబ్దత యేర్పడింది. అయినా వాసంతి మాత్రం ఆ చాయల ఎక్కడా లేదు. గదిలోంచి బయటికి వచ్చి, కేక లెడదామన్న పట్ట శక్యం కాని వాంఛని. అతి ప్రయత్నం మీద అణచు కుని, బోనులో పెద్దపులిలా అటూ యిటూ ఊరికే తిరగడం మొదలె

ట్టాడు శశిధర్. గోడనున్న పాత గడియారం గంటలు తప్పు చూపించ వచ్చు. అయినా నిమిషాలు మాత్రం సరిగ్గా చూపిస్తోంది. ఉంది, ఉంది. ఆ గడియారంకేసి చూస్తున్నకొద్ది కోపం మితిమీరసాగిం దతడికి.

* * *

చాలా సేపయాక వాసంతి తమలపాకుల డబ్బా తీసుకుని, గదిలోకి వచ్చింది. ఆమె తెల్లబోతూ-"అయ్యో ! ఇదేమిటి ? అలా తిరుగుతున్నా రేమిటి ? పడుకో లేదూ ?" అని అడిగింది.

ముఖం ఇటు త్రిప్పి, చింతనిప్పుల్లాంటి కళ్ళతో. ఒక్కసారి సహధర్మచారిణికేసి చూసి. మళ్ళీ యిటు తిరిగి, పచార్లు చెయ్యటం మొదలెట్టాడు. తమలపాకుల డబ్బా పక్కమీద పెట్టి, వాసంతి భర్త దగ్గిరకి వెళ్ళి ఒంటిమీద చెయ్యి వేసి, విస్మిత వ్యాకుల కంఠ స్వరంతో "ఏం జరిగిందండీ ?" అని అడిగింది.

శశిధర్ ఒక్క విదిలింపుతో ఆమె చేతిని తన ఒంటిమీది నుంచి తీసేసుకుని, అలాగే పచార్లు చెయ్యటం మొదలెట్టాడు. అయితే అడు గుల వడి మాత్రం హెచ్చింది ఇంకాస్త....

వాసంతి ఈసారి గ్రహించింది. ఇది కోపం తప్ప మరేమీ కాదని కోపానికి కారణం కూడా ఊహించ గలిగింది. తర్వాత యిహ అతడికి సంతోషం కలిగించాలనే కోరిక కలగలేదామెకి. కాంచెం అవమాన జ్వాలతో లోపల్లోపల కుమిలి, కాసేపు భర్త ముఖంకేసి చూస్తూ ఊరు కుని, ఒక్క నిట్టూర్పు విడిచి, మెల్లి మెల్లిగా గదిలో మూల నిలబెట్టి ఉన్న చాప చుట్టల్ని తీసుకుని, బయటికి వెళ్ళటాని కుద్యుక్తురాలయింది.

శశిధర్ పచార్లు చేస్తున్నవాడల్లా తపీమని ఆగి, వెనుక నుంచి "ఎక్కడికి వెడుతున్నావ్ ?" అని అడిగాడు గంభీర కంఠంతో.

వాసంతికి మాత్రం అభిమానం లేదూ ? ఆమె ఈ ప్రశ్నకి సమా ధానం చెప్పలేదు. వెనక్కి తిరిగి మాత్రం చూసింది. కోపం, అభిమానం అవమానం అన్నీ కలసిన భావం వ్యక్తమయింది ఆ ముఖంలో.

శశిధర్ ముందుకు వచ్చి, ఆమె చేతిలోని చాప చుట్టలిని బలవం

తంగా లాక్కొని, ఓ మూలకి విసిరిపారేసి, కోపంతో- "మళ్ళీ ఆ మన సైన అడబిడ్డ మొగుడి దగ్గిరకే వెడుతున్నావనుకుంటా ?" అన్నాడు.

"ఛీ ! ఛీ !"

నల్లటి కళ్ళలో ఎఱ్ఱటి నిప్పులు కురిపిస్తూ వాసంతి గుమ్మం తలుపు పట్టుకుని నుంచుని, "ఇలా మాట్లాడటానికి సిగ్గెయ్యటంలా మీకు ?" అని అడిగింది.

"సిగ్గా ?"

వ్యంగ్యంతో కూడిన వికటపు నవ్వు ఒకటి నవ్వి శశిధర్ తీవ్రంగా అయితే అణచుకున్న కంఠంతో—"ఆఁ నిజమే మరి ! నేనే సిగ్గు పడటం భావ్యం కదూ ! పరపురుషునితో పరాచకా లాడటానికి సిగ్గుపడని వాళ్ల వాళ్ళే అంటా రిలాంటి మాట-" అన్నాడు.

వాసంతి రెండు చేతులతో చెవులు మూసుకుని, అస్ఫుటమైన ఆర్తనాదం మాత్రం చేసింది. ఏమీ మాట్లాడలేదు.

శశిధర్ హఠాత్తుగా ఏమాలోచించుకున్నాడో తెలియదు. వాసంతిని చెయ్యి పుచ్చుకుని బలవంతంగా లాక్కొని వచ్చి, మంచంమీద కూలేసి, తీవ్ర కంఠంతో- "చాలా నటన కనపరుస్తున్నావ్‌లే కాని ఇంతసేపూ జరిగిందేమిటి ?" అని అడిగాడు.

వాసంతి మాట్లాడలేదు. ఆరక్త ముఖంతో భర్త పిడికిలిలోంచి చేతిని వెనక్కి లాక్కోటానికి మాత్రం ప్రయత్నిస్తూ ఊరుకుంది.

కాని పిత దెక్కల్లాంటి అతడి సన్నటి గట్టి వేళ్ళ మధ్యనుంచి చేతిని వెనక్కి లాక్కోవటం ఆమెకి సాధ్యపడలేదు. వ్యర్థ ప్రయత్నపు లజ్జ వల్ల చాలాసేపటినుంచి అణచుకుని ఉన్న అశ్రువులు పెద్ద ఇందుగు గింజలంతేసి బొట్లుగా టప టప రాల సాగాయి. సుధ చండీతలాకి వెళ్ళి నప్పటినుంచీ ఆమెకి మనస్సంతా ఎంత బరువెక్కిపోయి ఉందో భగవంతుడికే తెలియాలి.

ఈ సారి కొంచెం ఇరకాటంలో పడ్డాడు శశిధర్. వాసంతి కళ్లలో నీళ్ళు ! శశిధర్ ఈ స్థితిని ఊహించలే దసలు. పరిహాస ప్రియమైన వాసంతి ఈ భర్త అనుమానాన్ని కూడా తరచు పరిహాసంగా భావించే ఎగర గొట్టేది. ఇవాళ స్థితి మాత్రం వ్యతిక్రమం.

చెయ్యి వదిలేసి శశిధర్ మెల్లిగా ఆమెని భుజం పట్టుకుని కొంచెం కుదుపుతూ, తడబడుతున్న గొంతుతో– "హఠాత్తుగా ఇలా ఏడవటానికి ఏం జరిగింది ?" అని అడిగాడు.

వాసంతి ఇంక ఓర్మి వహించలేకపోయింది. పక్కమీద బోర్లగా పడి, వెక్కి వెక్కి యేడ్వడం మొదలెట్టింది.

అహాఁ చివరికి వాసంతే శశిధర్ని అణచివేయ గలిగింది. ఒకటి రెండు గద్దింపులు గద్దించే అవకాశ మివ్వకుండా రపీమని ఏడవడం మొదలెట్టింది.

అయితే ఎవరూ కూడా ఏడుస్తున్నవారిని అలా చూస్తు కూచోలేరు అస్తమానమూ. శశిధర్ కొంచెం బెదరిపోయి, ఆమె భుజాలు పట్టుకుని కుదుపుతూ 'ఏమిటది ? ఏమయినదని ? ఊరుకో ఊరుకో. ఏమున్నది ! ఆడవాళ్ళకి ఈ బ్రహ్మాస్త్రం ఒకటుంది. ఏడుపు !' మా యిష్టం వచ్చినట్లల్లా కుంచేస్తాం. ఎవరైనా ఆజ్ఞ పెట్టబోతే మాత్రం అమాంతం ఏడ్చేసి జయిస్తాం. అన్న తంతు. అంతే !' అన్నాడు.

వాసంతి ఇప్పుడింక ఏడుపు మాని, లేచి కూచుంది.

ముఖంమీద, చెక్కిళ్ళమీద చెదరి పడిన జుట్టును వెనక్కి తీసుకుని, అభిమానోత్తేజిత కంఠస్వరంతో "జయించిందెవరు ? ఓడిపోయే ఉన్నానుగా ! ఇన్ని ఆంక్షలు పెట్టినా ఇంకా తృప్తిగా లేదా ? మంచిదే. అయితే ఈసారి పట్టుమన్ని నాలుగు బాదనుకూడా బాదండి. అది మాత్రం కొరత ఉంచటం దేనికి ?" అన్నది.

"ఆంక్షలు. హూఁ. ఆంక్షలు" శశిధర్ పళ్ళు కొరికి, అణచుకున్న కంఠంతో– "ఆంక్షల్ని ఎవరు మన్నించారు ! ఆ దౌర్భాగ్యపు సైతాన్‌తో అస్తమానమూ. నవ్వులూ. కేరింతాలు కొడుతూ కూచుంటే నాకు బావుండదని ఎన్ని వేలసార్లు చెప్పాను నీకు ? రెండు గంటల నుంచి ఏమిటి అంత మాట్లాడుకుంటున్నది మీరు ?" అని అడిగాడు.

వాసంతి మంచం మీదినుంచి దిగింది. నాలుగు మూలలా పైన గుబ్బలున్న పూర్వకాలపు పెద్ద మంచం అది. వాటిలో ఒక గుబ్బ పట్టుకుని నుంచుని, "ఇంతసేపూ నే నతడితోనే మాట్లాడుతూ కూచున్నానా

యేం ? అతడెప్పుడనగానో వెళ్ళాడు-ఆడబిడ్డని వెతకి తీసుకురావటానికి. ఇప్పటిదాకా మీ అమ్మకి ఏకాదశి ఫలాహారం సంగతి చూస్తూ కూచున్నాను" అన్నది.

ఆమె మాటల చివరివరకు వినే ఓర్పు లేకపోయింది శశిధర్‌కి. గతుక్కుమని, మెడ యిటు త్రిప్పి, "ఆడబిడ్డని వెతకటానికి అంటే ? ఎక్కడికి వెళ్ళింది సుధ ?" అని అడిగాడు.

సుధామణి చాటుగా వెళ్ళిన సంగతిని బయట పెడదామన్న ఉద్దేశము లేదు వాసంతికి, కాని ఇప్పు డతడు బాగా రేగిపోయి ఉన్నాడు. ఎవరిమీదా దయా దాక్షిణ్యాలు చూపడు. అంచేత ఏదో యాదాలాపంగా అంటున్న ధోరణిలో- "ఇంకెక్కడికి ? ఊళ్ళోవాళ్ళందరూ ఎక్కడికి వెడుతున్నారు ?" అన్నది.

"చండీతలాకి వెళ్ళిందా సుధ ?" అంటూ మండిపడ్డాడు శశిధర్.

వాసంతి ఈసారి తమాషా చూడాలనుకుంది. అంచేత నిర్లిప్తురాలిలా, ఉదాసీన భంగిమతో తల పంకిస్తూ-"వెళ్ళింది. ఎందుకు వెళ్ళదు ? ఆమె భర్త కఠిన ఆంక్ష యేమీ లేదుగా !" అన్నది.

ఆమె భర్త ! శశిధర్ నేలని కాలితో తన్నుతూ "దాని భర్త కూడా ఓ మనిషేనా యేం ? ఎందుకూ కొరగాని ఒట్టి పనికిమాలిన పశువు. అయినా అడుగుతాను, నా ఆజ్ఞని లెక్కచెయ్యకుండా అది ఎంత సాహసంతో వెళ్ళింది ?" అంటూ హుంకరించాడు.

వాసంతి తల యిటు త్రిప్పి, అలాగే నిర్లిప్త కంఠంతో- "సాహసం ఎవరికి తక్కువుంది ? అందరికీ నాలాంటి అదృష్టమే పడుతుందా? ఇదుగో నే బందినిలాగానే ఉన్నాను. అయినా అనుమానం, అపనమ్మకం" అన్నది.

శశిధర్ ఈసారి కొంచెం మెత్తబడి- "అనుమానం, అపనమ్మకాల ప్రసక్తి కాదు. నాకు అయిష్టమయినపుడు అతడికి అంత చనువు యివ్వటమా నువ్వా ?" అని.

వాసంతి క్రమశః మళ్ళీ తన సహజ బలాన్ని పుంజుకుంది. అంచేత కొంచెం తీవ్రంగా- "చనువు ఎక్కడిచ్చాను ? ఏమయినా ఇంటి

అల్లుడు. భోజన సమయంలో కాస్త ఆదరణ చూపాలా అక్కర్లేదా ? గరిటె త్రిప్పేదాన్ని నేనాయె : అంచేత."

"అల్లుడు-గిల్లుడు అదంతా నాకు తెలియదు. రేపటినుంచి నువ్వు అతడి భోజన సమయంలో ఉండొద్దు. ఇది నా ఆజ్ఞ !" వాసంతికి కొంచెం చిరాకేసింది. "ఆజ్ఞ ఒకటి యివ్వగానే అయినట్లేనా యేం ? భోజనం సమయంలో ఉండొద్దు అంటే- అల్లుడేం - తానే వడ్డించుకుని తింటాడా యేం ?" అన్నాడు.

శశిధర్ మళ్ళీ మరొకసారి నేల తన్నుతూ- "అన్నీ ఒట్టి పుల్ల విరుపు మాట లెక్కడో ! యేం ? ఇరవైనాల్గు గంటలూ ఏం చేస్తుంటుంది సుధ ? అయినా యింతోటి అల్లుడికీ - అది వడ్డించలేదా యేం ?" అన్నాడు.

"సుధా ?"

అవజ్ఞా వ్యంగ్య మిశ్రితమైన ఓ అపురూప భంగిమని పెట్టి, "సుధ లేకపోతే అల్లుడికి వడ్డించటానికి ఎవరు గరిట పట్టుకు కూచుం టారు ? ఆమెకి అంతసేపూ వాడ-పెత్తనాలు తిరిగి రావటమే సరిపోతుం దాయె !" అన్నది.

'ఆ పెత్తనాలేమిటో వదిలిస్తాను.' అని సుధ లేకపోవడం వల్ల మంచం గుబ్బ మీదనే ఓ చాపు చరుస్తూ- శశిధర్ ఘోషాల్ సంగతి ఇంకా తెలియదు ఎవరికీ ! కోపం వచ్చిందంటే వీడు మనిషి కాడు, తెలుసా ? రేపటి నుంచి కనుక మళ్ళీ సుధ పెత్తనాలకి బయలుదేరినా, నువ్వు అతడికి పీట వేసి వడ్డించడం అదీ చేసినా - చేసినా" అన్నాడు.

వాసంతి వణకిపోతూ-"దుర్గా ! దుర్గా ! కోపమా యిదేమయినా చెప్పరాని వాళ్లు చేసే పనా ! చెల్లెలి శుభా శుభాలుకూడా జ్ఞాపకం రావు !" అన్నది.

"శుభ్రం" ! పల్లు కొరుకుతూ సమాధానం యిచ్చాడు

"చెల్లెలెప్పుడు అమ్మ వంటింట్లో ప్రవేశిస్తుందో అప్పుడు దేవుడికో కొబ్బరికాయ కొడతాను."

చిన్నప్పట్నుంచీ పల్లెటి వాతావరణంలో పెరిగిన శశిధర్ మాటకి

ఈ ఆడంగి తిట్లు యేమీ యెబ్బెట్టుగా లేదు. పల్లెటూళ్ళలో చాలామంది మగవాళ్ళే ఈ ఆడంగి తిట్లను ఉపయోగిస్తూ ఉంటారు.

ఇంక ఆడవాళ్ళు ?

వాడు మరీ అతి స్వల్ప కారణానికే పోనీ ఇతరుల మాట వదిలేద్దాం- తమ సంతానం మీదకూడా తిట్ల వాన కురిపిస్తూంటారు. ఆ తిట్లకి నిజంగా శక్తి అనేదే కనుక ఉంటే ఏం జరిగేదీ భగవంతుడికే తెలియాలి.

బహుశా వారెప్పుడూ ఆ తిట్లలోని అర్థమేమిటో అంత లోతుగా ఆలోచించి చూడరు. కేవలం తమ పెద్దవాళ్ళ దగ్గిర్నుంచి అలవాటు చేసుకొని ఉంటారు.

వాసంతి ఏదో ఆలోచించుకుని, ఒక్కసారి భర్త ముఖంకేసి రెప్ప వాల్చకుండా చూసింది. అసూయా జడిత అనుమాన కుటిలమైన ఆ ముఖంకేసి చూసేసరికి, ఆమెకి కొంచెం మమకారమే తలెత్తింది. కాసేపు చూస్తూ ఊరుకుని, భర్త భుజంమీద ఓ చెయ్యి ఆనించి, నే నడిగే మాట కొక దానికి సమాధానం యిస్తారా ?" అని అడిగింది.

శశిధర్ సమాధానం చెప్పలేదు, కనుబొమలు చిట్లించుకుని ఎదురు ప్రశ్న వేసేటట్లుగా చూశాడొకసారి.

"సరేకాని నాకీ మాటకి సమాధానం చెప్పండి. మీ బావమరిది మీద మీకింత కోప మెందుకో చెప్పండి" అని అడిగింది వాసంతి.

శశిధర్ ఒక్క విదిలింపుతో భార్య చేతిని త్రోసేసి, "అమాయకత్వపు నటన ! ఏమీ అర్థం చేసుకోలేదా నువ్వు ?" అన్నాడు తీవ్ర కంఠంతో.

"చేసుకున్నాను కాస్త కాస్త. కాని విశ్వాసం కలగటం లేదు" అన్నది వాసంతి కొంచెం షాక్ తిన్న దానిలాగా.

శశిధర్ ముఖం వంకరగా పెట్టి, విశ్వాసం కలగక పోవటానికి కారణం ? ఆడబిడ్డ భర్త, బావమరిది భార్య. అతి చనువుగా ఉండటం వల్ల అనర్థా లేర్పడిన కథ లేవీ వినలేదా నువ్వు ? ఇలాంటివి ప్రపంచంలో జరగవా ?" అని అడిగాడు తిక్త కంఠంతో.

వాసంతి హతాశభావంతో - "సరే, కాని సుధ భర్త – అలా ప్రవర్తించేవాడా ? అత డొట్టి పసిబిడ్డ లాంటివాడు" అన్నది.

శశిధర్ నుదురుచిట్లించి - "పసిబిడ్డ ! నిజమే. అతడు పసిబిడ్డ లాంటివాడు కావచ్చు. కాని నువ్వు పసిదానివికాదుగా ! ఏది ఉచితమో - ఏది అనుచితమో - ఆ జ్ఞానం నీ కెందుకు లేకపోవాలి?"అని అడిగాడు.

వాసంతి ఆ సంభాషణని ముగించే ధోరణిలో - చిందరవంద రగా ఉన్న జుట్టు సరిచేసుకుంటూ - విసువుతో - "ఆ జ్ఞానం నాకు పూర్తిగా ఉంది; లేనిదిమీరే. తాడుని చూసి పాము అనుకుని, మూర్ఛ పోతాడు. ఏమనను ? మీ రతణ్ణి అర్థంచేసుకోలేదు. ఈ ప్రపంచంలోని బాలత్వం, కాపట్యం - ఇవేవీ అంటకుండా చాలా పైమెట్టునఉన్న వాడతడు. మీ యీ అసహ్యకరమైన అనుమానంలో అర్థం ఉన్నట్లే ఊహించడతడసలు." అన్నది. శశిధర్ అలవాటు ప్రకారం చేతులు రెండు వెనక్కి కట్టుకుని - పచార్లు చెయ్యడం మొదలెట్టాడు. వాసంతి మాట అనగానే పచార్లుచేస్తున్నవాడల్లాఆగి కటువైనకంఠంతో-"ఉహూం. తెలుసుకోలేదు. పసిపిల్లవాడు ! మేమెవరం అర్థం చేసుకోలేకపోయాం అతణ్ణి. అవతారపురుషుణ్ణిగా గుర్తించావ్నువ్వు. లేకపోతే హద వాడంతకీ తెలిసిపోతుందిగా అందుకని ? అతణ్ణి మెడపట్టుకుని గెంటెయ్యా లసలు. అయినా నిన్నిదే హెచ్చరిస్తున్నాను వాసంతీ ! ఇప్పటికైనా సరిగ్గా ప్రవర్తించకపోయినావంటే – ఇద్దరి ముఖాల్ని ఏదో చెప్పరాని దుర్గతి రాసివుంటుంది" అన్నాడు.

• • • •

శశిధర్ ఏ వ్యక్తిని గురించి యింత విషం వెళ్ళక్రక్కాడో - అతడు తన ఆనందంలో తాను ఉన్నాడు. పెద్ద పెద్ద అంగలేసుకుంటూ అతడు 'చందీతలా'కి చేరుకున్నాడు. జనం గుంపులో భార్యని పిల్లవాణ్ణి వెతుక్కుని వాళ్ళని బయటికికూడా లాక్కువచ్చాడు.

ఇప్పు డిహ ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. దారి వెంట సుధాముఖి పేరు గొప్పలో 'పద్మలోచని'కి సమగోత్రీకురాలే

అయినా - మొత్తానికి ఆమె ముఖంమాత్రం ప్రసన్నంగానేఉంది చూడటానికి. కంఠస్వరంలో ఆనందం వ్యక్తమవుతోంది. చతుర్భుజ దర్శనం చేసుకోగలిగిన ఆనందంతో మనస్సు వికసించటం ఒకటి; దానికితోడు దీర్ఘవియోగానంతరం తలవని తలంపుగా భర్తవచ్చి కలుసుకోవటం ఒకటి.

సుధాముఖి రంగునలుపు. అయినా ముఖంమాత్రంకళగాఉంటుంది. సన్నగా బక్కపలచగా ఉంటుంది కనుక - సహజంగాఉన్న వయస్సు కంటె తక్కువ వయసున్న దానిలా కన్పిస్తుంది. సుధ అలంకార తృష్ణమాత్రం విలక్షణం. ఎప్పుడూ దోర్యాలుండే చీరెలు, చుక్కల చుక్కల బ్లౌజులూ ఒంటిని అంటుకుని ఉండేట్లు ధరిస్తూంటుంది. శిరోజాలు చెక్కు చెదరకుండా ఉండేట్లు దువ్వుకుని యెప్పుడూ సర్వ సాధారణంగా - సినిమాల్లోలాగా చుట్టచుట్టుకుంటూ ఉంటుంది.

ప్రతివిషయంలోలాగా ఈ విషయంలోకూడా వాసంతిది విభిన్న దృక్పథం. అలంకరణ విషయంలో వాసంతి యెప్పుడూ నియమనిబంధనలు పెట్టుకునే రకంకాదు. ఆమెజుట్టు యెప్పుడూ విరబోసుకునే ఉంటుంది. ఒకవేళ యెప్పుడైనా ముడివేసుకున్నా, చుట్టచుట్టుకున్నా - ఆ విషయంలో అంతశ్రద్ధ చూపదు. ఏదో మెలిపెట్టేసు కుంటుంది. అసలు ఆమెకి అలంకరణ విషయంలో మోజు ఉన్నా అది తీరుతుందా లేదా అన్ని విషయం సందేహంకూడాకద్దు. ఒట్టి తెల్లటి చీరెలూ అవీ తప్ప తక్కినవి ఏవయినా శశిధర్ దృష్టికి కంటగింపుగా ఉంటాయి. ఇహపోతే నిభానని కూతురి సరదాలు తీర్చటంలో సుముఖురాలే కాని, కోడలి సరదాలని సమర్ధించేంత ఉదార హృదయురాలుకాదు. కాస్త వెడల్పంచు చీరెలు కట్టుకోవాలని ఉంటుంది. వాసంతికి. దాన్నికూడా 'ఫాషన్' అని వెంటనే వ్యాఖ్యానిస్తుందామె....

• • • •

సుధముఖి ఎంతో ఉత్సాహంతో చెపుతూ వస్తోంది - "పిల్లవాడు మహారాజు అవుతాడు. భర్త 'మతి-గతి' మారుతుంది, అని చెప్పాడు నారాయణులు....అందరికీ అన్నీ చెప్పారు"

ఆరేళ్ళ కుర్రాడు బాదల్ మహారాజు అన్నమాటకి అర్థం ఏమిటో తెలుసుకోలేకపోయినా — అది ఏదో మంచిమాటే అయి ఉంటుందని మాత్రం గ్రహించాడు. అంచేత ప్రసన్నవదనంతో తలయెత్తి - తండ్రి ముఖంలోకి చూస్తూ — ఈ మాటని తండ్రి ఎంతవరకు అర్థంచేసుకొన్నాడో తెలుసుకోడానికి ప్రయత్నించాడు.

గౌరాంగ్ బాదల్ తలని అపేక్షగా నిమురుతూ — "పిల్లవాడు మహారాజు అవుతాడన్నమాట నేనూ చెప్పగలను. హూఁ....ఎవరిబిడ్డ వాడు ! కాని భర్త మతి - గతి మారటమా ? అదేమిటే సుధాముఖీ ? ఈ అభాగ్యుడి మతిది సుధాసాగరానుగతి ! ఆ 'గతి' మారితే నీగతి ఏమవుతుంది?" అన్నాడు.

నవ్వుతూ, తుళ్ళుతూ - చేతులు త్రిప్పుతూనే మాట్లాడాడు గౌరా! కాని సుధకి కోపం రేగింది. హాస్యాలు - పరిహాసాలు అనేది అసలు ఆమె అర్థంచేసుకోలేదు. ఈ విషయంలో అన్నా — చెల్లెలూ ఇద్దరి వైఖరీ ఒకటే. పరిహాసంలోని చమత్కారాన్ని గ్రహించగల సంస్కారం లేదు వారికి. దారి యిటువైపు అంతా నిర్జనంగానే ఉంది. కాని జనం - ఓ చిన్నగుంపు అటునుంచి వస్తున్నారు. సుధాముఖి అటువైపుకే దృష్టిని మరలింపచేస్తూ- "నడిదారిలో ఏమిటీ వెర్రివేషాలు ? సిగ్గూ - శరం కాస్తయినా ఉంటేగా ?" అన్నది....

కాని గౌరాంగ్ ఏమాత్రం లజ్జాభీరుడు కాలేదు. చటుక్కున గొంతెత్తి పాట లంకించుకున్నాడు.

సిగ్గువడిన చెలుదురాడే — నే
సిగ్గు వీడిన చెలువనై తిని,
సిగ్గు వదలి, గృహము వదలి,
శృంగార రూపుని పొందగిలిగితి"

ఇంతలో ఎదురుగా వస్తున్న గుంపుదగ్గరికి వచ్చేశారు. ఆ పాట విని ఒకళ్ళిద్దరు విస్మితదృష్టితో చూశారు. సుధకంట పడకుండా పోలేదు వారిదృష్టి. భర్తకేసి ఓసారి కోపవీక్షణాన్ని విసరి - ఆమె అడుగులు వడివడిగావేస్తూ - నడవసాగింది.

ఆమె వెనుక తండ్రి — కొడుకు.

బాదల్ పట్టలేనంత ఉత్సాహంతో - "ఆర్మణి తీసుకొచ్చావా నాన్నా?" అని అడిగాడు.

గౌరాంగ్‌కూడా పరమోత్సాహంతో - "ఆ తీసుకొచ్చారా నాయనా! తీసుకొచ్చా, పదచూద్దువుగాని - నేర్చుకుంటావా మరి?" అని అడిగాడు.

"ఓ! బాగానే నేర్చుకుంటా. నేర్చుకుంటే 'పార్ట్' ఇస్తారామరి?"

"ఇవ్వకపోవట మేమిట్రా? అందుకేగా అసలు నేర్చుకోవటం! నీకు "నేను వృషకేతు 'పార్టు' ఇస్తాను"

సంతోషంతో ముఖం అంత అయింది బాదల్‌కి-నడుస్తూ నడుస్తూ మళ్ళీ - 'నాన్నా పాట నేర్చుకుంటూంటే మామయ్య వచ్చి కేకలేస్తే? అని అడిగాడు.

గౌరాంగ్ ఆ సందేహాన్ని ఎగరకొట్టేస్తూ - "ఛో - పాట నేర్చుకుంటే అసలు ఎవరైనా కేకలేస్తారా యేం? పాట అనేది స్వర్గీయ సంపద" అన్నాడు.

ఆతడి ముఖంలో ఒక పవిత్ర సుందరభావం ప్రస్ఫుటమయింది. బాదల్ కళ్లు విప్పార్చుకుని - "స్వర్గీయ సంపదా?" అని అడిగాడు.

"అవునా అవును."

బాదల్ ఓ చిన్న పంచెకట్టుకుని, కోటుతొడుక్కుని ఉన్నాడు. పంచె చెంగు ఊరికే తెగలాక్కుంటూ ఉండటంలో అతడు వినాయకుడంత లావు అయినట్లు కన్పించసాగాడు.

"ఏమిట్రా బాదల్? నడవలేకపోతున్నావా?" అని అడిగాడు గౌరాంగ్.

"ధూత్!" అంటూ బాదల్ గబ గబా నడవసాగాడు.

సుధాముఖికి దగ్గరలోకి వచ్చారిద్దరూ.

"ఓ సుధాముఖీ! అంత గబగబా నడుస్తావ్ దేనికి? 'కంగారూ'గా ఉన్నావ్" అని కేకవేశాడు.

సుధాముఖి ఒక్కసారి వెనక్కితిరిగి, నిప్పులుకురిపిస్తూచూసి ఇంకొంచెం గబగబా నడవసాగింది.

"అమ్మ పరుగుచూడు!" అంటూ కిలకిల నవ్వాడు బాదల్.... తర్వాత మళ్ళీ నవ్వుతూనే-"అమ్మకి నువ్వు ఊరికే కోపం తెప్పిస్తావ్ దేనికి నాన్నా?" అని అడిగాడు.

గౌరాంగ్ "హ హ హ" అంటూ నవ్వి – "అరె నాయనా! నువ్వు అన్నీ కనిపెట్టటం నేర్చుకున్నావే!" కోపిష్టి వాళ్ళకి కోపం తెప్పించటం భలేసరదాగా ఉంటుందిరా! మీ అమ్మ, మీ అమ్మమ్మ, మీ మామ - వీళ్ళ ముగ్గురికీ కోపం రావటంచూస్తే, నాకు పొట్ట చెక్కలయ్యే నవ్వువస్తుంది" అన్నాడు.

తండ్రి - కొడుకుల నవ్వులతో, ఆ పల్లెదారి ప్రతిధ్వనించింది. ఈ నవ్వులూ అవీ తనని ఉద్దేశించే అన్న సంగతి ఊహించుకుని, సుధాముఖి కోపంతో రయ్యిన వెళ్ళిపోయి - దఢీమని తలుపు త్రోసుకుని, యింట్లోకిపోయిపడింది.

కాని గౌరాంగ్, బాదల్ - ఆ యిల్లు గుమ్మందాటి "యక్షగాన సమాజం" ఇంటివైపుకి నడిచారు.....

• • • •

మరో రోజునయినట్లయితే, వాసంతి - గౌరాంగ్ ప్రసంగంతో సుధాముఖిని వేళాకోళంతో ఉక్కిరిబిక్కిరి చేసేదే, కాని ఇవాళ ఆమె మనస్సు ఏమీ బాగాలేదు. దిగాలుపడ్డ ముఖంతో - రాత్రివంటకి కూర తరుగుతూ కూర్చుంది. సుధ రాగానే ఓసారి తలయెత్తిచూసి, మళ్ళీ తన పని తాను చేసుకోసాగింది.

సుధ మనస్సుకూడా బరువెక్కి ఉంది. మనస్సులోని ఉత్సాహమంతా ఎందుకిలా ఇగిరిపోవాలి?....ఆ గుంపులో హఠాత్తుగా భర్త ముఖాన్ని మనస్సు ఆనందంతో ఎంత ఉద్వేలితమైపోయింది! ఎంతో ఆనందంతోనే మాట్లాడుతూ వచ్చింది తాను. ఎక్కడో ఏదో రవంత పొరపాటుతో ఇలా అయిపోయింది.

తన తప్పుని గ్రహించలేదు సుధాముఖి. అసలు ఎవరుమాత్రం గ్రహించుకుంటారు ? తప్పంతా భర్తమీదే వేస్తుంది. గౌరాంగ్ తనని అవహేళన చేస్తున్నాడు। కారణం స్పష్టంగా కన్పిస్తూనే ఉంది. గౌరాంగ్ అందగాడు; తాను అనాకారి.

సుధాముఖి చెంపని చెయ్యిపెట్టుకుని, కాళ్ళు చాచుకుని కూర్చుని ఉంది. అలాగే కూర్చుని కూర్చుని, ఆలోచించుకుంటుంది. నారాయణులు భవిష్యత్తు చెప్పారు. భర్త మతిమారుతుందిట । ఎలా మారుతుంది ?

ఆలోచిస్తూ ఆలోచిస్తూ మధ్య మధ్య వక్రపుదృష్టితో ఒకొకసారి వదిన ముఖంకేసి చూస్తూ వచ్చింది. ఆఁ. ఆమే తన అదృష్టం పాలిటి "శని" అయింది. రూపసిఅయిన బావమరది భార్య రూపానికి ముగ్ధుడై పోతున్నాడు భర్త.

అన్నగారిలాగా అనుమానాన్ని స్పష్టంగా బయట పెట్టదు సుధాముఖి. అంత గుడ్డిగా విశ్వసించనూ విశ్వసించదు. ఏమయినా భర్త వాసంతి రూపానికి, గుణానికి ఎక్కువ ప్రాముఖ్య మివ్వటం ఆమె గమనించకపోలేదు. అక్కడే కోపం.

కొంచెంసేపయాక - దడితడిక తలుపు త్రోసుకుని, బాదల్‌ని వెంటపెట్టుకుని గౌరాంగ్ వచ్చాడు. సుధ అలా చెంపని చెయ్యిపెట్టుకుని కూర్చోటంచూసి, బిగ్గరగానవ్వి - "వాహ్ । శకుంతలా । కాని ఇప్పుడు దుష్యంతుడి ప్రవేశం సరియైనది కాదేమో। దుర్వాసమహర్షి ఆగమనం కనుక అయినట్లయితే బాగుండేది" అన్నాడు.

అతడా మాట అనగానే "మామ కచేరీకి వెళ్ళాడు నాన్నా ।" అన్నాడు బాదల్.

"మామా।" గౌరాంగ్ తెల్లబోయి కొడుకు ముఖంకేసి చూశాడు.

బాదల్ అమ్మ నవ్వడంతో-"ఆఁ. మామ పేరేగా దుర్వాసముని। అత్త అంటూ ఉంటుంది. మామ వచ్చి అమ్మని శపిస్తాడా నాన్నా?" అన్నాడు.

సుధాముఖి ఇంక సహించలేక పోయింది. లేచివచ్చి కొడుకుని చెంపమీద ఒక్క దెబ్బకొట్టింది.

ఆ దెబ్బకి బాదల్ కిక్కురుమని ఊరుకోలేదు అని వేరే చెప్ప నఖ్కర్లేదు. పెద్ద రగడ చేశాడు. వాసంతి నిర్లిప్తురాలిలా కూర్చోటం సాగలేదు. లేచివచ్చి కుర్రవాణ్ణి సముదాయిస్తూ దగ్గిర కూచోపెట్టుకుంది. "అమ్మకొడితే ఏడవకూడదు నాన్నా! ఏదీ, ఇటుచూడు నీకు పేలాలు వేయించి పెడతాను" అన్నది.

పేలాలమాట చెవిని పడేసరికి బాదల్ముఖం కలకల లాడింది. అత్తపేలాలు వేయించి పెడుతూంటే వాటిని ఊదుకుని నోటినిండా పోసుకుని తింటూంటే - వాసంతి ఓరకంటచూసి నవ్వుకుంది.

నోటినిండా పేలాలుపోసుకున్న బాదల్ ఉత్సాహంతో-"నాన్నతో కూడా రిహార్సల్కి వెళ్లానత్తా. తెలుసా? నాన్న నాకు "వురుషకేత్" పార్ట్ ఇస్తానన్నాడు" అని చెప్పాడు.

సుధాముఖి కోపంతో మళ్ళీ కొడుకునివచ్చి కొట్టి, ఆయాస పడ సాగింది. కొడుకు అన్నమాటకి మళ్ళీ రుస రుస లాడుతూ, భర్తమీద మండిపడి, "అవునవును. బాదల్ని తీసుకెళ్ళి మీరు నాటకాల సన్యాసిని చేస్తారా? గుణానికి తగ్గట్లే ఉన్నాయి, బుద్ధులూ. చూసి చూసి కొడుక్కి ఎలాంటి "పార్టు" యిచ్చారంటేను! వృషకేతు! మీరు కొడుకుని నరికివేయటానికైనా సరే సిద్ధపడే దౌర్భాగ్యులు!" అన్నది.

గౌరాంగ్ నొచ్చుకోనూలేదు. కోపం తెచ్చుకోనూలేదు. "అరె! నరికినా తండ్రి రెండు ముక్కల్ని అతికించగలవాడైనప్పుడు భయ మెందుకు? బాదల్కి నే నిప్పటినుంచీ ట్రైనింగ్ యిస్తాను. వయసు వచ్చాక యింక నేర్చుకోలేడు. చూస్తానయినా రిహార్సల్లో....!" అన్నాడు.

ఆ మాట అబద్ధంకాదు, చూస్తాననటంకాదు. ఇప్పుడు చూసే వచ్చాడు రిహార్సల్లో,

పదిరోజులు లేకపోయినందువల్ల ఏర్పడిన లోటుని సరిదిద్దటాని కివాళే వెళ్ళాడక్కడికి బాదల్ని వెంటబెట్టుకుని.

వెళ్ళగానే అందరూ కోలాహలం చేశారు.

"అల్లుడుగారూ! అల్లుడుగారూ? ఎప్పుడు వచ్చారు? ఎక్కడ మాయమైనారు హఠాత్తుగా?"

ఈ ఊరి అల్లుడు అని. ఊళ్లో వాళ్ళందరూ గౌరాంగ్‌ని "అల్లుడు గారూ ! అల్లుడుగారూ !" అనే వ్యవహరిస్తూ ఉంటారు. అభ్యర్థన తెల్పడం అదీ అయాక - గౌరాంగ్ స్థిమితంగా కూర్చున్నాక "ఏమిటీ? అందరూ 'పార్టు'లు కంఠస్థం చేసుకున్నారా?" అని అడిగాడు.

హఠాత్తుగా "సభాస్థలి" యావత్తూ నిస్తబ్ధమయింది.

"ఏం జరిగింది? అందరూ మూగవాళ్ళయిపోయారేమిటి హఠాత్తుగా? కంఠస్థం చెయ్యలేదూ ?"

"చెప్పు"- "నువ్వు చెప్పరాదూ?" "ఓ శుభ్రంగా చెపుతాను. నాకేం ?" అంటూ చిన్నరాధ బయలుదేరింది.

"అరె బాబా ! ఏం జరిగింది?"

గౌరాంగ్ లేచి నిలబడి చేతులు రెండూ చాచి - ప్రశ్నించాడు. ఈసారి ఓ కుర్రాడు నోరు తెరిచాడు.

"ఆ ప్రదర్శనం జరగదు"

గౌరాంగ్ చతికిలపడి, తెల్లబోతూ - "ఆ ప్రదర్శన జరగదూ?" అని అడిగాడు.

"ఊహూఁ. ఎవ్వరూ విదురుడు వేషం వెయ్యమంటున్నారు"

గౌరాంగ్ ఆ కుర్రాడి ముఖంకేసి తెల్లబోయి చూస్తూ -

"ఎవరూ విదురుడి వేషం వెయ్యరూ ? ఏమన్నావూ ? విదురుడే హీరో. "విదురుని విందు" అసలు దీనిపేరు, తెలియదూ?—నేప్‌లా! నువ్వు విదురుడు వేస్తానన్నావుగా?" అని అడిగాడు.

నేప్‌లా పౌరుషంగా తలత్రిప్పుతూ-అస్పష్ట కంఠంతో "ఊహూఁ నేను వెయ్యను" అన్నాడు.

"అయితే ప్రాణ్‌కృష్" నువ్వు తీసుకో ఆ పార్ట్ ! నువ్వువేసినా బాగానే ఉంటుంది."

"మాచెడ్డబెడదే తెచ్చిపెట్టారే! ఎందుకనో చెప్పండి. పోర్షన్ చదువుకుని చూడండి, ఎలాంటి పాత్రో ఏమిటో ? బాగా కనుక చెయ్యగలిగితే ప్రేక్షకులచేత కళ్ళనీళ్ళు పెట్టించవచ్చు"

కాని ఇంత ప్రలోభనకికూడా ఎవరూ మెత్తపడలేదు. గౌరాంగ్ అందరి ముఖాలకేసి చూశాడు. అందరి ముఖాల్లోనూ ఒక తిరుగుబాటు వైఖరి వ్యక్తమయింది.

గౌరాంగ్ హతాశుడై, ఇటుకలుబోటుపెట్టి నిలబెట్టిన – కోళ్ళు విరిగిన బల్లమీద కూలబడి, "అసలింతకీ ఏమిటి చెప్పండి. విదురుడి వేషం వెయ్యటానికి అభ్యంతరం యేమిటి ?" అని అడిగాడు.

ఈసారి ఓ కుర్రవాడు పెదవివిరిచి – "ప్చ్ ! విదురుడు పేద వాడుగా !" అన్నాడు.

గౌరాంగ్ నిర్విణ్ణుడయ్యాడు.

"విదురుడు పేదవాడైతే మీకేం ? అతడికి మీ కూతురునిచ్చి పెళ్ళిచేయబోవటం లేదుగా !"

"వాహ్ ! "మీకేం?" అంటే ఎలా ? విదురుడు వేసేవాడు కిరీటం ధరించగలడా ! మఖ్‌మల్ దుస్తులు వేసుకోగలడా ?"

గౌరాంగ్ విస్మయ విస్ఫారిత నేత్రాలతో – "అందరికీ కిరీటాలు' మఖమల్ దుస్తులు కావాలా ?" అని అడిగాడు.

కుర్రవాడు – దృఢనిశ్చయాన్ని ముఖంలో వ్యక్తంచేస్తూ – "కావాల్సిందే ! రాత్రింబవళ్ళూ యెప్పుడూ చినిగిపోయిన గుడ్డలూ మాసినగుడ్డలే వేసుకు తిరుగుతున్నాం. నాటకంలో వేషంవేసినా, అవే వేసుకు కూచోమా ? జరీ, మఖమల్, చెమ్కీ దుస్తులు వేసుకోవద్దా ఒక మాటయినా ? ఈ మానిక్ విదురుడి భార్యవేషం వెయ్యాలి. బెనారస్ పట్టుచీరతప్ప మరొకటి కట్టుకోనంటున్నాడు.

గౌరాంగ్ నెత్తిన చేతులెట్టుకుని, "కొంపముంచావ్!" నీ కీ గుబుళ్ళన్నీ పుట్టించిందెవరు?" అన్నాడు.

మానిక్ కృత్రిమమైన కీచుగొంతుతో – "ఎవరు పుట్టించాలి ? అసహ్యంగా కనిపించడం – అందంగా కన్పించడం ఆ మాత్రం తెలుసు కోలేనాయేం ?" అన్నాడు.

గౌరాంగ్ వారికి ఎన్నో హితోపదేశాలివ్వటానికి ప్రయత్నిస్తూ - "చక్కగా అభినయించడంకాని కావలసింది - అందంగా కన్పించటం కాదు, తెలుసా అది! ఒక భిక్షుకుడి పాత్ర అభినయించికూడా ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చెయ్యవచ్చు - అదికూడా చెపుతున్నా" అన్నాడు. కాని చోరులు ధర్మోపదేశాన్ని వినరు. నేప్‌లా, ప్రాణకృష్ణ ఇద్దరూ ఓ షరతుమీద - వెల్వెట్ దుస్తులు. కిరీటం ధరించే షరతుమీద విదుర వేషం వెయ్యటానికి ఒప్పుకున్నారు.

చివరికి హ "చుక్కాని" నువ్వు నీ పోర్షన్ బట్టీ పెట్టావా?" అని అడిగాడు గౌరాంగ్.

మానిక్ వెంటనే బల్లమీదికి ఉరికి నిలబడి "ఓ మొత్తం అంతా - కొంచెం వింటారా?" అంటూ - కృత్రిమమైన ఆడగొంతుతో - బిగ్గరగా"

"ఏమిభాగ్య - మేమి భాగ్య మీనాడు చెలి
ఏతెంచినారు పేదవాని - కుటికి -"

గౌరాంగ్ చొక్కాకొన పట్టుకునిలాగి. కూచోపెట్టి - వ్యధాకులిత కంఠంతో - "ఆగుబాబూ! చాలుకాని ఆగు. ఇది నీవల్లకాదు. 'ఈ మాటల భక్తిపారవశ్యంలో - గద్గద కంఠంతో నెమ్మదిగా అనాలి' అని ఆ రోజున ఎన్నివిధాల బోధించాను? నారాయణుడు విదురిని కుటీరానికి వచ్చాడు—" అని చెప్పసాగాడు.

"సరే అయితే నెమ్మదిగానే అంటాను." అని అతడు మళ్ళీలేచి నిలబడి - ముక్కుమాటలతో—

అతిధి నెటుల గౌరవింతు -
అర్ఘ్యపాద్యమైన లేదు.

గౌరాంగ్ ముఖంలో నిరాశ వ్యక్తమయింది.

"బావుంది బాబూ! బాగా వచ్చింది. ఇవాళ ఇంతటితో ఆపుదాం" అంటూ చిన్నబోయిన ముఖంతో లేచాడు గౌరాంగ్.

బాదల్ కూడా తండ్రి వెనకాలే నడవటం మొదలెట్టాడు. ఇంత సేపు అతడు ఏం మాట్లాడకుండా బొమ్మలాగా చూస్తూ ఊరుకున్నాడు.

బయటికి రాగానే - "వాళ్లేమీ అర్ధంచేసుకోలేకపోయారు. కాదు నాన్నా ?

గౌరాంగ్ కొడుకు తల నిమురుతూ హతాశాకంఠంతో- "అవును నాయనా ! ఎవరూ అర్థంచేసుకోలేక పోయారు" అన్నాడు.

ప్రొద్దుకుంక బోతూండగా గౌరాంగ్ అప్పుడే తీసుకున్న వాద్య యంత్రాన్ని మళ్ళీ బుజానికి తగిలించుకుని, స్టేషన్ వైపుకి బయలు దేరాడు. ఒంటిని చొక్కాలేదు, ఓ ఉత్తరీయంమాత్రం కప్పుకున్నాడు పైన. గాలికి దాని కొంగులు ఎగురుతున్నాయి. నిర్జనంగా ఉన్న డొంక దారినపడి, తనలో తాను పాడుకుంటూ వెడుతున్నాడు....

• • • •

స్టేషను అంటే - అదేమీ పెద్ద చెప్పుకోతగిన స్టేషన్ కాదు. ప్లాట్‌ఫాం అనటానికి ఎగుడు దిగుడు ప్రదేశం కొంత; నాలుగువైపులా గోడల్లాగా పేర్చి ఉన్నాయి కొన్ని యిటుకలు. రైల్వేకంపెనీ ముమ్ముందు ఈ చోటుని చాలా మంచిస్థితికి తీసుకురాగలదని ఆశ ఉంది. ఆ ఆశకి నిదర్శనంగా - కొంత కంకర, కొంత నలి - గుట్టలుపేర్చి ఉన్నాయి. వీటి మధ్య రెండు కర్రగుంజులకి ఓ చెక్క వేలాడకట్టిఉంది. 'బాసుల్ పూర్' అని వ్రాసి, వానకి తడిసి, ఎండకి ఎండి ఆ చెక్కమీద రాసిన అక్షరాలు రంగుపోయి ఉన్నాయి. దగ్గిరిలోనే ఓ నుయ్యి ఉంది. దానికి అటూ యిటూ పూలచెట్లున్నాయి.

స్టేషన్ అంటూ ఒకటి ఎటూ ఉంది కనుక - స్టేషన్‌మాష్టరు కూడా ఒకరు ఉన్నారు. ఓ రేకులషెడ్ క్రింద బుకింగ్ ఆఫీసూ - అదే స్టేషన్ మాష్టరు రూమ్. పార్శిల్ రూమ్. వెయిటింగ్‌హాల్ - వగైరా అన్నీ ఉన్నాయి.

"స్టేషన్‌మాష్టరు" అన్నమాటలోని గౌరవాన్నివహిస్తూ ఇక్కడున్న వారికి - రాత్రి ఒకసారి, పగలు ఓసారి — రెండుసార్లేవారి

డ్యూటీ.... సాయంత్రం నాలుగు గంటలకి ఓ రైలు వస్తుంది—మళ్ళీ తెల్లవారకట్ల నాలుగింటికి ఒక రైలు వస్తుంది - రూలు అంటూ ఏమీ రాసిపెట్టకపోయినా – బాసుల్‌పూర్ స్టేషన్‌కి సంబంధించినంతవరకు మాత్రం చిన్న పని దగ్గిర్నుంచి పెద్దపని వరకు సర్వమూ అతడి డ్యూటీలోవే....

సగం సగం నెరసిన మీసాలు, అంత పొడుగ్గాకాకుండా పొట్టిగా కాకుండా – కొంచెం లావుగా బొద్దుగాఉండే ప్రౌఢవయస్కుడతడు. భార్యా విహీనుడో, బ్రహ్మచారో - ఆ సంగతి ఇక్కడవరికీ తెలియదు. ఆ రేకులషెడ్‌కిందే - ఒక చివర అతడు ఏర్పాటు చేసుకున్న వంటిల్లుంది. వంట చేసుకుని తింటూ ఉంటాడు. రైల్వే కంపెనీపని శ్రద్ధగా నిర్వహిస్తూంటాడు, కాస్త తీరిక చిక్కిందంటే – నాటకాలూ అవీ రాస్తూ ఉంటాడు.

ఆకారణం మూలంగానే గౌరాంగ్‌తో పరిచయం....

గౌరాంగ్‌కి కేవలం ఆంతరంగికుడు అని చెప్పతగినవాడు - ఈ "మాష్టార్‌దా" ఒకడేనేమో బహుశా. వయసు తారతమ్యం ఇక్కడ లుప్తమైపోయింది. గౌరాంగ్ అవసరమెవరికైనావస్తే - వారు అతడి కోసం కచ్చితంగా ముందు స్టేషన్‌కివెళ్ళి వెతికి వస్తారు. రేకులషెడ్‌గా ఉన్న స్టేషన్‌గదిలో ఒకరు స్టూలుమీద, మరొకరు వీలయినంతవరకు - పాత రికార్డుమూట కట్టిన దస్త్రాలమీద కూర్చుని, ఆకాశ కుసుమ స్వప్నాలుకంటూ ఉంటారు. ఆ స్వప్నాల్లో ఒకటి నాటకం కంపెనీ పెట్టాలనేది. ఒక కంపెనీ పెట్టాలంటే - ఏమేమి అవసరమో - ఆ ఎస్టిమేట్ అంతా సిద్ధంగా ఉంది వారి దగ్గిర. డబ్బు ఒక్కటే సంతనా అయిందంటేచాలు - అంతా అయినట్లే. అందుకే ఆ వాడలోని కుర్రాళ్ళ నందర్నీ చేరతీసి ట్రైనింగ్ యివ్వడం వారిలో ఒక్కరు అనుకున్నంత ఉపయోగకరంగా లేకపోవటంమాట అటుంచి, గౌరాంగ్ ఆశయానికి అందుబాటులోకూడా లేరు ఎవ్వరూ. అయినా పంచదార లేనప్పుడు బెల్లంతో సరిపెట్టుకున్నట్లు - వారికి శిక్షణయిచ్చి, వారిని తయారు చేయడం జరుగుతోంది.

పెట్టబోయే కంపెనీకి పేరుకూడా సిద్ధంగా ఉంది వారి దగ్గిర.

"సంచార వీధి నాటక సమాజం"

పైవారిదగ్గిర్నుంచి నాటకాలు తీసుకోవలసిన అవసరం వారికేమీ లేదు. స్టేషన్‌మాష్టారు తీరికగాఉన్న సమయాన్ని ఒక్క క్షణంకూడా వ్యర్థంచెయ్యరు. రైల్వే కంపెనీ ధర్మమా అని సంగ్రహించి పెట్టుకున్న దస్తాలు దస్తాల కాగితాలమీద ఆపకుండా కలాన్ని నడుపుతూనేఉంటాడు.

దూరంనుంచి గౌరాంగ్‌ని చూడగానే - స్టేషన్‌మాష్టరు ఇంచుమించు రెండు చేతులూచాస్తూ, స్టూలుమీదనుంచి లేచాడు. హఠావిడిగా - "అరె, రా, రా, గోరాచంద్। 'మడుగు' విడిచి ఎక్కడ మాయమైనావ్ ఇన్నాళ్ళు ? సంపాయించగలిగావే మొత్తానికి ?" అన్నాడు, ఈ మాట హార్మోనియాన్ని గురించి అన్నమాట ।

గౌరాంగ్ మెళ్ళోంచి హార్మోనియంని పదిలంగాతీసి, ఓప్యాకింగ్ మీద పెడుతూ - "అరె । ఏం చెప్పమంటారు మాష్టర్‌దా । ఆ వెధవ గోవర్ధన్ అధికారి దీనికోసం ఎన్ని తిప్పలు పెట్టాడని । దౌర్భాగ్యుడేదో ఆశ చూపించాడు కదా అని వెళ్లా. నా ఆత్రతనిచూసి, 'ఇవ్వను' అనేశాడు" అని చెప్పాడు.

ఏదో ఇంత విస్మయకరమైన సంఘటన జగత్తులో ఎక్కడా జరగదు అన్న ధోరణిలో చెప్పాడు. స్టేషన్‌మాష్టరుకూడా ఆ విస్మయంలో పాలు తీసుకున్నాడు. "ఏమిటి ?" అన్నాడు నిర్ఘాంతపోతున్నట్లు -

"అరె। చెపుతున్నదేమిటిమరి ? పదిరోజులనుంచి అతడిచుట్టూ తిరుగుతున్నాను. అత డెంత తలాయించటం మొదలెడితే నేనూ అంత గట్టిగా పట్టుకున్నాను. మన సంచార వీధి నాటక సమాజానికి, ఏమయితేయేం ఓ వస్తువు అమరింది. ఏమంటారుమాష్టారుదా ?"

గౌరాంగ్‌ముఖంలో కళ్ళలో ఉత్సాహం పొంగిపోయింది.

స్టేషన్‌మాష్టరు ఉత్సాహంలో మైమరచిపోయే స్వభావం కలవాడే. అయితే గౌరాంగ్‌కంటె చాలాముందుగా ఈ పృథికి అవతరించిన

వాడతడు, అంచేత కొంచెం సందేహంతో ఆ వస్తువుకేసి పరీక్షగాచూసి చూసి, పై పైన వేళ్ళు అలా ఆడిస్తూ అడిగాడు - సరిగ్గాచూసి తీసుకున్నావా ? మ్రోగుతుందా అసలు ?"

"మ్రోగుతుందా అంటే ?—" అంటూ గౌరాంగ్ అమితోత్సాహంతో - "నేనేం మరీ అంత వెర్రివాణ్ణా ? అధికారిచేత వాయింపచేసి తీసుకోలా ? ఇవాళ యింటికి తీసుకువచ్చికూడా వాయించాను. చూడరాదూ ?" అంటూ మాష్టరుగారి టేబిల్‌మీది వస్తువుల్ని ప్రక్కకునెట్టి, కొంచెం చోటుచేసి, హార్మోనియం దానిమీదపెట్టి హార్మోనియం రీడ్స్ మీద చేతినలా పై పైన పోనిచ్చాడు. మొదట తేలికగా నొక్కి - తర్వాత మళ్ళీ గట్టిగా నొక్కి చూశాడు. ఆ తర్వాత వాటిని వేళ్ళతో కొట్టటం మొదలెట్టాడు.

కాని ఇదేమిటీ బెడద !

గోవర్ధన్ అధికారి వాద్యయంత్రంకూడా, గోవర్ధన అధికారి లాగానే అమర్యాదగా ప్రవర్తించసాగింది. ఒకటి రెండు రీడ్స్ బాఁయ్ మని అపశ్రుతులు పలికాయి. కొన్నిరీడ్స్ అసలు మోగకుండా పూర్తిగా మూగదీక్ష పట్టాయి.

రీడ్స్ సందుల్లో ఉఫ్ ఉఫ్‌న ఊది ఊది చెమట కారిపోయాడు పాపం గౌరాంగ్ !

చివరికి మాష్టరుగారే మాట్లాడక తప్పలేదు. "కొంచెం బాగా పాతదిలాగా కన్పిస్తోంది గోరాచాంద్!" అన్నాడు.

గౌరాంగ్ తలయెత్తి - "అహం హాఁ పాతదికాదనటంలేదు. చాలా యేళ్ళనాటిదయినందువల్ల దోషం యేముంది ? మీరు చాలా యేళ్ళు ఉన్నవారే. గుణం ఒక్కటే చూడవలసింది ముఖ్యంగా కాని చివరికి అధికారి నన్ను మోసగించాడా ?" అన్నాడు.

ఎంతో దిగులుగా ఉన్న గౌరాంగ్ ముఖంకేసిచూసి, స్టేషన్ మాష్టరు సాంత్వనగా—" కాస్త బాగుచేయించి సరిచేస్తే-" అన్నాడు.

"ఎక్కడ బాగుచేయించను ?" గౌరాంగ్ హతాశుడై - "ఉన్నదల్లా మన గదాయీ దుకాణం ఒకటి" అన్ని రకముల వాద్య యంత్ర

ములూ బాగు చేయబడును అని బోర్డు మాత్రం ఉంది; అంతే బాగుచేసే మేస్త్రీమాత్రంలేదు" అన్నాడు.

"అలాగా!"

గౌరాంగ్ విషణ్ణ ముఖంతో చెప్పటం మొదలెట్టాడు - రాను రాను అగాధంలోపడి పోతున్నాను మాష్టర్‌దా! కొంతమంది కుర్రాళ్ళని తీసుకొచ్చి అంత శ్రమపడి శిక్షణ నిచ్చానా ?— అందరూ పాడు చేసి కూర్చున్నారు. ఏమంటున్నారో తెలుసా — ఎవరూ విదురుడి వేషం వెయ్యరుట!" అన్నాడు.

స్టేషన్‌మాష్టర్ ఎన్నో ఆశయాలు - ఆశలు పెట్టుకుని రాసిన నాటకం ఈ "విదురుని విందు" ఎన్నో ఆలోచించి, ఎన్నో కొట్టివేసి, తయారు చేసినదిది. అతడీ మాట విని ఉలిక్కి పడ్డట్టుగా- "ఎవరూ విదురుడి వేషం వెయ్యరా ?" అని అడిగాడు.

"ఉహూఁ వేయించాలంటే ఎవరిచేతనయినా - వారికి కిరీటం, మఖమల్ దుస్తులూ తెచ్చి యివ్వాలిట !" అన్నాడు.

"ఏమిటి గౌరాంగ్ నువ్వనేది?"

"అనటానికేమీలేదు మాష్టర్‌దా? అందరూ కలసి హతాశుణ్ణి చేసేశారు నన్ను. కథలోని భావాల్ని ఎవరూ అర్థం చేసుకోలేరు. ఎలా అయితే ఆకర్షణీయంగా కన్పిస్తామనే ఆలోచన ఒక్కటే. ఇహ హార్మోనియంకూడా ఈ చిక్కు తెచ్చిపెట్టింది"

• • • •

దిగాలుపడ్డ ముఖాలతో ఇద్దరూ కొన్ని సెకన్లు అలాగే కూర్చు న్నారు.

మళ్ళీ హఠాత్తుగా ఒళ్ళు విరుచుకుంటూ లేచాడు గౌరాంగ్ - "పోనీ - మంచిదే అయింది మాష్టరుదా ! ఆదిలోనే నష్టం ఏర్పడి, దోషం కొట్టుకుపోయింది. ఇహముందు మన "సంచార వీధి నాటక సమాజానికి- నష్టమంటూ యేర్పడదు"

స్టేషన్‌మాష్టరు తల ఊగిస్తూ —" అది నిజమే గోరాచంద్ సరి యైనమాట అన్నావ్. ఈ మాటే నాకూ తోచింది మనస్సులో. టీకాలు వేయించుకుంటే మశూచికం భయం తొలగిపోయినట్లు - ఏమంటావ్?" అన్నాడు.

వయస్సులో తనకంటె చాలా చిన్నవాడైన ఈ మిత్రుణ్ణి. ఇలా మరిపిస్తూ ఉంటాడు మాష్టరుగారు.

ఈ పక్షాన్నికూడా మరపించడంకాక ఏమిటి? నాటక సమాజం ఎప్పుడో - ఎక్కడో నిర్ధారణంటూ యేమీలేదు. అయినా క్రొత్తనాట కాలకోసం ఔత్సుక్యాన్ని చూపుతూ ఉంటాడు — గౌరాంగ్.

గౌరాంగ్ తొందరపెడుతూ - "అహల్యా సముద్ధరణ" మొద లెట్టారా మాష్టర్‌దా! ఈపూట మొదలెట్టండి. ఈసారి నాటక సమాజం ప్రారంభమయితే - అప్పుడిహ తీరిక వ్యవధి ఉండదు" అన్నాడు.

మాష్టరుగారు ఉదాసీనంగా - "అరెభాయీ! రాశానుగా బోలె డన్ని? వాటి గతియేమిటో భగవంతుడికే తెలియాలి. ఒకటి రెండు నాటకాల ప్రదర్శనలయితేకాని, మళ్ళీ ఆ ఉత్సాహంరాదు" అన్నాడు.

మాష్టరుగారికి ఉత్సాహానికేమీ కొదువలేదని తెలుసు గౌరాంగ్‌కి. బహుశా ఈ లోపుగా రాసినా రాసి ఉండొచ్చు. ఇది ఏదో మొహమాటా నికి అన్నమాట కావొచ్చు ఇది....కొంచెం సేపయాపక - హడావిడిగా-" కొంత చిత్తురాశాను. పనికి వస్తుందో రాదో చూడరాదా? అంటాడు.

అంచేత అతడు ఆ మొహమాటాన్ని వదిలించటానికి-"ఉత్సాహం రాదూ అంటే —? నాటక సమాజం ప్రారంభమయితే తీరిక ఉంటుందా అని అడుగుతున్న. అప్పుడు స్టేషన్‌మాష్టరుదా కాస్తా డైరెక్షన్ మాష్ట రుగా ప్రమోట్ అవుతారాయె" అన్నాడు.

ఈ పరిహాసానికి ఇద్దరూకూడా పొట్ట చెక్కలయేట్లు నవ్వు కున్నారు.

* * *

నవ్వు ఆగాక గౌరాంగ్ అన్నాడు :— "నే చాల దూరం ఆలో చించుకుంటూ వచ్చాను. ఇప్పటికి "అహల్యా సముద్ధరణ" పూర్తి అయే ఉంటుందను కున్నాను. మీరేమో ఇలా కలం మూలపెట్టి కూచున్నారా?"

స్టేషన్‌మాష్టరు నిరుత్సాహంగా - "ఆc. ఏదో రాశాను కొంత వరకు. అదే — అంత బాగారాలేదు. అయినా కాస్త చూపిస్తానుండు." అన్నాడు.

గబ గబా - ఆత్రంగా టేబిల్ సొరుగులాగి, కాగితాలకట్ట బయటికి తీయటానికి ప్రయత్నించాడు మాష్టరు. ఇది లాగితే అది పైకి వస్తోంది. తర్వాత ఆ విడికాయితాలనన్నిటినీ బొత్తుపెట్టి, కిటికీకి దగ్గిరగా జరిగి వచ్చాడు.

వయోభారం మనస్సుని క్రుంగతీయలేక పోయింది. కాని బాహ్యేంద్రియాల్ని మాత్రం కుంటుపరచింది. చదవటాని కిప్పుడు చూపు సరీగ్గా ఆనటంలేదు. సాయంకాలపు వెలుగు సన్నగిలిపోతోంది. బయట యింకా నీరెండ ఉన్నప్పటికీ - గదిలో వ్రాతప్రతి చదవటానికి వీలయినంత వెలుతురు లేదు.

గౌరాంగ్ అతడి వ్యర్థ ప్రయత్నాన్ని చూసి, ఆత్రంగా - "బయటికివెళ్ళి కూచోకూడదా మాష్టర్‌దా ?" అన్నాడు.

మాష్టరుగారు కొంచెం చిరాకుతో - "అహc హc....బయట అంత....అదే. అహc. సరీగ్గా కన్పడటంలా. ఇవాల్టి కింక లాభంలేదు భాయీ!" అన్నాడు.

గౌరాంగ్ చెయ్యి కొంచెం చాచి- "పోనీ. నా చేతి కివ్వరాదూ?" అన్నాడు.

"వద్దు వద్దు. ఇది నీకు సరీగ్గా తెలియదుభాయీ!" కొంచెం తటపటాయిస్తూ అన్నాడు. "చాలా కొట్టివేతలున్నాయి. నాది నాకే సరీగ్గా- అహ్హc తింటే - అహc ఏముంది ? ఇవాల్టికి వద్దు యిహ. అంతకంటె నువ్వు ఏదైనా ఓ కీర్తనపాడు."

"ఇప్పుడా ? అంటే ఈ సంజెవేళా ?"

"ఇదిగో చూడు. సంజెవేళే సంగీతానికి సరియైనవేళ !"

గౌరాంగ్‌ని పాడమని ఎక్కువ ప్రతిమాలవలసిన అవసరం లేకపోయింది. "అయితే రండి బయటికి" అన్నాడు.

• • • •

కంకరగుట్టమీద కూర్చుని, కూనిరాగాలు తీయగా తీయగా గొంతు సాఫీ అయింది. సంజెవేళ మసక వెలుగులో - గాయకుని ముఖం సరీగ్గా కన్పించటంలేదు. అతడి ఉదాత్త కంఠస్వరంలో రాగ స్థాయి ఆరోహణావరోహణ క్రమానుసారంగా, ఆకాశంలోకిపోయి, మళ్ళీ కరుణరస పరిప్లుతమై క్రిందికి దిగివస్తోంది.

రెండో శ్రోత యెవరూలేరు. విహ్వలుడైన వయసు మళ్ళిన ఓ పల్లెటూరి స్టేషన్ మాష్టరు చెవుల్లో మార్మోగ సాగింది....

నిలువ నేరనైతి వింట — లోక
నింద - నేను గురియైతిని -
ఎవరితోడ జెప్పికొందు - నా
యెదదలోని -

ఎంతో ఆర్ద్రహృదయ డతడు - ఆ స్వరంలో కరుణరసం వెల్లివిరిసింది. ఆ సంతోషోత్సాహాల మాటున ఇంత దుఃఖసాగరం ఎక్కడ దాగివుందో ఎవరికి తెలుస్తుంది ? ఎలా తెలుస్తుంది ?

• • •

మాష్టరుగారు కోటుచేతులతో కళ్ళుతుడుచుకున్నాడు. పాట అయిపోయాక, రుద్ధకంఠంతో - "రాత్రింబగళ్లు నవ్వుతూ తిరుగుతూంటావు. సంగీతంతో ఇంత కన్నీటిని ఎలా స్రవింపచేస్తావు. నువ్వూ ఏడుస్తావ్; ఇతరుల్నీ ఏడిపిస్తావ్" అన్నాడు.

గౌరాంగ్ ఓ నిట్టూర్పువిడిచి, ఉదాసీనంగా - "ఏం చెప్పగలను మాష్టరుదా ! పాట మొదలెట్టానంటే - నన్ను నేను మరిచిపోతాను. ఏదో ఏక్కడో పోగొట్టుకున్న ట్లనిపిస్తోంది మనస్సుకి.

దూర దూరాన గృహస్థుల యిళ్ళలో శంఖరావాలు విన్పించాయి. దూరంనుంచి వస్తున్న ఆ శంఖారావాల్లో - ఏదో కరుణరసం ఒలుకుతున్నట్లుంది. కొంచెంసేపు మెదలకుండా ఊరుకుని, "వెళ్ళు, ఇహ ఇంటికి వెళ్ళు — గౌరాంగ్ ! కృష్ణపక్షపు రాత్రి. దారి మంచిదికాదు" అన్నాడు స్టేషన్ మాష్టర్.

• • • •

పల్లెటూరి దారి సంజెపడగానే చీకటి క్రమ్ముకుంటుంది. ఎక్కడినుంచో నక్కలకూతలు విన్పిస్తున్నాయి. మధ్య మధ్య ఎక్కడో ఓ కుక్క అరవటం మొదలెట్టింది. గౌరాంగ్ ఈ దారినే తిరిగి వెడుతున్నాడు.

తన మనస్సు మధ్య మధ్య ఎందు కిలా ఉదాసీన మవుతుందో - అది నిజంగా అతడికే తెలియదు. కీర్తన స్వరంలో ఏదో మైకం ఉంది. ఏదో గారడీ ఉంది.

సరాసరి యింటిదగ్గిర కొచ్చాక-ఆ వీధిలోని బెనర్జీగారింటి ముందు ఏదో జరుగుతూండటం కన్పించింది. అటునుంచె వస్తోంది వెలుతురు. చుట్టూ నాలుగు వాసాలు పాతి ఏదో ఓ పందిరిలాంటిది వేసి ఉంది. మధ్యలో నాలుగుకోళ్ళ కుర్చీపీటమీద లాంతరుపెట్టి ఉంది. ఆ లాంతరు వల్ల వెలుతురుకంటె - పొగే ఎక్కువవస్తోంది.

భాగవతం పురాణం జరుగుతోంది. రోజూ జరుగుతూంటుంది. బెనర్జీ గృహిణి వ్రతోద్యాపన సందర్భంగా - ఒక మాసం భాగవతం పురాణం ఏర్పాటు చేయించింది. చిన్న పురాణగోష్ఠి. పౌరాణికుడు కూడా - దానికి తగినట్లే ఉన్నాడు. సన్నగా, నల్లగా - కళాకాంతుల్లేని బ్రాహ్మడు. శ్రోతల సంఖ్యకూడా ఎక్కువలేదు. నారాయణ సందర్శనార్థం పండితలాకి వెళ్ళవచ్చేవారెక్కువయి పోవటంవల్ల- ఈపురాణం దగ్గిరజనం చాలా పలచబడ్డారు. నిత్యమూ భాగవతం పురాణం వినాలని నియమం పెట్టుకున్నవాళ్ళుమాత్రం వచ్చికూర్చున్నారు.

అలా వచ్చి కూర్చున్నవారిలో నిభానని ఒకత్తె.

గౌరాంగ్ ఏదో ఆలోచించుకుని, అటువైపే వెళ్ళాడు. అయితే ఆ పురాణం వింటున్నజనం మధ్యకి వెళ్ళలేదు. కొంచెం దూరంగా నుంచున్నాడు.

పౌరాణికునిది జడిత కంఠస్వరం. స్పష్టంగా యేమీ విన్పించటం లేదు. విసుగెత్తించేట్లుగా ఒకే రాగం విరామం లేకుండా విన్పిస్తోంది.

* * *

ఆ పందిరి, ఆ వాసాలు, ఆ సన్నటి వెలుగు కేసిచూస్తూంటే - మనస్సు ఆలోచనలతో దూర దూరంగా ఎక్కడికో వెళ్ళిపోతోంది. ఈ చిన్నసభ క్రమ క్రమంగా విస్తృతమైపోయి పెద్దసభగా మారిపోయింది. 'సంచార వీధినాటక సమాజం' అని రాసినఎర్రటిగుడ్డ ఒకటి దానిముందు వెలాడకట్టి ఉంది. మధ్య లోకోత్తరంగా ప్రదర్శనం జరుగుతోంది. మసక మసకగా మళ్ళీ ఆ దృశ్యం విలీనమైపోయింది. ఆ చిన్నసభ ముందునుంచి క్రమక్రమంగా ప్రక్కకి తప్పుకెళ్ళాడు, గౌరాంగ్.

ఎందు కతడికీ స్వప్నం!

వేలకొలది కథలన్నీ అతడి మనస్సులో గుమికూడుతాయి ఎందుకు? ప్రేమలో స్పష్టత - భావంలో స్పష్టత, వీరత్వంలో - మహత్వంలో ఉజ్వలతగల ఈ కథలకన్నిటికీ రూపంయివ్వాలి. ఈ బాధ్యతని ఎవరప్పగించారు గౌరాంగ్‌కి!

* * *

ఇంట్లోకి వెళ్ళబోతూ - మెల్లాలో పేర్చిఉన్న చిన్న చిన్న రాళ్ళ గుట్టని చూశాడు. బహుశా బాదల్ - బొమ్మరిల్లుకోట అయి ఉండొచ్చు. వంగి ఆ రాళ్ళని అటూ యిటూ సర్దటం మొదలెట్టాడు.

లోపలనుంచి సుధాముఖి హరికెన్ లాంతరు ఒకటి తీసుకుని బయటికి వస్తోంది. లాంతరు పైకి యెత్తిపట్టుకుని, వంగిఉన్న వ్యక్తిని చూసి, "ఏమిటి వెతుకుతున్నారక్కడ? ఏమైనా పారేసుకున్నారాయేం?" అని అడిగింది.

గౌరాంగ్ మందహాసంచేస్తూ- "పారేసుకునే వస్తువు ఏముందింక నాకు సుధాముఖీ ? విలువయిన వస్తు వొకటిమాత్రం ఉండేది. దాన్ని ఎప్పుడో పారేసుకుని కూచున్నాను"- అన్నాడు.

సుధాముఖి బుంగమొహంతో -"అది తెలుసు. ఎక్కడ పారేసుకున్నారో అదీ తెలియనిదికాదు నాకు" అన్నది.

"అదిగో అయింది. చెల్లెలికికూడా అన్నగారి జబ్బే పట్టుకుంది. 'సందేహ' మనేది చాలాచెడ్డది సుధాముఖీ ! చాలాచెడ్డది. అది అజీర్ణ వ్యాధిలా శరీరాన్ని శుష్కింప చేస్తుంది."

ఈ సమయంలో వాసంతి మరొక గదిలోనుంచి బయటికివచ్చింది. రావటంతోనే సుధాముఖి చేతిలో దీపపు వెలుతురుతో సంగతేమిటో గ్రహించేసింది. "ఏమిటి మీరు చేసినపని అల్లుడుగారూ ! బాదల్ హిమాలయ పర్వతాన్ని కాస్తా పగలకొట్టేశారు! పాపం వాడెంత కష్టపడి మెల్లాలో హిమవత్పర్వతాన్ని నిర్మించుకున్నాడో ! ప్రొద్దునలేచి చూశాడంటే ఇహ బ్రతక నీయడు" అన్నది.

గౌరాంగ్ సుధాముఖి చేతిలోంచి దీపాన్ని తీసుకుని, మెల్లా అంతా దృష్టిసారించచూస్తూ - "అవును, బ్రతకనీయడులే. కాని ఇప్పుడు అత్తగారు ఇటువచ్చి చీకట్లో యెదురుదెబ్బతింటే ? ముసలావిడ-బ్రతుకుతుందా యింక. భాగవతంవిని తిరిగివచ్చే వేళకూడా అవుతున్నదాయె?" అన్నాడు.

పల్లెటూళ్ళలో సాధారణంగా - వీధివైపు గుమ్మానికంటే - పెరటివైపు గుమ్మాన్నే రాకపోకలకి వినియోగిస్తారు. నిభానని కచ్చితంగా ఈ గుమ్మాన్నే వస్తుంది !

సుధాముఖి భర్తతో కొంచెం ప్రేమతో మాట్లాడాలనే ప్రయత్నంలో ఉండగా - వాసంతి రావటంవల్ల అంతరాయం ఏర్పడి, ఆమె రెచ్చిపోయింది. ఆ కోపాన్ని బయటపెట్టే ఉపాయమేమీ కన్పించక పోవటంతో - "అబ్బో ! అత్తగారిమీద ఎంత సానుభూతి అంటేనూ?" అన్నది.

"సానుభూతి అంటే ?" గౌరాంగ్ తెల్లబోతూ — "అయితే ముసలావిడ ఎదురుదెబ్బ తినాల్సిందేనా? బలే విచిత్రమైనమాటఅన్నావే!" అన్నాడు గౌరాంగ్.

* * *

గౌరాంగ్‌కి అది విచిత్రంకాక ఏమిటి ?

సానుభూతితో నిండిన హృదయమేకాదు అతడిది; సానుభూతితో నిర్మితమైన మనస్సు అతడిది. అందర్నీ రెచ్చకొాదతా డతడు. కాని అందరిమీదా అతడికి పదహారణాల సానుభూతే. గౌరాంగ్ సాధారణంగా తెల్లవారకట్ల లేస్తూఉంటాడు. ముందు లేవగానే నీళ్లు తోడిపెట్టి ఉన్నాయో లేదో చూస్తాడు. శశిధర్ పెందరాళే - ఆఫీసుకు వెళ్ళాలి. తొందర సమయంలో ఏమి అసౌకర్యం ఏర్పడుతుందో !

గిలక అమర్చిఉన్న నుయ్యి. నీళ్లతోడే చప్పుడుకి వాసంతి లేచి వచ్చి కూకలేస్తూంటుంది. సుధాముఖివచ్చి — అంతా మరీ 'బడాయి' అంటుంది. "మీకు తెలియదు. తొందర సమయంలో మనుషులకి ఎదుటనున్నదే కన్పడదు. ప్రక్కవారిమాటే వినబడదు. అన్నీ చేతికి అందుబాటుగా సిద్ధంచేసి ఉంచాలి." అంటాడు గౌరాంగ్.

ఇరుగు పొరుగువారిపట్లకూడా అతడికి సహృదయత్వమే. వీధిలో కుక్కపిల్లలు — పిల్లికూనలపట్లకూడా అతడికి స్నేహదృష్టే....

* * *

మర్నాడుదయం ఓ సంఘటన జరిగింది.

శశిధర్ తన మామూలు పద్ధతిలో బయటవైపున వసారా దిగువన ఉన్న చిన్నగట్టుమీద - పుల్లతో పళ్ళు తోముకుంటూ కూర్చున్నాడు. ఇద్దరు వ్యక్తులు దగ్గిరలోనే ఒంటెద్దుబండి ఆపి, దిగివచ్చి - "గౌరాంగ్ బాబు ఉన్నారా యింట్లో ? గౌరాంగ్‌బాబు !" అని అడిగారు.

అంత మర్యాదస్తుల మొహాల్లాలేవు యిద్దరివీ. పొట్టి పంచెలు కట్టుకుని - హాఫ్-హాండ్ షర్టులు వేసుకుని, పైన బిగుతుగాఉండే స్వెట్టర్లు తొడుక్కుని ఉన్నారు—జుట్టు పొడుగ్గా ఉంగరాలు తిరిగి ఉంధి.

"గౌరాంగ్‌బాబు" అన్నమాట వినిపించగానే శశిధర్ ముఖం కరకు తేలింది. గంభీరంగా "ఏమిటి పని అతడితో?" అని అడిగాడు.

"చిత్తం, అది వారితోనే చెపుతాం. పిలవండి ఓసారి" అన్నారు వాళ్ళు.

శశిధర్ తెల్లబోయాడు. బహుశా వాళ్ళ కోరికను మన్నించడం నిష్ప్రయోజనం అన్నభావంతో ఎదుట చెట్టంత మనుషు లిద్దరున్న సంగతి అసలు గమనించనే గమనించనట్లు తనపని తాను చూసుకో సాగాడు.

శశిధర్ పుక్కిలించి ఉమ్మివేస్తున్న నీళ్ళు ఎక్కడ మీద పడ తాయో అన్న భయంతో - వాళ్ళిద్దరూ కొంచెం వెనక్కి తప్పుకుని, మళ్ళీ—"ఒక్కసారి గౌరాంగ్‌బాబుని పిలవండి" అన్నారు.

• • •

వసారాకి ఎగువున మూడుగదులు — వాటిల్లో ఒకటి వాసంతిది, ఒకటి సుధాముఖిది. చిన్నగదేమో నిభానని పడుకునేది. బయటి మాటలు లోపలి గదుల్లోకి వినిపిస్తున్నాయి.

గౌరాంగ్ బల్లమీద బాసింపీట వేసుకుని కూర్చుని, తన ధోరణిలో తాను, సంగీత సాధన చేసుకుంటున్నాడు - మెల్లిగా - నిద్రపోతున్న బాదల్ వీపుమీద తాళంవేస్తూ. సుధాముఖి ఆవలిస్తూ ఆవలిస్తూ పాచి యిల్లు తుడుస్తోంది. హఠాత్తుగా చెవులు రిక్కించుకుని - ఏదో విన బడటంతో — "బయట యెవరో పిలుస్తున్నారు మిమ్మల్ని!" అన్నది.

గౌరాంగ్ నిర్లిప్తంగా - "ఆఁ. నన్నెవరు పిలుస్తారు?" అన్నాడు.

"అపరిచితుల గొంతులా ఉంది"

గౌరాంగ్ అదే ధోరణిలో — "అపరిచితుల గొంతా? పరిచిత మైన గొంతే - ఏదీ పిలవదు నన్ను సుధాముఖీ! ఇహ అపరిచితుల గొంతా?" అన్నాడు.

అంతలో — "గౌరాంగ్‌బాబూ! ఒక్కసారి బయటికిరండి" అని స్పష్టంగా వినబడింది.

"అదిగో విన్నారా ?"

ఇహ గత్యంతరం లేక - పంచె కుచ్చెల్లు దులుపుకుని, ఉత్తరీయం కప్పుకుని, లేచి నిలబడవలసి వచ్చింది.

బయటికి వచ్చి నుంచోగానే "ఏమిటి మహాశయా ? గోవర్ధన అధికారిదగ్గిర ఏంచేసి వచ్చారు ?" అని అడిగారు.

"గోవర్ధన అధికారి దగ్గిరా ?" గౌరాంగ్ నిర్లక్ష్యంగా—"ఏమిటి ? ఏమన్నాడు గోవర్ధన్ అధికారి?" అని అడిగాడు.

"మాకేం తెలియదండీ, మీపేర వారంట్ ఉంది, రండి"

హఠాత్తుగా అలాంటిమాట విన్నా గౌరాంగ్ ముఖంలో పెద్ద చెప్పతగ్గ మార్పేమీ కన్పించలేదు. కాని శశిధర్‌లేచి, నిప్పులు కురిపిస్తూ, చూస్తూనుంచున్నాడు. చలించలేదు. గోవర్ధన్ అధికారిదగ్గిర ఏంచేసి వచ్చిందీ తెలియటాని కెంతోసేపు పట్టలేదు. కచ్చితంగా ఆ హోర్మోని యమే. దొంగతనం తప్ప మరేమీ అయి ఉండదు.

"ఆ ఆర్డర్‌ని నే మన్నించకపోతే ?" అని అడిగాడు గౌరాంగ్.

"అలా అయితే — కట్టి తీసుకు రమ్మనికూడా ఉత్తరు వుంది" అన్నారు వాళ్ళిద్దరూ !

గౌరాంగ్ వెనుతీయలేదు. వెనుతీసే ఘటంకాదతడు. వారిమాటలకి సమాధానంగా — "కట్టా"—అయితే తాళ్ళూ అవీ తెచ్చుకుని రండి" అంటూ లోపలికి వెళ్ళాడు.

శశిధర్ అంతకుముందే రుసరుసలాడుతూ లోపలికి వచ్చాడు.

సుధ ఆదుర్దాగా — "బయట ఎవరు పిలుస్తున్నది అన్నయ్యా ?" అని అడిగింది.

శశిధర్ గంభీరంగా - "పోలీసువాళ్లు" అన్నాడు.

"పోలీసు వాళ్ళా ?"

సుధకి గుండె గుభేల్‌మంది. "పోలీసు లెందుకు వచ్చా రన్నయ్యా ?"

"ఎందుకా ? ఎందుకువారు ? అది వినాలని ఉందా ? దొంగ సొత్తు ఇల్లుచేరితే పోలీసులురారూ ? హార్మోనియంమీద పాటలు విందా మనుకున్నావా ?"

సుధ నిర్ఘాంతపోతూ చూస్తూ ఉండిపోయింది.

వాసంతి శశిధర్‌కి ఉతికిన బట్టలు అందివ్వటానికి వచ్చింది. "ఏమిటి వదినా ? అలా గ్రుడ్లప్పగించి చూస్తూ నుంచున్నావేమిటి?" అని అడిగింది.

"వదినా?" అంది సుధ. ఆమె కంఠం రుద్ధమయింది.

"ఏమిటి ? ఏం జరిగింది?....ఏమండీ - అన్నా చెల్లెలూ జగడ మాడుకున్నారాయేం ప్రొద్దున్నే ? మళ్ళీ ఇలా చేశారా ?"

శశిధర్ నిర్లక్ష్యంగా — ఇలా చేసేందు కేముంది నేను ? వెళ్ళు. వెళ్ళి ఆడబిడ్డ మొగుడికి ఆప్యాయంగా చేపల కూరచేసి పెట్టరాదూ ? జైలుకివెళ్ళే సన్నాహాలన్నీ సిద్ధమయాయి. పరాయివాళ్ళ హార్మోనీ ఎత్తుకువచ్చి, సరదా తీర్చుకోవటంలో తమాషా తెలిసివస్తుందిప్పుడు -" అన్నాడు.

వాసంతి దానికి తీవ్రమయిన అభ్యంతరాన్ని తెల్పుతూ - "ఛా ! ఎవర్ని ఏమంటున్నారు ? ఆయనగారు హార్మోనియం దొంగతనంగా తెచ్చారని అంటారా ?" అన్నది.

"నేననాల్సిన అవసరమేముంది ? ఎవరిది తీసుకొచ్చారో, వాళ్ళే 'వారంటు' మీద పట్టుకు రావటానికి మనుషుల్ని పంపారు"

"అది మీరు విశ్వసిస్తున్నారా ?"

"విశ్వసించక పోవటానికేమీలే దిందులో"

ఈ సమయంలో గౌరాంగ్ వచ్చా డక్కడికి.

వాసంతి ఒకసారి అతణ్ణి ఆపాదమస్తకం పరీక్షగా చూసి, "ఏమిటి మహాశయా! ఎవరు తీసుకొచ్చారు వారంటు ?" అని అడిగింది.

గోవర్దన్ అధికారి మనుషులు. రాకపోతే కట్టితీసుకు రమ్మని ఉత్తరువున్నదని అంటున్నారు. రండి బాబూ! తీసుకురం డయితే త్రాళ్ళా అవీ! అర్ధమంటూ ఏమయినా ఉంటేగా వాళ్ళు మాట్లాడేదానికి?"

వాసంతి చిన్న నవ్వు నవ్వి - "అధికారికి కీర్తనలు వినిపించారా యేం మీరు?" అని అడిగింది.

"కీర్తనలా? ఆఁ. వినిపించకేం ?"

"అయితే తెలిసింది. కీర్తన కచేరీకని బయానా పంపించిఉంటారు బహుశా"

శశిధర్ గభీర విస్మయదృష్టితో - పరిహాసోజ్వలమైన వాసంతి ముఖంకేసిచూస్తూ ఉండిపోయాడు. గౌరాంగ్ ఠపీమని వాసంతి పాదధూళి తీసుకుని, శిరస్సునతాల్చి, "ఇస్! ఊరికె అంటానా నేను! మగవాడిగా పుట్టినట్లయితే మీరు ఏ జడ్జీయో, మేజస్ట్రేటో కావలసినవారు. చూస్తాను వెళ్ళి-" అన్నాడు.

• • • •

వాసంతి సరీగ్గానే ఊహించింది అసలుసంగతిని....

ప్రక్క ఊరు - "సోనాడాంగా" జమీందారుగారి గృహిణి వ్రతోద్యాపన ఉత్సవం జరుపుతోంది. ఆ సందర్భంగా గోవర్ధన అధికారి నాటక సమాజానికి బయానా యివ్వటం జరిగింది. పోతే గోవర్ధన్ వారి ధన ప్రాచుర్యంచూసి, ఓ రోజున కీర్తన కాలక్షేపం ఏర్పాటు చేసేట్లుగా ప్రోత్సహించి, గౌరాంగ్‌కి కబురు పంపాడు. గుబులు మనిషి అయిన గౌరాంగ్ ఓ వేళ రానసేట్లయితే - గోవర్ధన్ పురికొల్పిన చవకబారు తమాషా యిది.

అక్కడికి వెళ్ళివచ్చాక గౌరాంగ్ - "మీరు ఊహించినదే నిజమైంది. ఇప్పుడే వెళ్ళిపోవాలి. ఏకంగా బండికూడా తీసుకువచ్చి కూచున్నారు. జమీందారుగారి భార్య వ్రతోద్యాపన - పిల్లా జెల్లాతో సకుటుంబంగా రమ్మని చెప్పారు....బాదల్, వస్తావా?....పద, బయల్దేరి వెడుతూ వెడుతూ దారిలో స్టేషన్‌మాష్టరుగారికి కబురందించి మరీ వెడదాం" అన్నాడు.

బాదల్ అప్పుడే నిద్రలేచి కూచుని ఉన్నాడు. తండ్రి మాట వినగానే తపీమని మంచంమీదినుంచి కిందికి ఉరికి దిగి, సరాసరివచ్చి, తండ్రిచెయ్యి పట్టుకుని, "ఆఁ, నాన్నా! వస్తా వస్తా. ఎక్కడకి వెళ్లాలి మనం?" అని అడిగాడు.

సుధాముఖి కీ ప్రస్తావన అయిష్టం కాకపోయినా - ముఖంలో చిడిముడిపాటుని వ్యక్తపరుస్తూ - "బాదల్ రావటమేమిటి? వాడికి గొప్పవారి యింటికి వెళ్ళిరావటానికి తగిన మంచిదుస్తులు, జోళ్ళు ఏమున్నాయని?" అన్నది.

గౌరాంగ్ నవ్వాడు. "అరెబాబా! నేనుమాత్రం ఏం రాచ-దుస్తులు ధరించి వెడుతున్నాను? నా బిడ్డేకదా? వాసంతీ, మీరు వాణ్ణి కాస్త ముస్తాబు చెయ్యండి. అది మీ ఆడబిడ్డ పనికాదు" అన్నాడు.

"రా, బాదల్" అన్నది వాసంతి నవ్వుతూ.

సుధాముఖి చర్రునలేచి నిలబడి, నిష్కారణంగానే గదిమూలనున్న ఇత్తడి బిందె ఒకటి తీసుకుని, చంకనెట్టుకుని, ఇంట్లోంచి బయటికి వెళ్ళిపోయింది. వెళ్ళిపోయేప్పుడు - దడి గుమ్మందాకావెళ్ళి కొంచెం ఆక్రోశాన్ని వ్యక్తీకరించి వెళ్ళింది. ప్రతీసారీ తనకేమిటీ పరాజయం? తన భర్త ఎప్పుడూ వాసంతికే ప్రాముఖ్య మిస్తా డెందుకని?

* * *

సంకీర్తన మంటపాన్ని చాలా చక్కగా అలంకరించారు.

చాలా ఘనత కెక్కిన కలవారి మండువాలోగిలి. మధ్య విశాలమైన మండువాలో - తివాచీలు పరచి - వాటిమీద కూర్చుని ఉన్నారు

సదస్యులు. నాలుగు పైపులా వరండాల స్తంభాలు. ఆ స్తంభాల కన్నిటికి - కృష్ణలీలలకి సంబంధించిన చిత్తరువులు ఒక్కొక్కటే తగిలించారు. అన్ని పటాలకి పెద్ద పెద్ద పూలదండలు. ప్రతిదానికి పైన దీపాల గుత్తులు....

పైన నాలుగు వైపులా వరాండాలో ఆడవాళ్ళు వరుసగా కూర్చుని ఉన్నారు. ఆ మంటపానికి మధ్యలో చిన్న వేదికనమర్చి, దానిమీద రాధాకృష్ణుల విగ్రహాల్ని ప్రతిష్ఠించారు. పూలదండలతో పటాలు యించుమించు కప్పివేయబడ్డాయి. రెండువైపులా ధూపపుసెమ్మాలలో ధూపాల్ని వేశారు. ధూపవాసనలతో, పూల వాసనలతో ఆ ప్రదేశమంతా హృదయభారంతో మూర్ఛితమై ఉన్నట్లనిపించింది.

బాదల్ కూడా హృదయభారంతో విహ్వలుడై ఉన్నాడు.

ఇన్ని పూలు, ఇన్ని దీపాలు, ఇంతశోభ! సరైన మంచిదుస్తులు, జోళ్ళు అవీలేవని తల్లి వెళ్ళవద్దని వారించింది! వెధవ దుస్తులు! వెధవ జోళ్ళు!

తర్వాత ఇహ మద్దెల ధ్వనులు విన్పించడం, గౌరాంగ్ వచ్చి మంటపం మధ్య కూర్చోవటంతో బాదల్ కి బాహ్య స్మృతే లేదు.

ఈ అపూర్వమూర్తి! ఇతడా బాదల్ తండ్రి!

ఆచ్ఛాదన రహితమైన శరీరం, నుదుట చందన తిలకం, మెళ్ళో లావుపాటి పూలదండ. సన్నటి ఉత్తరీయం ఒకటి మడతపెట్టి, భుజంమీద వేసుకుని ఉన్నాడు. తాళం వేస్తున్న కదలికకు ఉత్తరీయం మడత జారి జారి పడుతోంది. గుత్తులు గుత్తుల దీపాల కాంతులన్నీ అతడి శరీరం మీదే పడుతున్నాయి.

వీటన్నిటి కలయికతో ఒక లోకాతీతమైన రూపం!

తండ్రి రూపానికి మోహితుడైపోయాడు బాదల్. అకారణంగానే మాటి మాటికీ అతడి కళ్ళవెంట నీళ్ళు రాసాగాయి. ఈ అలౌకిక వ్యక్తే

తన తండ్రి అన్న విశ్వాసం మనస్సులో ఏర్పడడంలేదు. తాను చాలా అల్పుణ్ణనే భావం కలగసాగింది.

• • • •

అయినా నిద్ర వచ్చింది.

మాటి మాటికీ ఎంత కళ్ళు నులుపుకున్నా, కళ్ళు అలాగే తెరచి ఉంచుకో లేకపోయాడు. మనస్సులో ఎంత ఆత్రం, ఆసక్తి ఉన్నా — శరీరం శిశు శరీరమేగా! కూర్చుని కునికిపాట్లు పడుదూ పడుతూ ఎప్పుడో ముడుచుకు పడుకుని నిద్రపోతున్నాడు.

ప్రక్కన కూర్చున్న వ్యక్తి, చిరాకుగా కాలుకొంచెం వెనక్కి లాక్కుని కాస్త చోటు వదిలాడు.

• • • •

పై అంతస్థు వరాండాలో మరో విస్ఫారిత నేత్రాలు - బాదల్ లాగానే ముగ్ధదృష్టితో ఈ అపూర్వ సంగీతమయమూర్తి వైపుచూస్తూ, అతడి ముఖంమీదే నిలచిపోయాయి. బహుశా ఆ వ్యక్తికికూడా బాహ్య స్మృతి లుప్తమైపోయి ఉండొచ్చు. ఇతడు కేవలం కీర్తన గాయకుడేనా!

పేరు గౌరాంగ్ అని విన్నది. పేరు కింత సార్థక్యం మరెక్కడైనా చూసిందా అపర్ణ ?

అపర్ణ మనస్సులోనిమాటే - ఆడవాళ్ళందరి ముఖతః వచ్చింది.

"ఆహా హా! ఏం రూపం ? అచ్చగా గౌరాంగ్ లాగానే ఉన్నాడు. సార్థకమైన పేరుపెట్టారు తల్లి తండ్రులు!" "ఎంత చక్కగా పాడుతున్నాడు! భక్తుని ముఖతః వచ్చే కృష్ణనామం, దాని మహిమే వేరు. ఇంత మధురమైన కంఠం ఎక్కడా ఉండదు సాధారణంగా."

చాలా మంది స్త్రీల కంఠాలు గాద్గదికమయినాయి. చాలా మందికి అశ్రువులు పొంగి పొరలి వచ్చాయి.

• • •

అపర్ణ ఒక్కతే స్తబ్ధంగా ఉంది.

ఆమె సంకల్పం వేరు. ఆమె ఆలోచిస్తుంది—ఒక్కసారి వెళ్ళి కలుసుకోకూడదా అని! ఒకసారి దగ్గిరకివెళ్ళి స్వయంగా ప్రశంసలు తెల్పి రాకూడదా ? ఈ రూపంలో - ఈ గానంలో అతడు అపర్ణ మనస్సులో ఎంత ఆనందాన్ని రేకెత్తించాడో చెప్పటం కష్టం.

కాని అది ఎలా సంభవం !

• • •

క్రమంగా పాట పూర్తి అయింది. ప్రసాదం పళ్ళెంతో పూజారి బ్రాహ్మడు మధ్యకివచ్చి ప్రసాదం పంచిపెట్టటం మొదలెట్టాడు. గుప్పిళ్ళతో గుంపులోకి యెగరేస్తూంటే — జనం ఊరికే త్రోసుకుంటూ తెగ యెగబడుతున్నారు. పైన ఉన్న ఆడవాళ్ళకికూడా ప్రసాదాల్ని అందించారు.

ఇహ తర్వాత అందరూ ఇళ్ళకి తిరిగి వెళ్ళిపోవాల్సిన వంతు ...

నిద్రపోతున్నవాళ్ళని, మెలకువగా ఉన్నవాళ్ళని - ఎవరి పిల్లల్ని వాళ్ళు తీసుకుని బయలుదేరారు.

అంత పెద్ద సదస్సు ఖాళీ అయిపోయింది. ఆడవాళ్ళందరూ కూర్చున్న మండువా వరండాలన్నీకూడా ఖాళీ అయినాయి.

నిర్జనంగా ఉన్న ఆ ప్రదేశంలో ఓ వైపున ఒక్క బాదల్ మాత్రం ముడుచుకుని నిద్దరోతున్నాడు. పైన శూన్యంగా ఉన్న వరాండాలో ఇనుప బద్దీలను పట్టుకుని నిలబడి ఉంది - అపర్ణ.

ఇంతలో ఇద్దరు నౌకర్లు తివాచీలు, జంపకానాలు చుట్టటానికి వచ్చారు. కొంతవరకు చుట్టాక - "అరె ! ఈ కుర్రా డెవరు ? ఎవరైనా వదిలేసి వెళ్ళిపోయారా ?" అన్నా డొక నౌకరు - రెండో వాడితో.

"ఇదుగో అబ్బాయ్ ! లే ! లే - ఏయ్ అబ్బాయ్ !" అంటూ ఆ రెండో నౌకరు లేపాడు.

కుర్రవాడు మాత్రం ఆదమరచి నిద్దరోతున్నాడు.

అటు యిటూ దొర్లించటంతో ముఖం వెలుతురువైపుకి తిరిగింది.

"అరె! ఇతడా కీర్తనలు పాడినాయన కొడుకు. ప్రొద్దున ఆయనతోకూడా రావటం చూశాను." అన్నాడు రెండో వ్యక్తి.

చివరిమాట విన్పించీ - విన్పించడంతోనే గతుక్కు మన్నది అపర్ణ.

"కీర్తనలు పాడినాయన కొడుకు!" అన్నమాట చెవుల్లో నాటిపోవడం కాదు, గుండెల్లో నాటుకుంది.

క్షణంలో గబగబా కిందికి దిగివచ్చి, నౌకర్ని ఉద్దేశించి, "ఏమిట్రా యిది? కుర్రాణ్ణి జంపకానాలోపెట్టి చుట్టేస్తావా యేం?" అని అడిగింది.

"ఏం చెయ్యనమ్మగారూ! ఇతడు ఒళ్ళు తెలియని నిద్రలో ఉన్నాడు"

"అందులో ఆశ్చర్య మేముంది? పసివాడు పాపం! ఇతణ్ణి లోపల పక్కమీద పడుకో పెడుదువుగాని, ఎత్తుకుని ఇంట్లోకి తీసుకురా" అన్నది అపర్ణ.

నౌకరు బాదల్‌ని అడ్డంగా చేతుల్లోకి యెత్తుకుని, "చిత్తం అమ్మాయిగారూ! ఇతడు ఆ కీర్తనలు పాడినాయన కొడుకు" అన్నాడా నౌకరు.

"సరేలే, కుర్రాణ్ణి ఎక్కడపడితే అక్కడ వదిలేసి, మరచిపోయి వెళ్ళిన అతడికి తగిన శాస్తి జరగాల్సిందే. ఎవరితోనూ చెప్పకు, ఖబడ్దార్, అతడు కుర్రాడికోసం వెతుక్కోనియ్" అన్నది.

* * *

గౌరాంగ్‌ని అధికారి జట్టుతోపాటు త్రోసుకుంటూ తీసుకుపోయారు బయటివైపు యింట్లోకి.

కొంతసేపటికి — కోలాహలమంతా సద్దుమణిగాక - గౌరాంగ్ ఇటూ అటూ చూసి, "మా అబ్బాయి ఏడీ?" అని అడిగాడు.

"అబ్బాయి !"

"అదే! ఏడీ ? ఎక్కడికి వెళ్ళాడు ?" అంటూ అందరూ అటూ యిటూ పరకాయించి చూశారు.

గౌరాంగ్ బల్లమీద పరచి ఉన్న జంపకానామీదకి కూర్చుని, విసనకర్రతో విసురుకుంటూ - స్వభావసిద్ధమైన పరిహాస భంగిమలో - "చూడండి, ఎవరైనా తమ శాల్తీలను లెక్కపెట్టుకోవటంలో పొరపాటు పడి పెచ్చు ఉన్నదాన్ని ఎత్తుకుని పోలేదు కదా ఇంతకీ ?" అన్నాడు.

ఒకళ్ళిద్దరు నవ్వారు. కాని కుర్రవాడు ఎక్కడికి వెళ్ళిందీ-ఎవరూ చెప్పలేకపోయారు. గౌరాంగే మళ్ళీ దిగులుపడిన ముఖంతో - "అరే-" అంటూ ఏదో అనబోయాడు.

ఈ సమయంలో ఓ దాసీదివచ్చి, "ఇదో ఓ అదికారిగోరూ ! మిమ్మల్నే ! ఎవరయినా ఓ కుర్రాణ్ణి పోగొట్టుకున్నారా?" అని అడిగింది.

గోవర్ధన్ గతుక్కుమని "కుర్రాడా ! ఏం దొరికాడా యేం ? సరే, గౌరాంగ్ ! బెంగ తీరిపోయింది....ఇదిగో, వీరి అబ్బాయే !" అన్నాడు.

గౌరాంగ్ సందేహంతో - "కుర్రా డెలా ఉంటాడు ?" అని అడిగాడు.

దాసీ కొంచెం చిరాకుగా - "వచ్చి సూసుకోరాదుటండీ ! అమ్మగోరు సెప్పి పంపారు" అన్నది.

"అమ్మగారా !"

అధికారి తటస్థ భావంతో - "వెళ్ళవోయ్ గౌరాంగ్ ! వెళ్ళు, వెళ్ళు. అమ్మగారు తలచుకుంటున్నారుట ! అన్నాడు

• • •

అంతఃపురంలోకి వెళ్ళి గౌరాంగ్ చాలా ఇరకాటంలో పడ్డాడు. అతడు తన కొడుకుని చూసుకోటానికి వచ్చాడు. అంతఃపురంలోని

వారందరూ అతణ్ణి చూడాలనే ఆసక్తిలో వున్నారు.ఇది గౌరాంగ్ ఊహకే అతీతమైన విషయం.

అసలతడు అపూర్వంగా కీర్తనలుపాడే గాయకుడవటం ఒకటి. దానికితోడు పైగా బ్రాహ్మడు. ఇంతమంది మహిళా బృందం అతడికి తమ భక్తి తాత్పర్యాలను వెల్లడించుకోకుండా వుండటం యెలా? అదీ గాక కేవలం భక్తి ప్రపత్తులని వెల్లడించుకుని ఊరుకునేవారు కాదు వాళ్ళు. నైవేద్యంకూడా సమర్పించుకోందే విడిచిపెట్టరు.

అంతఃపురంలో కూర్చుని ఫలహారం చెయ్యక తప్పదు గౌరాంగ్.

గౌరాంగ్ భయపడుతూ భయపడుతూ విపన్నముఖంతో "ఇవన్నీ అలా ఉండనీండి. ఇవన్నీ అలా ఉండనీండి. ఫలహారం అవీ బయట వాళ్ళతోపాటు చేస్తాను ఆనక. నే వెడతాను" అన్నాడు.

గౌరాంగ్ యించుమించు వెళ్ళిపోవటానికి ఆయత్తమవుతున్నాడు. సరిగ్గా ఇంతలో ప్రక్కగది గుమ్మంలోంచి ఎవరో ఫక్కున నవ్వారు. "భయపడి పారిపోతున్నారా బ్రాహ్మణోత్తమా! బాగుంది. కుర్రవాడి ఆనవాళ్ళు తెలుసుకోటానికి వచ్చారుగా!" అని అనటం విన్పించింది.

ఉలిక్కిపడి అటు తిరిగి చూశాడు గౌరాంగ్.

నల్లటి అంచుచీరె ధరించి, వదులు వదులుగా జారుముడి వేసుకుని, బిగుతయిన తెల్లటి బ్లౌజు ధరించి, మాంచి వయసు పాకం వున్న వితంతు యువతి!

గౌరాంగ్ ఓసారి ఆమెకేసి చూసి ముఖం యిటు త్రిప్పుకుని — "వాణ్ణింక చూడక్కర్లేదు. మంచిచోట ఆశ్రయాన్ని పొందాడు. హాయిగా నిద్రపోతాడు. నే వెడతాను" అన్నాడు.

కాని అతడు వెళ్ళటం పడలేదు.

స్వయంగా యజమానురాలే రంగస్థలంలోకి వచ్చి సాక్షాత్కరించింది. తన పరిహాసధోరణిలో ఆమె "వెడతాననగానే వెళ్ళలేరు. ఫల

హారం భుజించి వెళ్ళాలి. బ్రాహ్మణ యువకునికేం పెట్టకుండా పంప టానికి లేదు. వీళ్ళందరూ ఎంతో ఆసక్తితో అన్నీ అమర్చిపెట్టారు. ఆహా చక్కని కీర్తనలు విన్పించారు. చాలా సంతృప్తి కలిగించాయి. ఇంకా రెండురోజులుండి వెళ్ళకూడదా స్వామీ! అందరూ అంటున్నారు. తీసుకోండి; ఏదో ఓ పండో ఫలమో తీసుకుని నోట్లో వేసుకోండి" అన్నది.

గృహిణీ జనోచితమైన కర్తవ్యాన్ని పాలించి గృహిణి వెళ్ళి పోయింది. అభ్యంతరాన్ని తెలిపే అవకాశా న్నివ్వకుండా దాసీ- 'చారు' గౌరాంగ్ నించుమించు త్రోసుకుంటూ తీసుకెళ్ళి ఫలాహారం పెట్టివున్న పళ్ళెంముందు కూచోపెట్టింది. చుట్టూ పూర్తిగా అవగుంఠనాలు ధరించిన వారు, సగం అవగుంఠనాలు ధరించినవారు, అసలు అవగుంఠనాలే లేని వారు - అందరూ స్త్రీలు.

గౌరాంగ్ చూపు అలాగే నిలిచిపోయింది.

వీళ్ళందరి యెదుటా కూర్చుని తినటమా ? పాలతో, వెన్నతో తయారయిన ఇన్ని తినుబండారాలు, పళ్ళు,షర్బత్ ఈతీపి వస్తువులన్నీ తినటమా ?

"క్షమించాలి. నేను ఇవన్నీ అంటే....అహా నావల్లకాదు. నే వెడతాను"

మళ్ళీ ఓ సరళ హాస్యధ్వని - "భాగవతోత్తములు ఏమిటి - 'నే వెడతాను' అన్నమాట ఒక్కటే నేర్చుకున్నారా యేం ?" గౌరాంగ్ కంఠస్వరాన్ని అనుకరిస్తూ ఆమాట అని మళ్ళీ మరోసారి నవ్విందామె.

అపర్ణలో ఇంత 'వాచాలతని' ఎవరూ ఆశించలేదు. వాళ్ళందరూ ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ గుసగుస లాడుకోసాగారు ఎక సక్కెంగా.

హఠాత్తుగా. నిటారుగా లేచి నిలబడ్డాడు గౌరాంగ్.దృఢభావంతో "చూడండి, తినిపించాలని ఉంటే వీటినన్నిటినీ బయటికి పంపించండి.

సద్వినియోగంచేసే మనుషులకి లోటేమీరాదు. దయవుంచి నన్నుమాత్రం విడిచిపెట్టండి. నాకిదంతా యేమీ బాగాలేదు" అన్నాడు.

ఈమాటయొక్క 'రియాక్షన్' ఎంతదూరంవరకూ వెళ్ళిందో ఎవరికి తెలుసు. ఒక హాస్యోజ్జ్వలమైన ముఖంమాత్రం రపీమని వెలవెలబోయినట్లయింది. అదిమాత్రం అందరికీ స్పష్టంగా కన్పించింది.

"సరే, అలా అయితే వెళ్ళండి" వెలవెలబోయిన ఆమె ముఖతః వెలువడ్డాయి ఈ మాటలు...."చారూ! భాగవతోత్తముల్ని బయటికి తీసుకెళ్ళు. ఫలాహారం బయటికి పంపే యేర్పాటు చెయ్యి. కాని మహాశయా! ఓసారి సందేహ నివృత్తి చేసుకుని వెళ్ళండి. కుర్రివాణ్ణి చూసి వెడతారా?"

కుర్రివాడు!

గౌరాంగ్ ఇంక ఇప్పుడామె కోరికను త్రోసిపుచ్చలేకపోయాడు. కుర్రివాడు చాలాసేపటినుంచి కన్పించక పోవటంతో మనస్సు పీకుతోంది. తటపటాయిస్తూ, అటూ యిటూ చూస్తూ "ఏడీ? ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"రండి" అంటూ చటుక్కున గోడపంచన పెట్టివున్న ఓ హరికెన్ లాంతర్ని తీసుకుని అపర్ణ దారి చూపుతూ లోపలివైపుగా ముందుకు సాగింది.

గౌరాంగ్ ఏమిటో తనకి తెలియకుండానే ఆమెని అనుసరించాడు.

• • • •

వారి యిద్దరి ముఖాలూ కనుమరుగుకాగానే అక్కడున్న ఆడవారిలో గుసగుసలు బయలుదేరాయి. "చూశావా అక్కా! ఆ వేషం చూశావా?" "చూడకేం అక్కా! భగవంతుడు నొష్టని రెండుకళ్ళు అంటూ పెట్టాక ఎన్నయినా చూడాలి".

'అది ఇంటావిడ అక్కకూతురు కాబట్టి సరిపోయింది. మనం

ఏపరిమయినా అయినట్లయితే బ్రతకనిచ్చేవాళ్ళేనా ? విధవ పడుచు! నువ్వు చూశావుగా ! ఒళ్ళు మండిపోయిందనుకో నాకు'

ఈ గుసగుస లాడుకుంటున్నవారు పడుచులు కాకపోయినా చాలా మంది విధవలే అన్నది చెప్పనవసంలేదు. ఆమెని సమర్థిస్తూ వీరి వ్యాఖ్యా నాలకి విరుద్ధంగా మాట్లాడినవారు కూడా ఒకళ్ళిద్దరు లేకపోలేదు. 'సధవ' అయిన ఒకామె "మీవి అన్నీ మరీ అన్యాయపు మాటలమ్మా ! విధవ అయింది కదా అని ఆమె జీవితంలో యెప్పుడూ నవ్వనేకూడదా యేం?" అన్నది.

ఒకామె ఉదాసీనభావంతో - "ఎందుకు నవ్వకూడదు ? జన్మ జన్మలకీ నవ్వుకోవచ్చు. అయితే విధవ అయినదానికి అంత ఫాషన్లు, ఆ చీరెలు, ఆ బ్లౌజులు, అంత సొగసైన జుట్టుముడి- అసలు వీటినన్ని టినీ చూస్తే 'వెలపరం'గావుంటుంది. వాటికితోడు పైగా ఈ సిగ్గుమాలిన నవ్వు ఒకటి. ఛీ !...." అన్నది.

"అయితే ఉన్నమాట అంటాను – భర్త పోయాడనగానే యౌవ నంలో 'యోగిని' కావటానికి అతడలాంటి భర్తా అసలు ? చచ్చాడా ? దాని యెముకలు కొరికాడుకాని, బ్రతికినన్నాళ్ళూ ఎంత పాపిష్ఠి గుణాల వాడని ! కలవారి బిడ్డకదా అని కన్నతల్లీ, తండ్రీ కళ్ళు మూసుకుని కట్ట బెట్టారు అతగాడికి. పైకి చక్కగానే వుండేవాడు కూడా. ఉంటే యేమయి నట్లు. ఒఠి 'మేడిపండు' వాటం. పన్నెండో యేటనుంచే బాగా తాగుడు మరిగాడు. ఇహ స్వభావం అంటారూ – పైకి చెప్పుకోటానికే సిగ్గు చేటు. బ్రతికినన్నాళ్ళూ పిల్లదాన్ని చావచితక బాదుతూ చెండుకుతిన్నాడు కదా !" అన్నది ఒక సానుభూతి పరురాలు.

అయితే ఆ వయసు మళ్ళిన ఆమె ఇంత ఉపన్యాసం దంచినా, అవతలివాళ్ళ మనస్సులేమీ అంత జావజావ అయిపోలేదు. ముఖాలు ప్రక్కకి త్రిప్పుకుని, "అదంతా కర్మఫలమమ్మా ! అలా అయినంత మాత్రాన విధవ విధవగా నడుచుకో అక్కర్లేదు కాదు కామ. అసలా పిల్ల మా నోటవాగుడు పిల్ల ! దానికి తగినట్లే జరిగింది. అత్తవారింటి

అంత ఐశ్వర్యం, అంత డబ్బు, అంతకీ ఆమెదేగా ఏకచ్ఛత్రాధిపత్యం. ఇన్నాళ్ళూ ముసలి అత్తగారు వుండేది. ఆమెకూడా "హరీ" అన్నదని వినికిడి. అందేత ఇప్పుడు తామసామ్ము తన పడగలనన్నీ విప్పింది. యజమానురాలి అక్కకూతురు కనుక ఎన్ని తప్పులుచేసినా చెల్లు! ఆవిడ కూడా అస్తమానం 'అపర్ణ' అంటూ మైమరచిపోతూ వుంటుంది" అంటూ గుసగుసలాడుకున్నారు.

* * *

ఎన్ని తప్పులు చేసినా చెల్లుబడి అయ్యే ఆమె ఓ దీపాన్ని చేత పుచ్చుకుని, ఓ నిస్సహాయ జీవిని వెంట లాక్కునిపోతోంది.

శ్రీమంతుల భవనం ...ఎన్నో గదులు, ఎన్నో వరాండాలు దాటి వెళ్ళాక మధ్యరకంగావుండే ఓ గదిలోకి వచ్చి ఆగింది అపర్ణ.

తెల్లటి దుప్పటి పరచి, తెల్లటి దోమతెర వేసివున్న మంచం. దోమతెరని ఓవైపున కొంచెం పైకియెత్తి అపర్ణముఖం ప్రక్కకి త్రిప్పుకుని నవ్వుకుని – "చూడండి. మీ "వస్తు"వవునో కాదో పోల్చుకోండి" అన్నది.

"బాగుంది, బాగుంది. రాచపానుపుమీద హాయిగా పడుకుని నిద్దరోతున్నాడు. పదండి"

అపర్ణ మళ్ళీ అలాగే నవ్వి "ఇంకా నే రావటం దేనికి? దారి గుర్తు చెపుతూ తీసుకువచ్చానుగా! ఇంక మీ అంతట మీరే వెళ్ళండి" అన్నది.

గౌరాంగ్ చకితదృష్టిలో నాలుగువైపులా చూస్తూ "నాకు గుర్తు ఉంటుందా? అయితే అయినట్లే! అలా అయితే రాత్రంతా చిక్కు దారులవెంట తిరగలేక చస్తాను. చక్రవ్యూహం ఈ యిల్లు" అన్నాడు. అపర్ణ ఓసారి కళ్ళు యెత్తి గౌరాంగ్‌ని అమాయకపు నవ్వు ముఖంతేసి చూసి "అహం. మీరు చక్రవ్యూహంలో చిక్కుపడిపోరు. అలాంటివారు కాదు మీరు. పదండి. కుర్రవాడిని రేపు ప్రొద్దున భోజనం అదీ పెట్టి

కాని విడిచిపెట్టేసిలేదు. బ్రాహ్మణ బిడ్డ రాత్రంతా ఉపవాసంతో పడుకుని వున్నాడు" అన్నది.

* * *

పొద్దెక్కేదాకా పడుకునే అలవాటు ఉన్నా అపరిచితమైన ప్రదేశం అవటంతో బాదల్‌కి చాలా పెందరాళేనే మెలుకువ వచ్చింది. కంగారు పడిపోతూ మంచంమీదినుంచి గబుక్కున దిగి, అలాగే మ్రాన్పడిపోయాడు.

అపర్ణ అప్పుడే స్నానంచేసి వచ్చి తల దువ్వుకుంటోంది. అతడి అవస్థ చూసి ముఖం చాటుకి తిప్పుకుని నవ్వుకుంది. ఏమీ మాట్లాడలేదు.

"మానాన్న దగ్గరికి వెడతాను" అన్నాడు బాదల్ ఏడుపుమొహం పెట్టి.

అపర్ణ దగ్గరకి వచ్చి నవ్వుతూ అతడి గడ్డం పుచ్చుకుని పుణుకుతూ "నాన్న దగ్గరకి వెడుదువుగానిలే కాని, ఎవరి అబ్బాయివి చెప్పు నువ్వు ?" అని అడిగింది.

"అహాఁ అదే తెలియదా ? నిన్న కీర్తనలు పాడలా ? ఆయనే మానాన్న"

"అబ్బో. అలాగా ? ఆయన మీనాన్నా ? పిల్లవాడు తప్పిపోతే వెతుక్కోనేలేదు. వెర్రివాడు మీనాన్న"

"ఉస్, అదేమిటి ? మానాన్న చాలా మంచివాడు. ఎంత చక్కగా పాడతాడు"

అపర్ణ దగ్గిర కూర్చుని, అతణ్ణి మరింత దగ్గిరగా లాక్కుని "అయితే మీ నాన్నని ఓసారి పిలుచుకు రారాదూ? చక్కని పాట మరోసారి వింటాను" అన్నది.

బాదల్ అమితోత్సాహంతో "నాన్న యేడీ ?" అని అడిగాడు.

"ఉన్నారు, ఉన్నారు. మీనాన్న దగ్గిరకి పంపిస్తాను. అయితే

మరి నాకు పాట వినిపింపచేస్తావా ? లేకపోతే మీనాన్న దగ్గిరకి వెళ్ళనీయనే వెళ్ళనీయను"

"ఆఁ. తీసుకునే వెళ్ళరాదూ నన్ను? ఎన్ని పాటలు కావాలి మీకు? బళ్ళకి బళ్ళున్నాయి పాటలు మానాన్న దగ్గిర."

"అయితే మరి నీకేమీ రావా ?"

బాదల్ ముఖంలో సిగ్గు తొణికిస్తూ తల వంచుకుని "ఉహూఁ" అన్నాడు.

కొంచెం సేపయాక బాదల్ ఓ దాసీ దానివెంట తండ్రి దగ్గిరకి వచ్చి చేరుకున్నాడు.

ఇంటికి ముందు వైపున వున్న తోట।

పూలచెట్లకేసి చూస్తూ తిరుగుతున్నాడు గౌరాంగ్.నిత్యమూ దైవ పూజలు జరిగే యిల్లు. అంచేత రకరకాల పూలమొక్కలూ సేకరించి తెచ్చివేసినట్లున్నారు.

తండ్రిని చూడగానే బాదల్ తనకి దారి చూపుతూ తీసుకొచ్చిన ఆమెని వదిలేసి పరుగెత్తుకుంటూ వచ్చి "నాన్నా ! నాన్నా ! పిన్నిగారు నీ పాట వింటుందట. రా" అన్నాడు.

"పిన్నిగారా ?" గౌరాంగ్ దగ్గిరలోవున్న దాసీని సందిగ్ధదృష్టితో చూసి "పిన్నిగారెవర్రా బాదల్ ?" అని అడిగాడు.

"ఆవిడే—నేను ఎవరి పక్కమీద పడుకున్నానో ఆవిడే. ఎంత ఇదిగా చూశారని। రసగుల్లాలు పెట్టారు."

గౌరాంగ్ నవ్వి "రసగుల్లాలు పెట్టారా ? అయితే ఇహనేం కచ్చితంగా నిజమైన పిన్నే !" అన్నాడు.

"హూఁ రా. పాట పాడుదువుగాని" అంటూ తండ్రిని చెయ్యి పుచ్చుకుని లాగాడు బాదల్.

ఈ సమయంలో దాసీదికూడా ముందుకి దగ్గిరకొచ్చి ఎంతో వినయంగా "బాబుగోరూ ! తవఁరోమాటు లోనికి దయసెయ్యాలి" అంది.

"లోపలికా ? ఎందుకు ?"

"ఓం. పిన్నిగారు నీపాట వింటుంది" అన్నాడు బాదల్.

"మా అమ్మగోరు సెప్పి పంపించారు. రెండు కీర్తనలు యిని పించాలి" అన్నది దాసీ.

గౌరాంగ్ ఇరకాటపు స్థితిలో పడినట్లు "అరె ! నేనేం ఇవాళే వెళ్ళిపోతున్నానా యేం ? రాత్రి మళ్ళీ కీర్తన కాలక్షేపం వుందిగా" అన్నాడు.

దాసీది మరింత వినయంతో "సిత్తం. అప్పుడు వుంటే అప్పటి సంగతి సరే,ఇప్పుడు దయసేసి ఓమాటు రండి. అమ్మగోరి సూపు దొడ్డ సూపు. దానికి యిడగా బక్‌సిస్ యిత్తారు" అన్నది.

ఒక్క-క్షణం గౌరాంగ్ ముఖంలో నిర్లక్ష్యపు నవ్వు కన్పించింది. తర్వాత కొంచెం గంభీరంగా"బక్షిష్ ఇస్తే పాటలు పాడేందుకు, అలాంటి పాటలు నాకు రావని నువ్వెళ్ళి చెప్పు అమ్మీ !" అన్నాడు.

దాసీది బహుశా ఈ అమాయకపు బ్రాహ్మడి అమాయకత్వం చూసేకాబోలు, ఓ విచిత్రమైన ముఖభంగిమపెట్టి నిరాశతో వెళ్ళి పోయింది. అపర్ణ మామూలు సాతాని భిక్షుకుడు వచ్చినాసరే, దగ్గిర కూర్చోపెట్టుకుని, పాటలు పాడించుకుని, ఓ కంకు రూపాయి బక్షిష్ యిస్తూ వుండటం తాను కళ్ళారా చూసింది దాసీది. పాటలంటేచాలు ప్రాణమిస్తుంది అమ్మగారు.

దాసీది వెళ్ళిపోయాక బాదల్ చిన్నపుచ్చుకున్న ముఖంతో "పిన్ని గారికి కీర్తనలు వినటం అంటే చాలా యిష్టం నన్నా ! అలా వింటూ కూర్చుంటే ఆమెకి అన్నం అఖ్కర్లా: నిద్రా అఖ్కర్లా"అని చెప్పాడు.

"ఆరి నాయనా ! అలాగా ? అయితే సాయంత్రం ఎలాగూ కీర్తన కచేరీ ఉందిలే"

"ఒంటరిగా వున్నప్పుడు వింటేనే. బాగుంటుందట. పిన్ని చెప్పింది"

"అంత మరీ బాగుండాల్సిన అవసరమేముందిరా బాబూ" అంటూ పసిపిల్లవాడిలాంటి వాడైన గౌరాంగ్ "అదిగో, అదిగో, చూడు బాదల్. ఎంత పెద్ద గొల్లభామో!" అన్నాడు.

"ఏది నాన్నా ఏదీ?....ఆఁ ఇదుగో....ఇదుగో"

తండ్రి కొడుకులిద్దరూ ఆ గొల్లభామ ఎగిరి వాలుతున్న చోట్లకెల్లా పరుగెడుతున్నారు. తర్వాత ఒకరికొకరు ఇంచుమించు ఢీ కొట్టుకున్నంత స్థితికివచ్చి నిలబడిపోయారు.

దుస్సాహసవంతురాలైన అపర్ణ తోటలోనుంచి తానే పిలుస్తూ వచ్చింది. వీళ్ళు చటక్కున ఆగి నిలబడిపోవటం చూసి, కిల కిల నవ్వుతూ -"బ్రాహ్మణ ప్రవరులకి అన్నివిద్యలూ వున్నట్లు కన్పిస్తోంది. ఉత్సాహంతో ఎగరటంకూడా ఎగరగలరే?" అంది.

"మేం గొల్లభామని పట్టుకున్నాం" బాదల్ గంభీరంగా అన్నాడు. అపర్ణ ఓసారి కన్నార్పకుండా చూసింది.

• • •

రాత్రి కీర్తనలు పాడుతున్నప్పుడు ఓ దివ్యరూపం కన్పించింది. అతడిలో ఇప్పుడు మరో సుందరరూపం కన్పిస్తోంది. అప్పుడే స్నానం చేసివచ్చిన అతడి తలమీద ఉదయపు లేకాంతులు పడుతున్నాయి. ఓసారి చూస్తే తనివితీరదు. మరోసారి చూడాలని పిస్తుంది.

అలా చూస్తూ నిలబడితే - ఇద్దరికళ్ళూ కలుసుకున్నాయి. ఆమె తలవంచుకుని - "కీర్తనలు విన్పించటానికేమిటి అభ్యంతరం?" అని అడిగింది.

గౌరాంగ్ ఈ ప్రగల్భోక్తికేం సమాధానం చెప్పటమో తోచ లేదు.

"రాత్రి విన్నారుగా -" అని మాత్రం అన్నాడు.

"విన్నానుకనుకే మళ్ళీ వినాలని కోరిక. నిన్నటి ఆ కీర్తనని ఒంటరిగా కూర్చుని వినాలని మహా అభిలాషగా వుంది."

"ఏకీర్తన ?" అని అడిగాడు గౌరాంగ్ గతుక్కుమని.

"అదే___ న వానురాగిణి రాధ.

సరకుసేయ దవాంతరాలను."

అని అందించింది అపర్ణ.

"ఒంటరిగా కూర్చుని పాడితే రక్తి కట్టదు." అన్నాడు ఆమె అభ్యర్థనని ఎగరకొట్టెయాలనే భావంతో.

అపర్ణ ఏమిటో క్రుంగిపోయింది.

ఈ బ్రాహ్మణ గాయకుడు అభ్యంతరాన్ని త్రోసిపుచ్చి తన ప్రార్థనని మన్నిస్తాడనే విశ్వాసం సన్నగిలింది. అయినా ఆప్యాయతతో చేతులుచాచి బాదల్‌ని దగ్గిరకి తీసుకుని, తల నిమురుతూ.

"సరే, పోనీ మరొక విన్నపాన్ని అయినా మన్నిస్తారా?"

"ఏమిటి ?"

"బాదల్ వుంటే ఈ నాలుగురోజులూ - నాదగ్గిరే వుంటాడు."

"ఇదేనా అలాగే వుండనీండి. మీరు వాడికి పిన్ని అయినారని విన్నాను."

"ఆఁ. అయాను. మరొకసంగతి, కీర్తనలుకాని, నాటకాలుకాని ప్రశంసనీయంగా వుంటే - బహుమతులిచ్చే సంప్రదాయం వుంది. తెలుసా మహాశయా ! నిన్న ఇవ్వలేకపోయాను. ఆ జనంలో ఎక్కడ జారవిడుచుకుంటారో అని! ఇవ్వాళ దాన్ని యివ్వటానికి వచ్చాను. స్వీకరించండీ విజయోపహారాన్ని" అంటూ చటుక్కున తన మెళ్ళో ఉన్న సన్నటి హారాన్ని తీయబోయింది అపర్ణ.

గౌరాంగ్ యించు మించు వణకిపోతూ — కొంచెం వెనక్కితగ్గి, దృఢస్వరంతో - "ఉపహారాలు తీసుకునేది గానమే ఉపాధిగా కల వాళ్ళు. నే నలాంటివాణ్ణికాదు" అన్నాడు.

"పోనీ ఉత్సాహోద్రేకిమే అనుకోండి. అయినా ఆనందంతో

మెళ్ళోహారాన్ని తీసి ఇవ్వబోయినపుడు దాన్ని వద్దనటం అవమానమవుతుంది తెలుసా ?"

"ఉహూఁ. నాకు అన్నిసంగతులు తెలియవు బాదల్. అయితే నువ్వు లోపలికి వెళ్ళు" అంటూ గౌరాంగ్ తాను వెనక్కి తిరిగాడు.

మళ్ళీ వెనుకనుంచి పిలుపు వచ్చింది. "అంత భయమెందుకు ? మిమ్మల్నేమీ ఉరి తీయబోవటం లేదెవరూ ? ఉండండి, మాట. సహజమైన ఆసక్తితో సంగీత కాలక్షేపాలు చేసేవాళ్ళు బహుమతులు తీసుకోరు సరే. కాని చిన్నవాళ్ళు మేనత్తల దగ్గిర, పింతల్లులు దగ్గిర కానుకలు తీసుకుంటారుగా ! బాదల్‌కి నేను పిన్నినయాను. ఆస్మృతి చిహ్నంగా బాదల్‌కి ఆటవస్తువులు కొని యివ్వాలని వుంది నాకు. ఇక్కడ ఈ ఊళ్లో యేమీ దొరకవు. తర్వాత కొనిపెట్టండి నా తరపున" అంటూ గుప్పెటలో వున్న రెండు పదిరూపాయలు నోట్లు అతడి కివ్వబోయింది అపర్ణ.

సరళ హృదయుడైన గౌరాంగ్ ముఖంకూడా కొంచెం కరకుబారింది. అతడు అతఃపూర్వం కంటె మరింత కటువుగా "మా బాసుల్‌పూర్‌లోనూ ఏమీ దొరకవు. డబ్బు తీసుకుని ఏమిటి ప్రయోజనం ?" అన్నాడు.

"సరే.ఆడుకునేవేవీ దొరక్కపోతే తినేవేమయినా కొనిపెట్టండి" అంటూ ఆ నోట్లు రెండూ బాదల్ గుప్పిట్లో పెట్టటానికి ప్రయత్నించింది అపర్ణ. కాని బాదల్ చాలా పలాకీఅయిన కుర్రవాడు. ఈ వ్యవహారమంతా చూసి చేతులు రెండూ ముడుచుకుని తండ్రి వెనకాలకి పోయి నుంచున్నాడు.

"సరే బాదల్ 'సావాసం చెల్లు'" అన్నది అపర్ణ ముఖం చిన్నపుచ్చుకుని.

గౌరాంగ్ ఎవరి ముఖం చిన్నబోయినా చూడలేడు. విచలితుడైపోయి "అహఁ, హఁ. ఆమాట యెందుకు ? 'సావాసం చెల్లు' కావటం దేనికి ? బాదల్ అంటే మీకు ప్రీతి. వెళ్ళరా బాదల్, వెళ్ళు....కాని.

డబ్బూ అదీ మాత్రం ఇవ్వకండి. డబ్బూ,దుబ్బూ మాత్రం ఇవ్వకండి" అన్నాడు.

* * *

బాదల్‌ని లోపలికి పంపించేసి గౌరాంగ్ బయటికి వచ్చేశాడు. 'సోనా డాంగా' గ్రామాన్ని చూడటానికి బయలుదేరాడు. అందర్నీ ప్రేమిస్తాడతడు.మానవ మాత్రుడయినవాడల్లా అతడికి ప్రేమపాత్రుడే. కాని 'నిస్సంగత్వం' అన్నా అతడికి చాలా ప్రీతి.

నిరుద్దేశంగా,ఒంటరిగా తిరగటం అంటే అతనికి చాలా యిష్టం. వెళ్ళేప్పుడు గోవర్ధన్ అన్నాడు – "ఒక్కడివీ వెళుతున్నా వెక్కడి కోయ్ ? ఇక్కడి దారులూ, డొంకలూ ఎరగనివాడివి...."

"దారులూ డొంకలా ? అవి బయలుదేరగానే తెలిసాయి" అతడికి తెలియకుండా అతడికో కవిత్వపు పంక్తి జ్ఞాపకం వచ్చింది. 'ఒంటరిగా నేతెంచితి – జంటరారు ఒరులెవ్వరు'

కాని ఇవాళేమిటో 'అశాంతిగృహం' అతడిచుట్టూ చుట్టూ తిరుగు తోంది. అటూ యిటూ తిరుగుతూంటే ఓచోట ఓ దేవాలయం కన్పిం చింది. జమీందారు గృహిణి ప్రతిష్ఠ చేయించిన రాధాకృష్ణ మందిరం అది.

ఆ మందిరాన్ని ఉద్దేశించి, చేతులు రెండూ ఓసారి జోడించి, కొంతదూరం పైకివెళ్ళి మళ్ళీ యేమనుకున్నాడో వెనక్కి తిరిగి వచ్చి మందిరంలోకి వెళ్ళాడు. లోపలికి వెళ్ళి దర్శనం చేసుకుని మెట్లుదిగి వస్తుండగా మెట్టమొదట బాదల్, అపర్ణ నిలబడి వున్నారు.

ఢీకొన్నట్లయింది - అంతకంటె ఏమిటి ?

బాదల్ ఆత్రంగా "నాన్నా !" అన్నాడు.

ఇప్పుడింక గట్టిగా నవ్వలేదు అపర్ణ. ముసిముసి నవ్వులు నవ్వు కుని కొంచెం ప్రక్కకి ఒత్తిగిలి నిలబడి "ఓరోజు నే రెండుసార్లు ఢీ

కొట్టుకోటం తప్పింది. ఏమిటి? విగ్రహాన్ని చూట్టానికొచ్చారా?"
అన్నది.

"ఊఁ"అంటూ రెండుమెట్లు దిగాడు గౌరాంగ్. ఆ సమయంలో బాదల్ "పిన్ని నీకోసం ఉత్తరం రాసింది నాన్నా?" అన్నాడు.

"ఉత్తరమా!"

అపర్ణ చటుక్కున "బాదల్ మాటకేమిటిలెండి. కాని - రెండు నెల్లు పోయాక - మా అత్తగారి వార్షిక శ్రాద్ధం - దయవుంచి అప్పుడు తమరోసారి రావాలని ప్రార్థన. వస్తారా?" అన్నది.

గౌరాంగ్‌కికూడా విసుగు అనేది వుంది. అతడు చిరాకుగా - "రెండునెలల తర్వాత సంగతి నే నెలా చెప్పగలను. నేను వేయిగుళ్ళ పూజారిని. నామాట వదిలెయ్యండి, తప్పుకోండి - వెళ్ళాలి" అన్నాడు.

• • • •

గోవర్ధన్ అధికారి వుద్దేశాన్ని తెలుసుకుని, 'వాహ్వా వాహ్వా' అంటూ – "వెళ్ళిపోతావా ఏమిటోయ్ ఇంకా ఊళ్ళోవాళ్ళందరూ -" అన్నాడు.

"ఒంట్లో బాగుండలేదు అధికారి మహాశయా!"

"ఆఁ అదేంలేదు. రాత్రి కొంచెం శైత్యంచేసి వుంటుంది. కాస్త మిరియాల కషాయం తాగు. ఒంట్లో మళ్ళీ సత్తువ వస్తుంది."

"కాదు అధికారిగారూ! మనస్సు ఒకసారి వికలమయాక-ఇంక పాట రాదు."

అధికారి ఇంక యెక్కువ అడ్డుతగలలేక పోయాడు.

గౌరాంగ్ స్వభావం ఆతడికి తెలుసు. అతణ్ణి ఆపి వుంచడం అసాధ్యమని తెలుసతడికి.

తిరిగి వెళ్ళిపోవడం ప్రస్తావన వచ్చేసరికి బాదల్ దిగులుపడ్డాడు. ఎందుకనంటే అతడిజీవితంలో ఇదే తొలివైభవం. ఇదే తుదివైభవమేమో అనికూడా అనిపించింది.

బాదల్ జీవితంలో ఇంక ఎప్పుడైనా సంభవిస్తుందా ఇలాంటి విచిత్ర సన్నివేశం :

* * *

ప్రయాణసాధనం — బండి - ఎద్దుబండి.

బండి ఎక్కగానే గౌరాంగ్‌కి ఏదో గుండెలు కుదుటపడ్డట్లనిపించింది. ప్రశాంతంగా ఓ నిట్టూర్పు విడిచి, "నీకు యింకా వుండాలని వున్నదా యేంరా ?" అని అడిగాడు కొడుకుని.

బాదల్‌కి అభిమానం గిడ్డకట్టుకుంటూ వచ్చింది. సమాధానం చెప్పలేదు.

"పరాయిచోట ఎక్కువరోజు లుండకూడదు. తెలుసా ?"

బాదల్ తీవ్రమైన అభిమానంతో - "నేనేం వుండాలనుకోలేదు" అన్నాడు.

"అనుకోలా ? వుండాలని వుబలాటంగా లేదూ?"

"వుబలాటాన్ని నువ్వు కళ్ళతో చూడగలవా?"

తండ్రివైపునుంచి ముఖం అటుత్రిప్పుకొని కూర్చున్నాడు బాదల్.

గౌరాంగ్ నవ్వుతూ - "కళ్ళతో చూడలేకపోవట మేమిట్రా? బాగాచూడగలను. నీ ముఖంలో రాసిపెట్టే వుందిరా. క్రొత్తపిన్నిదగ్గిర కొన్నాళ్ళుండాలి, కడుపునిండా రసగుల్లలు తినాలి. అని నీకు వుబలాటంగానే వుంది" అన్నాడు.

ఇంత అవమానాన్ని సహించటానికి బాదల్ యిష్టపడలేదు. కోపంతో ప్రతివాదానికి దిగాడు. "ఎన్నటికీలేదు. నేనంత ఆశపోతుని కాను. అలా అయితే పిన్ని హారాన్ని ఎందుకు తీసుకునేవాణ్ణి కాను ?"

"ఏ హారంరా ?" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు గౌరాంగ్.

"నీకు పెళ్ళియిజా యివ్వాలనుకున్న హారం: దాన్ని నాకు యివ్వాలని ఎంతో మనసుపడింది. నేను తీసుకోలా."

గౌరాంగ్ నవ్వుని దాచుకుని, కుర్రవాణ్ని ఇంకొంచెం రెచ్చ కొట్టాడు. "ఎందుకు తీసుకోలా ? నీకు ఒక నగ అమరినట్లయేదిగా"

"ఎందుకు తీసుకుంటాను ? తీసుకుంటే నాన్న వీపు పగలకొట్టే స్తాడని చెప్పాను."

"అలా అని చెప్పావా ? నేను కొట్టానా నిన్నుయెప్పుడైనా ?" గౌరాంగ్ కళ్ళు రెండూ పత్తికాయిలయినాయి.

"తప్పించుకోటానికి అన్నాను. లేకపోతే విడిచిపెట్టలేదు మరి" అన్నాడు బాదల్ భయపడుతూ.

"నీ వీపు పగల కొట్టాల్సిందే !"

ఈసారి ముఖం అటు తిప్పుకుని కూర్చోవలసిన వంతు తండ్రిది. ప్రొద్దు వాలిపోసాగింది. అయినా యెండ తీవ్రంగానే ఉంది. ఎండ భయంతో వారు బండిగూడు లోపలివైపుకి తిరిగి కూర్చున్నారు. డొంకదారినే వెడుతోంది బండి.

చాలాదూరం వెళ్ళాక ఓకుర్రవాడు పరుగెత్తుకుంటూ వచ్చి బండి పట్టుకున్నాడు.

గౌరాంగ్ ముఖం బయటికి పెట్టి "ఏమిటి ?" అని అడిగాడు.

"అపర్ణమ్మగారు మీకోసం, మీ అబ్బాయికోసం 'రాధాగోవింద్' మాలలు రెండు పెట్టివుంచారు. వాటిని పంపించారు; ఇదిగో ఉత్తరం" అని చెప్పి రొప్పడం మొదలెట్టాడు కుర్రాడు.

అరటాకులో చుట్టివున్నాయి రెండు పెద్ద దండలు. తాజాగా వున్న బరువైన దండలు.

ఉత్తరంతీసి చూశాడు గౌరాంగ్. రెండుపంక్తులు రాసి ఉన్నాయి.

"పిలిచే ధైర్యంలేదు, ఎప్పుడైనా అవసరంకనుక వస్తే జ్ఞాపకం ఉంచుకోండి. చిరునామా క్రిందవుంది.

బాదల్ పిన్తల్లి"

క్రింద చిరునామా—

"అపర్ణాఘోష్,
శరత్‌భవన్, త్రివేణి—"

అని ఉంది.

"సమాధానం రాసి యిస్తారా ?" అని అడిగాడు కుర్రాడు.

"ఉహూఁ. నువ్వెళ్ళు" అని కాగితం మడిచి పట్టుకున్నాడు గౌరాంగ్. తర్వాత బండి మళ్ళీ బయిలుదేరాక పరధ్యానంగా ఆ కాయితాన్ని ముక్కలు ముక్కలుగా చించి గాలిలోకి వదిలేశాడు.

ఆ కాయితం ముక్కలు గాలికి ఎగిరి అక్కడో ముక్క అక్కడో ముక్క పోయిపడ్డాయి.

బాదల్ అప్పుడు వెనక్కి తిరిగి పరుగెత్తుతూ పోతున్న కుర్రవాడికేసి చూస్తూ వున్నాడు. తన పిన్ని ఉత్తరానికి కలిగిన దుర్గతిని చూడలేదతడు.

* * *

ఎండవేడి తగ్గి, క్రమంగా చల్లబడుతూ వచ్చింది. చల్లగాలి తిరిగింది. బండి కొంతదూరం బాగా పెరిగిన గడ్డిలోనుంచి, కొంతదూరం చవిటిపర్రిలోంచి, మరికొంతదూరం అటూ ఇటూ అడవిలావుండి,మధ్యనున్న ఇరుకుదారిలోనుంచి పోతోంది.

చెట్ల చిటారు కొమ్మలమీద ఎండపొడలు,కిరింద నీరెండకాంతులు వ్యాపిస్తున్నాయి.

తండ్రి కొడుకుల ఇద్దరిమనస్సులు నిరుత్సాహంగా వున్నాయి. ఆ నిశ్శబ్దతకి భంగం కలిగిస్తూ - "నువ్వు మెదలకుండా కూర్చునే వున్నావ్. ఆదండ వేసుకోనేలేదేం బాదల్ ?" అన్నాడు గౌరాంగ్.

"ఇంటికి వెళ్ళాక వేసుకుంటాను. ఇంటికెప్పటికి చేరుకుంటాం నాన్నా ?" అని అడిగాడు బాదల్.

"ఇదే - ఇంకాసేపటికి"

మళ్ళీ కాసేపు నిశ్శబ్దం.

కొంచెం సేపయాక బాదల్ అటుజరిగి, ఇటుజరిగి తండ్రి దగ్గరగా కూర్చుని "నిన్నరాత్రి కీర్తనలు పాడేప్పుడు నువ్వు అచ్చంగా పటంలోవుండే దేవుడిలా వున్నావు నాన్నా !" అన్నాడు.

"ఛా ! అలా అనకూడదు" అన్నాడు గౌరాంగ్.

"నాకు అలా అనిపించింది నాన్నా! ఇంటిదగ్గిర వున్నప్పుడు పాడే ప్పుడు అలా ముస్తాబు అవవేం ?"

"ఇంట్లోనా ? అలా అయితే మీ మామ వీపు పగలకొట్టేస్తాడు" అన్నాడు గౌరాంగ్ నవ్వుతూ.

"ఉస్. పగలకొట్టటమేమిటి ? నేను పెద్దవాణ్ణి అయాక నీకు చాలా పెద్ద కీర్తన కచేరీలు ఏర్పాటు చేస్తాను నాన్నా ! నువ్వు పాడ తావ ? అందరూ చెవులు దోరగించుకుని వింటూ కూర్చుంటారు"

గౌరాంగ్ కొడుకుని దగ్గిరకి తీసుకుని "నువ్వు పెద్దయాక మన సంచార వీధినాటక సమాజాన్ని స్థాపిద్దువుగానిరా !" అన్నాడు.

బాదల్ ఉత్సాహంతో "సమాజం ఎప్పుడు నాన్నా మొదలు బెట్టేది ?" అని అడిగాడు.

"పెడతాం. పెడతాం. డబ్బు వెసులుబాటు కాగానే పెడతాం"

"ఎంతడబ్బు కావాలి నాన్నా ?"

"చాలా —"

"కొత్తపిన్నికి చాలా డబ్బు వుంది"

కొడుకు ఆలోచనా ధోరణిని ఊహించి, గౌరాంగ్ నవ్వుతూ— "దేశంలో వాళ్ళకి వుంటే మనకేమిటి లాభం ?" అన్నాడు.

బాదల్ లజ్జితుడై మెదలకుండా ఊరుకున్నాడు. కాని బాల్య చాపల్యంవల్ల బాదల్ మళ్ళీ "చూడు, చూడు నాన్నా ! ఆకాశం ఎంత ఎర్రబడిందో ! సూర్యుడింక కొండదిగి పోతున్నాడు కదూ !"

"ఊఁ"

"పాట పాడరాదూ నాన్నా ! చల్లటి గాలి వీస్తోంది మెల్లిగా"

"అరె ! బాదల్‌బాబూ ! నువ్వు కవివయి పోయినట్లున్నావేంరా చూస్తే. ఏ పాట పాడమంటావ్ చెప్పు."

"నీ యిష్టం. నిన్న పాడిన పాట"





"విన్న ఎన్నో పాడాను. ఉండు, ఓ క్రొత్తపాట పాడతాను"
'కాని పోని ఆశలతో
కదంబవాటిక కేగినావు
కంటకములు దారి నైన
గాంచ వైతివేల రాధ'

• • • •

తులసికోటముందు దీపాలు పెట్టేవేళ అవుతోంది. గృహిణీమణులు తులసికోటలముందు అలికి, వాకిళ్ళముందు సంజెకసవు లూడ్చి, నీళ్ళు చల్లుతున్నారు. పశువుల్ని మేతకి తోలినవాళ్ళు, తమ పిల్లల్ని పిలిచినట్టే తమ పశువుల్ని పేర్లుపెట్టి "వెంకన్నా రా, రామన్నా రా, లక్ష్మన్నా రా" అంటూ బిగ్గరగా పిలుస్తున్నారు.

వయసుమళ్ళిన గృహిణులు జపమాలలు చేతపుచ్చుకుని పూజా మందిరాలముందు కూర్చున్నారు. ఈ సమయంలో ఓ ఎద్దుబండి ఘోషాల్ గారింటి ముందుకు వచ్చి ఆగింది.

సరిగ్గా ఆసమయానికి వీధిగుమ్మంలో నీళ్ళు చల్లటానికని— వాసంతి లోపల్నుంచి వచ్చింది.

ఎద్దుబండి ఆగటం చూడగానే ఠపీమని అక్కడే నిలబడి పోయింది. బాదల్ బండిలోనుంచి దిగటం చూసి ఉల్లసిత హృదయంతో అభ్యర్థన తెలుపుతూ - "అరె ! బంగారు తండ్రి ! బాదల్ ! ఇవాళే వచ్చేశావే ! రా, రా. ఈ యెండలో ఇంతదూరం ఎద్దుబండిమీద రావటంతో ఎర్రిటి ముఖం ఎంత వాడిపోయింది. ఏం మహాశయా ! కలవారి లోగిలి మీ మనస్సుకి కంటకంగా తోచిందా యేం ?" అన్నది.

గౌరాంగ్ బండి కుదుపు అంతా పోయేందుకు ఒక్కసారి వళ్ళు విరుచుకుంటూ "ఏమన్నారు ! నా మనస్సులోని మాట మీ కొక్కరికే తెలుసు అని ఊరికే అంటావా నేను !" అన్నాడు.

గౌరాంగ్ ముక్తకంఠం ఇంట్లోకల్లా విన్పించింది.

శశిధర్ అప్పుడే పీటవేసుకుని "సాయంసంధ్య" వార్చుకోటానికి కూర్చున్నాడు. లేవటానికి వీల్లేదు. నిస్సహాయమైన కోపంతో జంధ్యం చేపట్టుకుని, చెవులు రిక్కించుకుని [illegible]న్నాడు.

* * * *

"అమ్మ యెక్కడ అత్తా ? చేతిలోని పూలమాలలమీది ఆకుని జాగ్రత్తగా పట్టుకుంటూ ప్రశ్నించాడు బాదల్.

"మీ అమ్మ పెత్తనాలకి వెళ్ళిందప్పుడే. ఎక్కడ తిరిగివచ్చింది? ఏమిటివి ? పూలా ?"

"పూలుకాదు, మాలలు. ఒకటి నాది, ఒక్కటి నాన్నది"

ఆ మాలల పొట్లం అత్త చేతి కిచ్చాడు బాదల్.

వాసంతి పైన చుట్టివున్న ఆకుల్ని తీసేస్తూ, నవ్వుతూ "అలాగా? శ్రీమంతులు ఒరి పూలదండలు మాత్రమే వేసి సాగనంపారాయేం మహాశయా !" అని అడిగింది.

నవ్వుతూనే ఓ దండతీసి బాదల్ పాదాలకి తాకేటంత పొడవుగా వేసి "ఎలా వుంది చెప్పండి మహాశయా ! అచ్చగా కృష్ణుడిలాగానే వున్నాడు కదూ ? శిరస్సున శిఖ, చేతిలో వేణువు ఉంటేచాలు"అన్నది.

"ధూత్ !" అంటూ బాదల్ లజ్జితుడై, నవ్వుముఖంతో యిటు తిరిగి తన రూపాన్ని చూసుకోటం మొదలెట్టాడు. రెండోమాలని తీసుకుని గౌరాంగ్‌వైపుకి అందిస్తూ "ఇదిగో, తీసుకోండి మహాశయా ! మీ వంతు దండని ధరించరాదూ ఓసారి ! కలియుగ గౌరాంగ్‌ని చూస్తే కళ్ళు సార్ధకమవుతాయి" అన్నది.

కేవలం సహజమైన పరిహాసమే. కాని ప్రపంచజ్ఞాన శూన్యుడైన గౌరాంగ్ హఠాత్తుగా ఓ పెద్ద తెలివితక్కువ పని చేసి కూచున్నాడు. వాసంతి చేతిలోంచి మాలని తీసుకుని చటుక్కున వాసంతి మెళ్ళోనే వేసి—

"మాలకాదు సఖీ, మాలకాదు
ఇది మదీయ హృదయజ్వాల"

అని పాడాడు.

"ఈ క్రొయ్యబొమ్మ మెడకి మాల ఏం శొబగు నిస్తుంది? ఎక్కడ రాణిస్తుందో అక్కడే ఉండనీండి" అన్నాడు.

హఠాత్తుగా ఈ సంఘటన జరిగినచోట బాంబు పేలింది. శశిధర్ రూపమైన బాంబు.

వాసంతిని కనుసైగతో, చేసైగతో లోపలికి వెళ్ళమని ఆదేశించి, గౌరాంగ్‌వైపు నిప్పులు క్రక్కుతూ చూస్తూ "నీ వెర్రిమొర్రి వేషాలకి ఇంకెక్కడా అవకాశం దొరకలేదా ? ఇది గౌరవనీయుల యిల్లా, కల్లు పాకా ?" అన్నాడు.

ముఖాముఖిని యిలా యెప్పుడూ విరుచుకుపడలేదు శశిధర్. అయితే ఇంత మరీ వెర్రిమొర్రిగా మాత్రం ఎప్పుడు ప్రవర్తించాడు గౌరాంగ్ !

అతడు శశిధర్‌కేసి నిర్ఘాంతపోయి చూస్తూ ఊరుకున్నాడు. మాలని తీసి క్రిందపారేసి వెళ్ళిపోయింది వాసంతి.

శశిధర్ పాంకోళ్ళతో ఆ మాలని నులిమివేసేస్తూ నుంచున్నాడు. ఏదో చెప్పుతో చీమలపుట్టని నేలరాచేస్తున్నట్లు.

నేల రాచిరాచి ఆనవాలు లేకుండా చేస్తేకాని కోపం, అసహ్యం పోయేట్లులేదు.

అసహ్యం, అసూయ, అనుమానం, ఆగ్రహాల కలయికతో శశిధర్ ముఖం ఏదో ప్రేతముఖంలా కన్పిస్తోంది.

• • •

స్టేషన్ మాష్టర్ తన క్వార్టర్స్‌లోంచి బయటికొచ్చాడు. ఆనందోద్వేగంతో మిత్రుని ఇంచుమించు గట్టిగా కావలించుకుని "రా, రా. ఇవాళే వచ్చేశావన్నమాటయితే. మంచిపని చేశావ్. మంచిపని చేశావ్. ఊఁ. ఇంతకీ ఎలా జరిగింది అక్కడ ? అక్కడివాళ్లు రసగ్రహణ పారీణులుగా కన్పించారా ?" అని అడిగాడు.

గౌరాంగ్ ఓ ప్యాకింగ్ బాక్స్‌మీద చతికిలపడి క్లాంతభావంతో - "పారీణులా ? మాచెడ్డ రసగ్రహణ పారీణులే ! పాటవిని మెళ్ళో హారాన్ని ఉపహారంగా ఇవ్వటానికి సిద్ధపడినంత ఉదారులుకూడా !" అన్నాడు.

"మెళ్ళోహారమా ? ఆడవాళ్ళా యేం ?"

"కాక మరింకెవరని? అంతఃపురానికి పిలిచి తీసుకెళ్ళి "సందేష్" అవీ ఫలహారం పెట్టి "మీ అబ్బాయికి నే పిన్నినయాను. వాడికి బొమ్మ లవీ కొనిపెట్టటానికి డబ్బు తీసుకోండి. మీ పాటవిని నేను చాలా ఆనం దించాను. నా మెళ్ళో హారాన్ని బహుమతిగా తీసుకోండి"అన్నారు.అబ్బ అదెంత విషమ సంకట పరిస్థితి అవి" అన్నాడు.

మాష్టరు కొంచెం తటపటాయిస్తూ - "వయస్సు తక్కువ ఉన్న ఆమె అయి వుంటుంది అనుకుంటా !" అన్నాడు.

గౌరాంగ్ వెంటనే విసురుగా తలత్రిప్పుతూ - "తక్కువా ? ఏమీకాదు. వయస్సు తక్కువే అయినట్లయితే - గ్రాహ్యంరాని పిల్ల, తెలివితక్కువ పిల్ల అనుకునేవాణ్ణే. ఏం - ఇరవైనాలుగు, ఇరవై ఐదు ఏళ్ళు వుంటాయి. అసలు కాస్త మతిచాంచల్యం వున్న మనిషేమో అనికూడా అనిపించింది నాకు" అన్నాడు.

మాష్టరు ఎంత ఆవేశపరుడైనా - గౌరాంగ్ కంటె కాస్త వాస్తవ దృష్టి కలవాడు. అంచేత అతడి సగం నెరిసిన మీసాలచాటున కొంచెం నవ్వు కన్పించింది. తర్వాత "వితంతువా ?" అని అడిగాడు.

"వితంతువా? అది నాకెలా తెలుస్తుంది ? నా మనస్సుకేమిటో విడ్డూరంగా తోచింది. తిరిగి వచ్చేశాను."

మాష్టరు అభినందనపూర్వకంగా అతణ్ణి వీపు చరచి, "మంచి పని చేశావ్. అలాంటి వాళ్ళంతా – కొంప ముంచేసజ్జు. పోనీలే నాకో పాట విన్పించు" అన్నాడు.

"ఉహూ !" గౌరాంగ్ తలత్రిప్పుతూ "ఇవాళింక వీలుపడదు. ఇవాళ పాట వచ్చేట్లు లేదు. అవునుకాని మాష్టర్, మనుషులింత తెలివి తక్కువ వాళ్ళెందు కవుతారంటావ్ ?" అని అడిగాడు.

మాష్టర్ ఈ ప్రశ్నకి సమాధానం చెప్పలేదు. జిజ్ఞాసా దృష్టితో చూస్తూ వుండిపోయాడు.

"నాకు తెలియకడుగుతాను. ఇంత అసూయ, ఇంత కోపం ఎందుకూ ? నవ్వుతూ, పాడుతూ జీవితాన్ని గడిపేస్తే నష్టమేమిటి

చెప్పండి. ఈ పృధివి, ఈ వెలుగు, ఈ గాలి – వాటికేసి చూద్దామని కూడా వుండదు. ఎందుకని మానవులకి ?"

మాష్టరు మృదుగంభీర హాస్యంతో - "మనుషులు చాలా తెలివైన జీవులు. నవ్వులతో, పాటలతో కాలం గడిపేస్తే వాళ్ళ తెలివితేటల కవకాశం యెలా వస్తుంది. ప్రపంచంలో ఇంత వెలుగు, ఇంత ఆనందం ఉన్నా, మనిషి తెలివితేటల భారంతో బరువెక్కిపోతాడు. తెలివి - ఆనందం ఈ రెండింటికీ సవతుల సంబంధం తెలుసా?" అన్నాడు.

• • • • •

చాలాసేపు కూర్చునివుండి "ఇవాళ నీ మనస్సు బాగుండలేదు.రా, ఇంటికిరా. నాటకం విందువుగాని" అన్నాడు.

చిన్న కుటీరంలాంటి ఇంట్లో ప్రవేశించా రిద్దరూ.

టేబిల్‌మీద నాలుగుపలకల లాంతరు పెట్టుకున్నారు. తెల్లవారి కట్ల రైలుని స్టేషన్‌ని దాటించి పంపటానికి స్టేషన్ మాష్టరు చేత పట్టుకువెళ్ళే లాంతరది.

ఓమూల బెజ్జాలుకొట్టి దారంకట్టి, ఉన్న ఆఫీసు కాయితాల బొత్తి లాంటి నాటకం రాసిన కాయితాల బొత్తిని బయటికి తీశాడు స్టేషన్ మాష్టరు. కొంచెందగ్గి, అటూ ఇటూ కదిలి గొంతు సవరించుకుని మొదలుపెట్టాడు. రాముడి వనవాస సమయంలో "ఊర్మిళాలక్ష్మణుల సమావేశం" రామాయణంలో అంతా సీతని గురించిన ఆధిక్యతేతప్ప - ఊర్మిళ ప్రసక్తేలేదు. చూశావా ? ఆమె యేదో పాపం మూగదయినట్లు ఇక్కడ ఊర్మిళ ముఖతః కొంచెం తరచి తరచి ప్రశ్నలడిగించాను. తెలిసిందా ? లక్ష్మణుడు ఊర్మిళతో చెప్పటానికి వచ్చినప్పుడు—

అయివరాననా ! అనురాగశీలినీ !
సైరించు యెడబాటు పదునాలుగేండ్లు -
తండ్రియానతి కానతరలి పోతున్నాడ
వనవాసమునకేను—

రఘువంశధరుడ వలఘ్ను విజ్ఞానమతివి
పరమ మూర్ఖుని పగిది భాషింపదగడు
తండ్రియానతి జ్యేష్ఠతనయు దరుగుచు నుండ
సేవకులవలె వెంట చనుచుంటిరయ మీరు—

అతి సుకుమారవతి అతివ జానకికి
వనవాసమున యేమివచ్చునో ఆపదలు
శంకించి వెనువెంట శస్త్రధరులై మీరు
అధమ సేవకు పగిది —

కిరోసిను దీపంముందు మాష్టరుగారి ముఖం ఉజ్వలంగా కన్పిస్తోంది. ఆ దీపపు కాంతి మూలంగాకాదు, రచనా సాఫల్యపు సంతృప్తివల్ల. ఈసారి తలయెత్తి "అంత మరీ చెడ్డగాలేదు. ఏమంటావ్ ?" అని అడిగాడు.

"చెడ్డగానా ?" అభిఘాతుడైన గౌరాంగ్ రుద్ధకంఠంతో "చాలా బాగుంది. అద్భుతంగా వుంది. ఇలా ఎలా రాయగలిగారా అని ఆశ్చర్య పోయినాను. భావాలు నాకూ వస్తాయి చాలా. కాని మాటలు మాత్రం పెకలవు. మీకు ఇన్ని మాటలు యెలా స్ఫురించాయి ?" అన్నాడు.

మాష్టర్ సంతృప్తిగా నవ్వి - "నువ్వు పాట పాడేప్పుడు - నేనూ అనుకుంటూ ఉంటా. నీ గొంతు యింతలా ఎలా ఒదుగుతోందా అని....కాని ఊర్మిల ఎవరు వేయాలని అనుకోవడం ?" అని అడిగాడు.

"అదే పట్టుకున్న దిగులు. పాత్రని ఎవరూ అర్థంచేసుకోలేరు. సరే, భగవంతుడే చూపిస్తాడు చివరికి ఎవరో ఒకర్ని....కాని—మిగిలినది పూర్తిచెయ్యండి."

"ఆఁ, ఎంతవరకు అయింది ? ఆఁ, ఈసారి లక్ష్మణుడంటాడు-

ఏల యీ దూషణ - ఎందుకు నింద
పరమేష్ఠి లిఖితము ఫాలభాగమున
చిరకాల దాస్యమ్మె - జీవితేశ్వరి నాకు.

నూరు సంవత్సరాల క్రితం నాటి భాషలో రాసిన "రామవనవాస" యక్షగానాన్ని ఆధారం చేసుకుని, స్వప్న సౌధాలు నిర్మించుకుంటు న్నాడు.

ఈ యుగంలో "పరమాణు బాంబులు" కూడా అనాటి వయి పోయాయి. ఈవార్త వారిదగ్గిరకి చేరలేదు.

• • •

అక్కడ నిభానవి ఓ కబురు మోసుకుని వచ్చింది యింటికి. కూతుర్ని పేరెట్టి పిలిచి, "విన్నావా సుధా ? చతుర్భుజులు వెళ్ళిపోతు న్నారు !" అని చెప్పింది.

సుధ యింట్లోంచి బయటికివచ్చి : "అలాగా? ఎవరుచెప్పారు?" అని అడిగింది.

అక్కడ వంటయింట్లో వున్న వాసంతి గుండెలు గతుక్కు మన్నాయి.

"నారాయణులు వెళ్ళిపోతున్నారు?"

ఆయన సందర్శనం కలగలేదు. ఆయన ఇక్కడికి వేంచేసి మాసం రోజులకు పైగా తమ దర్శనాన్ని అనుగ్రహించారు. గ్రుడ్డి, కుంటి, మూగ, చెవిటి - ఎవరూ దిగబడిపోలేదు చూడకుండా. ఒక్క వాసంతి మాత్రం వంచితురాలై వుండిపోయింది.

నిభానని కూతురుతో మాట్లాడుతూ కూచుంది - "వాడ వాడ యావత్తూ మళ్ళీ దర్శనం చేసుకోటానికి వెళ్ళింది. ఈ అదృష్టం మరో సారి లభించదు. బెనర్జీగారి ఆవిడ చెప్పింది నాతో. "నేను మళ్ళీ వెళ్ళ లేదు. ఓసారి వెళ్ళాను అంతేచాలు. ఈ కీళ్ళ వాతపు నొప్పులతో మళ్ళీ క్రోసుదూరం నడవలేను" అన్నాను."

"కాళ్ళకి తైలం రాయటం కాలేదనుకుంటా నీకు ? ఎలా అవు తుందిలే ? ఎవరుచేస్తారు ? నీ కోడలున్నదంటే - 'రాధాదేవి.' ఆమె నవ్వులు - పరిహాసాలతోనే సరిపోతుందికదా ఆవిడకి? ముసలి అత్తగారి ఉపచారాల బాధ్యత ఎప్పుడు పైనవేసుకుంది ? ఇలారా. నేను కాస్త తైలంరాచి మర్దన చేస్తాను" అన్నది సుధాముఖి.

అయితే సుధాముఖి నయినా వెనకేసుకురాలేదు నిభానని. ఆమె మాటలకి ఏమాత్రం విలువ ఇవ్వకుండా "చాల్లే ఊరుకోవే సుధా! నీ శ్రద్ధా, ఓపిక నాకు తెలియనివి కావులెద్దూ?" అన్నది.

* * *

తల్లీ కూతుళ్ళ సంభాషణ ఆగిపోయింది. ఇహ వాసంతి ఒక్కతే కంటతడి పెట్టుకుంటూ కూచుంది వంటింట్లో....

శశిధరుడు చేసిన అవమానం ఆమెకి హృదయవిదారకమయింది. ఆ ఆఘాతంలోనే కుంగిపోయిన మనస్సుకి 'నారాయణులు అంతర్ధానమవుతున్నారు' అన్న మరో ఆఘాతం వచ్చి తగిలింది.

రాత్రి అభిమానంకొద్దీ కింద చాప ఒకటి వేసుకుని పడుకున్నది వాసంతి. శశిధర్ చేసిన అవమానానికి ఆమెకింక పక్కమీద పడుకో బుద్ధి పుట్టలేదు.

శశిధర్ పేకాట దగ్గిర్నుంచి రాత్రి ప్రొద్దుపోయి వచ్చాడింటికి. గదిలోకివచ్చి ఓసారి వాసంతికేసి ఓరగా చూసి, ఏం మాట్లాడకుండా చొక్కావిప్పి గోడనున్న వంకెకి తగిలించాడు. బల్లప్రక్కన స్టూల్‌మీద పెట్టి వున్న కూజాలోంచి గ్లాసెడు నీళ్ళు తీసుకుని, గడగడ త్రాగేశాడు. తర్వాత కొంచెం స్వస్థతగా బల్లమీద కూర్చుని "ఒట్టిక్రింద పడుకున్నావ్ దేనికి?" అని అడిగాడు.

వాసంతి మాట్లాడక ఊరుకుంది అని వేరే చెప్పనక్కర్లేదు. "క్రింద పడుకుని శైత్యం రప్పించుకోవాల్సిన అవసరమేమొచ్చింది?" అప్పటికీ వాసంతి కదల్లేదు, మెదల్లేదు.

శశిధర్ కొంతసేపు గడవనిచ్చాడు. తర్వాత డబ్బీ తీసుకుని రెండు 'పాన్'లు ఒక్కసారే బుగ్గనిపెట్టి కొంచెం జరదాకూడా వాటితో పాటు వేసుకుని, తర్వాత సహజమైన ధోరణిలో — అంటే కొంచెం అధికారం చలాయిస్తూ "లే, లేచి కూర్చో. జబ్బుచేస్తుంది" అన్నాడు.

ఈసారి వాసంతి దగ్గిర్నుంచి వచ్చింది సమాధానం,

"చెయ్యనీండి, జబ్బు"

"చెయ్యనీండి జబ్బా ? వాహర్ ! అర్థంలేని మాటలన్నీ"

వాసంతి ఈసారి లేచి కూర్చుంది. గద్గదకంఠంతో "అర్థంలేని దేముంది ? నే చచ్చిపోతే మీరు హాయిగా ఉందురుగాని. బాగా జబ్బు చెయ్యనీండి నాకు. అది ఎక్కువై, ఎక్కువై చచ్చిపోతాను. మీరూ బ్రతికిపోతారు. నేనూ బయటపడతాను" అన్నది.

"హుం" శశిధర్ కాసేపు మూతి బిగించుకు కూర్చుని వ్యంగ్య తిక్త కంఠంతో — "నువ్వు చచ్చిపోతే గౌరాంగ్‌గతి ఏమవుతుంది ?" అని అడిగాడు.

పెద్ద పెద్ద కళ్ళు రెండింటితో బెదరింపుగా చూసి వాసంతి మళ్ళీ మెదలకుండా పడుకుంది.

శశిధర్ లేచి నిలబడి, కాసేపు అటూ ఇటూ తిరిగి వాసంతి చాప దగ్గిరకి వచ్చి నిలబడి, భీషణ స్వరంతో "నీ నటనంతా కట్టిపెట్టు. ఇవా ళేదో తేల్చేస్తాను నేను. ఆ దుర్మార్గుడితో ఇంక మాట్లాడనని, నా ఒంటి మీద చెయ్యివేసి ఒట్టేసుకో" అన్నాడు.

వాసంతి మళ్ళీ లేచి కూర్చుంది.

"నేనేం పిచ్చిదాన్ని కాను" అన్నది క్రుద్ధకంఠంతో.

శశిధర్ నిప్పులు కక్కుతూ "ఆ సమాధానం చెపుతావని ముందు గానే తెలుసు నాకు. నిజంగా పతివ్రతవే అయితే అవలీలగా ఒట్టేసుకో గలిగేదానివే; పతివ్రతలు కాని స్త్రీలు—" అన్నాడు.

"ఏమిటీ ? ఏమన్నారు ? ఇంత మాటంటారా మీరు నన్ను ?"

వాసంతి హృదయాఘాతానికి శశిధర్ వెనుతీయలేదు. అదే ధోరణిలో "పరపురుషునిమీద మనసుపడినదాన్ని. పరపురుషునిచేత మెళ్ళో మాల వేయించుకున్నదాన్ని అంతకంటె ఇంకేమంటారు ?" అన్నాడు.

"సరే" వాసంతి స్థిరస్వరంతో "అసతియైన భార్యతో సంసారం చెయ్యవలసిన అగత్యం ఏముంది మీకు. నేను చచ్చి మీకు విముక్తి కలి గించిపోతాను" అన్నది.

శశిధర్ కొంచెం ఇరకాటంలోపడి "అవన్నీ ఊరికే పైకి అనే పెద్ద పెద్ద మాటలు. 'చచ్చిఅయినా పోతానుకాని, ఆ గౌరాంగ్‌తో మాట్లాడ్డం మానేస్తానని ఒట్టుమాత్రం వేసుకోను' అంటావు. హూం దీన్నిబట్టి అయినా లోకులు సందేహించరూ ?" అన్నాడు.

• • • •

చాలాసేపు లోపల్లోపల కుమిలి కుమిలి యేడ్చి నిద్రపోయింది వాసంతి. చాలా తెల్లారకట్ట మెళుకువ వచ్చింది. చూస్తే శశిధర్ ఇంకా నిద్రపోతున్నాడు.'అతడులేచి తాను చనిపోయి వుండటం చూస్తే బావుం టుంది. చాలా బావుంటుంది' అని అనిపించింది మనస్సుకి.

అహం. తాను చచ్చేపోతుంది"

నిశ్శబ్దంగా లేచి బిందెఒకటి చేతపుచ్చుకుని.వంటింటి వెనుక వైపు నుంచి చెరువుకి వెళ్ళటానికి బయలుదేరింది. కాని పాపం ! వాసంతి దురదృష్టంవల్ల చెరువులో నీళ్ళుకూడా దుర్లభమయాయి. శీతకాలపు చలి రోజులు. చెరువులో నీళ్ళు చీలమండల లోతుకంటె ఎక్కువలేవు.ఎండి పోయాయి.

చెరువు ఒడ్డున ఓ పెద్ద గన్నేరుచెట్టు వుంది. కాసేపు దాని క్రిందనే నిలబడి చెరువుకేసి చూస్తూ వుండేసరికి హఠాత్తుగా తన కాళ్ళ దగ్గిర దృష్టి పడింది. ఎండిపోయిన ఆకులమీద అక్కడక్కడ గన్నేరు కాయలుపడి వున్నాయి.

గన్నేరు కాయలు.

క్షణంలో ఓ ఆలోచన వచ్చింది. ఇదిగో అరచేతిలో మృత్యు వున్నట్లే ! గన్నేరుపప్పు కనుక తింటే చావు తప్పకుండా లభిస్తుంది అవి వినివుందామె.

అయితే ఇహనేం ?

విముక్తి అనేది గుప్పిట్లో వున్నప్పుడు అనుక్షణం ఎందుకు ఈ 'నాగపాశబంధన' బాధని అనుభవించటం ఇంకా వెలుతురు రాలేదు. చేతికి అందుబాటులో చెట్టుకింద ఎండుటాకులమీద పడివున్న గన్నేరు

కాయల్ని ఏరుతూ ఏరుతూ - ఆలోచించసాగింది. ఆశ్చర్యం చావుకింత తేలికయిన ఉపాయం - ఇన్నాళ్ళూ తన మనస్సుకి తట్టనేలేదెందుకని ? ఇన్నాళ్ళూ బ్రతికివుండి తానెందుకు "ఇంత యమ-చెర" పడింది ?

ఇది విధాత కలిగించే భ్రాంతే అన్న సంగతి వాసంతికి తెలియదు. ఏ సమయాని కా సమయానికి మానవులకి విముక్తి మార్గం అంత తేలిగ్గా స్ఫురించేట్లయితే లీలామయుడైన భగవంతుని లీలలు పరిసమాప్తమవ టానికి ఎంతోకాలం పట్టదు.

విముక్తిని గుప్పిట్లో పెట్టుకునికూడా మానవులు దుఃఖిస్తారు, ఆరాటపడతారు, తలలు పగలకొట్టుకుంటారు, ఆపసోపాలు పడతారు. ఇదే నియమం. అనాదికాలంనుంచి ఈ ఆశ్చర్యమైన విధానమే జరుగుతూ వస్తోంది.

ఏమయితే యేంగాక – ఇవాళ వాసంతి భ్రాంతి తొలగిపోయింది. ఇవాళ ఆమె విముక్తి మార్గాన్ని కనుక్కోగలిగింది. ఆ మార్గం మరేమీ కాదు – గన్నేరుపప్పు తినటం.

అయితే సరిగ్గా ఎన్నికాయలు సేకరించి ఎన్ని పప్పులు తింటే నిశ్చయంగా ఫలసిద్ధి గలుగుతుందో - వాసంతి కెన్నడూ ఎవ్వరూ చెప్పి వుండలేదు. ఓ ఇరవై కాయలు పగలకొట్టి తిందామనుకున్నా తినే పద్ధతి ఏమిటో ఎవరికి తెలుసు ? చావబోతున్నాంకదా, తినకూడని వస్తువును తేనెలూరుతున్నట్లు రుచికరమైన వస్తువుని తిన్నట్లు తినటంమాత్రం సంభవమెలా ? ఏమయినా కానీయ్ - రెండోకంటివాళ్ళకి తెలియకుండా ముందు వస్తువుని సేకరించుకుంటే తర్వాత చూసుకోవచ్చు.

ఏమయినా తాను ఇవాళ చచ్చిపోతుంది. శశిధర్ గుప్పిట్లోంచి తప్పించుకుని బయటపడే ఉద్దేశం తనకి వున్నట్లు అతడికి తెలిసివచ్చేట్లు చేస్తుంది. సతి – సాధ్వి అని ఎవర్ని అంటారో అతడికి నిదర్శనం చూపిస్తుంది.

కాని ఎన్ని ఏరాలి ?

ఆ సంగతి తెలియదు వాసంతికి. అంచేత ఒడినిండా గన్నేరు కాయలు ఏరుకుంటూ వుంది.

పక్షుల కలకలారావాలు ప్రారంభమైనాయి. తూర్పుదిక్కున అరుణ కాంతులు పొట మరిస్తున్నాయి. కాసేపటి కిహ సూర్యోదయమవుతుంది. వాసంతి జీవితంలో ఇదే చివరి సూర్యోదయం. రేపటి సూర్యోదయాన్ని వాసంతి చూడదిహ.

హఠాత్తుగా గుండెల్లో ఏదో మెలివెట్టినట్లయింది. దాంతో వాసంతి కాటుకకళ్ళు కన్నీళ్ళతో పొంగి పొర్లి పోసాగాయి.

పృధివిలో ఇంతకాంతి, ఇంతధ్వని, ఇంతశోభ, వీటి అన్నిటిమీద తనకింకేమీ హక్కు వుండదు. వాసంతి జీవితంలో ఇవన్నీ నిశ్శేషమయి పోతున్నాయి.

రోజూ వాసంతి వచ్చి తన మెట్లమీద కూర్చునేదికదా అని ఈ రేవు ఎన్నడైనా తలపుకి తెచ్చుకుంటుందా ? తుప్పలతో దుబ్బులతో నిండిన ఈ వనం ఎప్పుడైనా తనని గుర్తుకి తెచ్చుకుంటుందా ? ఈ వనంలో రాలి ఎండిపోయిన ఆకుల కుప్పలమీదుగా సాయంత్రపు వేళల్లో విచిత్ర ధ్వనుల్ని స్పందింపచేస్తూ సాంసారికమైన పనులమీద ఎన్ని సార్లు వచ్చి పోతూవుండేది వాసంతి. ఇహ....ఇహ....మరి ఈ పెద్ద గన్నేరు చెట్టు ? అది యెప్పుడూ ఓ పెద్ద నిట్టూర్పు అయినా విడవదా? తన దగ్గిర ఈమృత్యు విషమేకనుక సంచితమైన వుండకపోతే బహుశా వాసంతి ఇంకా కొంతకాలం ఈ పృధివిమీద వుండగలిగేదే కదా అని పశ్చాత్తాపపడనే పడదా !

ఇంక ఆలోచించలేకపోయింది వాసంతి. కన్నీటిధారల మూలంగా ఆమె ఆలోచనా పరంపర అస్తవ్యస్తమై పోయింది. తన మృత్యు శోకంతో తనే నిశ్శబ్దంగా కుమిలి కుమిలి ఏడుస్తూ వుండిపోయింది?

అయ్యో ! శశిధరుడింత నిష్ఠురు డెందుకని ?

* * *

కాని దైవంకూడా వాసంతిమీద పగ సాధిస్తున్నాడు. లేకపోతే ఈ తెల్లవారకట్ల గౌరాంగ్‌కి ఈ చెరువు రేవుకి రావలసిన అవసరమేం వచ్చింది ? అతడు ప్రాతఃస్నానం చేస్తాడు నిజమే. కాని అది దిగుడు బావి దగ్గిర.

చనిపోవాలనే సంకల్పంతోనే వచ్చింది వాసంతి. కాని అయినా ఏదో ఓ భయంతో ఆమెకి తెలియని ఆరాటం ఒకటి పట్టుకుంది. ఓవేళ శశిధర్ హఠాత్తుగా లేచి, ప్రక్కన వాసంతి కన్పించక పోవటంతో ఇటు వైపుకి కనుక వస్తే ? కిత్రంరాత్రి అతిక్రమైన తిరస్కారంమీదట ఈ తెల్లవారకట్ల నిర్జనంగావున్న చెరువు గట్టుమీద ఇద్దరూ ఒకచోట వుండ టాన్ని చూస్తే ?

అయితే వాసంతి ఇతణ్ణి వారించటం మాత్రం ఎలా వారించ గలదు ?

సరళమైన గౌరాంగ్ పరిహాసంముందు సృష్టిలోని హైన్యం యావత్తూ సిగ్గుతో తలవంచుకో చూస్తుంది.

మరెవరైనా అయితే బహూశా వాసంతిని స్నానాలరేవులో చూడ గానే తప్పుకుని వెళ్ళిపోయేవారేమో ! కాని గౌరాంగ్‌కి ఆ ప్రవృత్తే లేదు. పైగా అతడు గబగబా దగ్గిరకి వచ్చి "ఇదేమిటి ? మీరింత పెంద రాళే స్నానం చెయ్యటానికి వచ్చారు దేనికి ? వెళ్ళండి. వెళ్ళండి. వెళ్ళి బొంతకప్పుకుని పడుకోండి. ఇప్పుడు నీళ్ళలో మునిగితే శైత్యం పట్టు కుంటుంది" అన్నాడు.

ఈ సామాన్యమైన అపేక్ష ఒలికే మాటలకే వాసంతి కనుకొలకు ల్లోంచి నీళ్ళు రాసాగాయి. అసలు సంగతేమిటో తన మృత్యుశోకంతో లోపలి దుఃఖసముద్రమే పైకి పొంగుకుని పొంగుకుని వస్తోందామెకి.

ఏడుపు అణచుకుంటూ వాసంతి తల యిటు తిప్పి "వెళ్ళండి" అన్నది.

"ఇదేమిటి ? ఏం జరిగింది ? అరె ! ఏడుస్తున్నారేమిటి ?"

వాసంతికి మాటరాలేదు.

"ఎంత బెడత ! మీ కన్నీళ్ళతో కొత్తనీరు తెప్పిస్తున్నారేమిటి చెరువుకి ?"

ఈసారి వాసంతి కళ్ళు ముఖం తుడుచుకుని "తెప్పిస్తే మీకేం ? నాకు మనస్సైంది ఏడుస్తున్నాను" అన్నది.

"బావుంది. మనస్సై ఏడ్చేవాళ్ళని నేనిదే మొదటిసారిగా చూడ్డం. బావగారితో బాగా జగడమాడి వుంటారనుకుంటా"

"జగడమా! నేను ఎప్పుడూ ఊరికే జగడమాడేదాన్నే సన్న మాట మీ దృష్టిలో?"

గౌరాంగ్ నవ్వుతూ "అహాఁ! మీరు అంటే - అదే అర్థం చేసుకోలేదూ మీరు? అంటే బావగారు బోలెడన్ని మాటలని వుంటాడు. అంతేగా! నిజమే. సుధాముఖి, శశిధర్ ఈ అన్నా - చెల్లెళ్ళ నిద్దర్నీ సృష్టించేప్పుడు బ్రహ్మదేవుడు వీరిద్దరి నాలుకల్ని మిరియాల ముద్దతో చేసి వుంటాడనుకుంటా. మీరేమంటారు?" అని తన చమత్కారానికి తానే విరగబడి నవ్వసాగాడు.

వాసంతి చటుక్కున తీక్ష్ణకంఠంతో "చాలు, చాలు. ఇంక నవ్వక్కర్లేదు. మీ యీ నవ్వే ఇంత అనర్థానికి మూలం" అన్నది.

"వాహ్! నవ్వింది తప్పు ఏముంది చెప్పండి. నవ్వకుండా మరి ఈ యిల్లులాగా ముఖం ముటముట లాడించుకుంటూ కూర్చోనా? నవ్వుతూంటే ఆరోగ్యం బావుంటుంది తెలుసా?"

వాసంతి ఇంక ఏమీ తోచక హతాశురాలై "అవునుకాని మీరు నిజంగా పిచ్చివారా? వారు మన నిద్దర్నీ సందేహించారు తెలుసా?" అని అడిగింది.

అదేమీ పెద్ద తీవ్రమైన సంగతేమీ కాదనట్లు "ఆఁ. అది చూస్తూనే వున్నానుగా! అది ఒక వ్యాధి. తెలుసా. సర్వలక్షణ సంపన్నమైన సంపూర్ణవ్యాధి. రోజురోజుకీ ముదిరిపోతున్న వ్యాధి. దీనికి ఓ మందు యివ్వటం అవసరం" అన్నాడు.

వాసంతి ఏదో చైతన్యం వచ్చినట్లు. ఉత్తేజిత కంఠస్వరంతో— "మందు వెతకటంకోసమే వచ్చాను. ఈ జన్మకింక ఈ వ్యాధి మళ్ళీ తిరగ పెట్టకుండా ఉండేమందు ఇస్తాను" అన్నది.

ఉత్తేజనంవల్ల కలిగిన తొట్రుపాటులో వాసంతి ఏరుకుని ఒళ్ళో పోసుకున్న గన్నేరుకాయలు జారి అటూ యిటూ పడ్డాయి.

గౌరాంగ్ 'ఆఁ. ఆఁ' అంటూ నిర్ఘాంతపోతూ "అరె! అరె! ఏమిటి కిందపడిపోయాయి? ప్రొద్దున్నే వచ్చి జామకాయలు కోసుకోటానికి వచ్చారా యేం? అరె! ఇదేమిటి? ఇవి గన్నేరుకాయలే!" అన్నాడు.

అకారణంగానే తలయెత్తి ఓసారి చెట్టుకేసి చూసి.తర్వాత క్రింద పడిపోయిన వాటిల్లో ఒకకాయ తీసి "ఇవియెందుకు? వీటితో యేంపని?" అని అడిగాడు.

"ఇవి యెందుకో తెలియదా?" వాసంతి వవరవలాడుతూ "వీటితో మీ బావగారి వ్యాధి కుదురుతుంది. వీటిని పగలకొట్టుకు తింటాను. తిని చచ్చిపోతాను" అన్నది.

"ఓ! అలాగా! ఏమిటీ?" గౌరాంగ్‌కికూడా కోపం వున్నట్లు కన్పిస్తోంది. అతడు కోపంతో "ఇందుకనా తెల్లవారకముందే తోటలోకి వచ్చింది?" అంటూ చెల్లాచెదరుగా పడిన కాయల్ని ఒక్కటొక్కటే ఏరి చెరువులోకి విసిరిపారేస్తూ అతడు మళ్ళీ "మీరూ అపాయకరమైన వ్యక్తిలాగానే వున్నారే చూస్తే? అయితే బావగారు అన్యాయంగా శాసించలేదు. అవునా?" అన్నాడు.

వాసంతి తీవ్రకంఠంతో "ఆ అరడి దుర్భరమవటంవల్ల ఆత్మహత్య చేసుకుందామని బుద్ధిపుట్టింది. ఈ చెరసాల బతుకు దుస్సహంగా వుంది నాకు" అన్నది.

గౌరాంగ్ తల త్రిప్పుతూ "ఉహూఁ.మీరిక్కడే పెద్ద పొరపాటు పడుతున్నారు. బావగారి నోరు చెడ్డదేకాని, మనిషి చెడ్డవారు కాదు. ఆఁ ఉండండి. నాకొక సంగతి జ్ఞాపకం వచ్చింది. చతుర్భుజులవద్దకి ఎంతో మంది వచ్చి, ఎన్నోమందులు తీసుకువెడుతున్నారని విన్నాను. బావగారి కోసంకూడా ఏదైనా తీసుకొస్తే పోయేదిగా - ఆ అనుమానరోగం పోవటానికి" అన్నాడు.

అతడలా అనటంతో హఠాత్తుగా ఏదో ఆశారేఖ కన్పించినట్లు - "మీకు వీటి అన్నిటిమీదా విశ్వాసముందా?" అని అడిగింది వాసంతి.

గౌరాంగ్ చేతులురెండు వెల్లకిల చాచి – "విశ్వాసం వుండడం వుండకపోవటం అన్నది తెలియదు పదిమందీ మన్నిస్తున్నప్పుడు అందులో ఏదో వుండకమానదు. అక్కడికి నే వెళ్ళిరానా ఒకసారి ?" అన్నాడు.

హఠాత్తుగా స్థానకాల పాత్రల్ని విస్మరించి, వాసంతి గౌరాంగ్ చెయ్యి గట్టిగా పట్టుకుని - "నన్నొకసారి అక్కడికి తీసుకువెళ్ళ గలరా ?" అని అడిగింది.

"మిమ్మల్నా ? బావగారు ఒప్పుకుంటారా ?"

"ఒప్పుకోవటమా !" వాసంతి తల త్రిప్పుతూ - "ఉహూం. ఒక్క యమలోకానికితప్ప నే నెక్కడికి వెళ్ళటానికి ఒప్పుకోరు ఆయన. అన్నసంగతి మీకు బాగా తెలుసుగా. తర్వాత ఎలాగయినా రాసి పెట్టి వుండనీండి - చెప్పకుండానే వెడతాను. ఆయన మనస్సు మార్చ టాని కేదైనా యివ్వటం భగవంతునికైనా సాధ్యమవునో కాదో. ఒక్క సారి చూస్తాను. వెడతాను నేను - ఇవాళే వెడతాను" అన్నది.

"ఇవాళా ? ఇవాళ ఆదివారమే: బావగారు కచేరీకి వెళ్ళరు. అంత కంటె రేపు మధ్యాహ్నం చాటుగా—"

"రేపా ? రేపు నారాయణులు బాసుల్ పుర్‌నుంచి మకాం ఎత్తేస్తు న్నారట !"

"అలాగా ! ఈసంగతి ఎవరు చెప్పారు మీకు ?"

"నిన్న అత్తగారు....ఆడబిడ్డా చెప్పుకుంటుండగా విన్నాను. ఇక్కడినుంచి 'జియాగంజ్' తిరునాళ్ళకి వెళ్ళి వుంటారట !"

గౌరాంగ్ "అలా అయితే ఎలా చెప్మా ?" అంటూ ఆలోచనలో పడ్డాడు.

* * *

ఉదయం పక్షుల కలకనాలు ప్రారంభమైనాయి. ఉషఃకాంతి వాసంతి ముఖంమీదికి వచ్చిపడుతోంది. చెట్లఆకుల నీడలు ఆమె శరీరం

మీద వ్యాపిస్తున్నాయి. వాసంతి నాలుగువైపులా చూసింది. ఈ పృధివి దీన్ని విడిచిపెట్టిపోవటం సంభవమా !

సరీగ్గా ఈ సమయంలో అటునుంచి సుధాముఖి రావటం కన్పించింది. బుజాన తువాల, చంకన బిందె, చేతిలో నూనెసీసా,ఆమెని చూడగానే వీరు తమ పథకాన్ని గురించిన ఆలోచన కట్టిపెట్టారు.

ఇంత చీకటితో, వారిద్దరూ ఇంత ఆసక్తితో మాట్లాడుకుంటూ వుండటం చూసేసరికి సుధాముఖి ముఖం నల్లబడిపోయింది. ఓసారి చటుక్కున ఆగింది. వెనక్కి తిరిగి వెళ్ళిపోదామన్న ఆలోచనకూడా వచ్చిందేమో బహుశా. కాని తర్వాత ఏమనుకుందో సదర్పంగా యిరువురి మధ్యనుంచి వెళ్ళి చెరువులో దిగింది. అకారణంగానే ఆ తువాల తడిపి, దాన్ని చాకలిలాగా బండకేసి బాదుతూ ఉతకటం మొదలెట్టింది.

మరొకవ్యక్తి ఈవైపుకి వస్తూ వస్తూ,భీకరమైన ముఖంతో మళ్ళీ వెనక్కి తిరిగి వెళ్ళటం వీరిద్దరూ గమనించనేలేదు.

సుధాముఖి ఇలా కోపం వెల్లడించుకోవటం చూసి గౌరాంగ్ కొంచెం కొంటెగా "సుధాముఖికి, మా బాదల్‌కి అస్సలు తేడాలేదు. ఏమంటారు ?" అంటూ.

గౌరాంగ్ వర్ణిని కమనీయ మోహిని
చెంగు చెంగున వచ్చె
స్నానాలరేవుకి.

వాసంతి ఈ పరిహాసంలో జోక్యం కలిగించుకోలేదు. ఒక్కసారి కనుబొమలు చిట్లించుకుని ఆడబిడ్డకేసి మాత్రం చూసి "ఏం నిర్ణయించారు ?" అని అడిగింది మళ్ళీ గౌరాంగ్‌ని నెమ్మదిగా గొంతు తగ్గించి.

"అయితే ఓ పని చెయ్యండి. రాత్రి వెళ్ళండి"

"రాత్రి ?"

వాసంతి తెల్లబోయి చూసింది.

"అవును. రాత్రి. చండీతలాలో రాత్రి పన్నెండుగంటలవరకు జనం గుంపు వుంటుంది. పన్నెండు గంటలకెళ్ళి చూస్తే అప్పుడే ప్రొద్దుక్రింకి నట్లుంటుంది. అంచేత వెళ్ళండి. ఎవరూ కనుక్కోలేరు"

"మీరెక్కడో వెర్రివారు, అదెలా జరుగుతుంది?" అని వాసంతి పైటచెంగును వేళ్ళకి మెలిపెట్టుకోసాగింది.

"అయిందీ! ఒక్కమాటతో తేల్చిపారేశారూ? అవును, అసలు వెర్రివాణ్ణి ఎందుకయ్యాను? మీరు ఆయనకి తెలియకుండా చాటుగా వెళ్ళాలనుకుంటున్నారు. అలాంటి దానికి రాత్రి సమయమే ఉత్తమం. గబగబా కనుక నడిస్తే ఓ గంటలో వెళ్ళి తిరిగిరావచ్చు. అప్పటికింకా ఆయన తొలినిద్రనుంచే మేల్కొనలేరు" అంటూ గౌరాంగ్ నవ్వాడు.

సుధాముఖి ఈ నవ్వు చూసి కళ్ళుమూసుకుని, నీళ్ళలో మునగటం మొదలెట్టింది. అలా మునిగి మునిగి ఆ తడిగుడ్డలతో మళ్ళీ వారి మధ్య నుంచే వెళ్ళిపోవటానికి దగ్గరకొచ్చింది.

"సరే. మీరు ఆలోచించండి పోనీ" అని గౌరాంగ్ ఇవతలికి వచ్చి ఇటూ అటూ చూసి. సుధ వెనుకనే బయలుదేరాడు. దగ్గరకి వచ్చాక వెనుకనుంచి మెల్లిగా పాడాడు.

నీలవస్త్రధారిణి
నీలాటి రేవునుంచి కదలి
ఆర్ద్రవసన - హాస్యవదన........

నిజానికి నడకకి వీలుగాలేక — కట్టుకున్న తడిచీరె పాదాలదగ్గిర మెలివేసుకుని నీళ్ళు ఓడుతోంది. పతిదేవుని ఈ పరిహాసానికి ఆమె కుపితురాలై ముఖం యిటు త్రిప్పి "మళ్ళీనా? మళ్ళీ మీరు నన్ను వేధించటానికి వచ్చారా? సిగ్గులేని వారెక్కడో! పాట పాడాలని మనసయితే. మీ మనస్సులోవున్న వారి దగ్గరకే వెళ్ళి పాడుకోండి" అన్నది.

"మనస్సులోవున్న వారా?" గౌరాంగ్‌కి హఠాత్తుగా ఏదో నూతన జగత్తు వార్త వినిపించినట్లయింది భావావిష్ట ముఖంతో — "వారి జాడ ఎలా తెలుస్తుందో నీకు తెలుసా సుధాముఖీ?" అన్నాడు.

"ఇదంతా నటన"

అని ముఖం త్రిప్పుకుని వెళ్ళిపోయింది సుధాముఖి. గౌరాంగ్ పరధ్యానంగా మెల్లిగా స్టేషన్‌వైపుకి నడిచాడు.

మొదటినుంచీ పాట అలవాటయిన గొంతు.

పాట పాడుకోకుండా నడిచి వెళ్ళాలంటే అడుగు ముందుకి పడనే పడదతనికి. పాడుకుంటూ వెళ్ళాడు—

మనసులోమెదిలే ఆ
మనో హారిణి - ఎచటనుండునో
ఎరుగ చెప్పవా—

మనస్సు విముఖంగా వున్నదికదా అని ఇంట్లో పనులన్నీ వదిలేసి కూర్చునేరకం కాదు వాసంతి. అత్తగారి వద్దనుంచి వంట యేమేమి చేయాలో రోజూ ఆదేశాన్ని తీసుకున్నట్లే ఆనాడూ తీసుకుంది. ఆరోజు పనులన్నీ చేసేసింది.బియ్యం పప్పులూ బాగుచేసింది.కావలసిన నీళ్ళన్నీ నూతిలోనుంచి తోడింది. దూడలకి పచ్చగడ్డీ అదీ వేసింది. సంజెపడ గానే తులసికోట దగ్గిర దీపారాధన పెట్టింది. ఇన్ని పనులు చేసుకుం టూనే మధ్య మధ్య ఆలోచించుకుంటూ వచ్చింది.

పొయ్యి కెదురుగా కూర్చుని ఇప్పుడూ ఆలోచిస్తోంది. భగభగ మండుతున్న కట్టెల వెలుగులో తెల్లటి ఆమె గంభీరముఖం "ప్రతిమ ముఖం"లా కన్పిస్తోంది.

గౌరాంగ్ వచ్చి గుమ్మంమీద కూర్చున్నాడు.

"ఏం నిర్ణయించుకున్నారు ?" అని అడిగాడు.

"వెడతాను" తలయెత్తి దృఢప్రతిజ్ఞ చేస్తున్న భంగిమలో అన్నది వాసంతి.

"సరే అయితే. ఈ పనులన్నీ కొంచెం త్వరత్వరగా ముగించు కోండి. పోతే, చూడండి. ఇంకోపని చెయ్యండి. అన్నా - చెల్లెళ్ళ నిద్ద రినీ కొంచెం ఎక్కువగా భోంచేసేట్లు చెయ్యండి. అలాఅయితే భుక్తా యాసంమీద మంచి నిద్ర పట్టేస్తుంది త్వరగా. తెలుసుకోలేరు"

గాంభీర్యమంతా చెదిరిపోయింది. వాసంతి నవ్వి "నిజమే మహా శయా ! మీరనుకున్నట్లల్లా ప్రపంచం అంతా కనుక నడిచేట్లయితే ?" అన్నది.

గౌరాంగ్ ఏదో చెప్పబోయి మెల్లాలోని చీకటివైపు చూస్తూ, గొంతు తగ్గించి "దడితడిక చప్పుడయితే ఆయన వచ్చాడేమో అనిపించింది. వాళ్ళ పేకాట ఇంత పెందరాళే అయిపోయిందా ?" అన్నాడు.

వాసంతికూడా అలాగే గొంతు తగ్గించి "ఇవాళసలు పేకాటకి వెళ్ళలేదల్లె వుంది" అన్నది.

"ఆఁ. ఆయన వెళ్ళకుండా వుంటాడా! పోనీండి పెందలాడే వచ్చేసి వుంటాడు. మంచిదే అయింది" అని ఇంకా మరగొంతు తగ్గించి "భగవంతుడేది చేసినా మేలుకే చేస్తాడు. పెందరాళే భోజనం పెట్టేసి, నిద్రపోయేట్లు చేయండి, ఎక్కడా సకీ - సవ్వడి కాకుండా జాగ్రత్త పడండి" అన్నాడు.

వాసంతి పొడి ఆరిపోయిన గొంతుతో - "పోనీ వద్దులెండి. నాకేమిటో భయ భయంగా వుంది" అన్నది.

"భలే బెదద తెచ్చిపెట్టారే! భయమెందుకు ? ఇంత ఆలోచన, ఇంత ప్లాను - చివరికి భయంతో వెనక్కి తగ్గుతారా ? ఏం భయంలేదు. కళ్ళు - చెవులూ మూసుకుని ఒక్కసారి బయటపడ్డారంటే చాలు"

అటువైపున....వంటయింటికి అటువైపున నిలబడివున్న ఒకరి కళ్ళు విప్పార్చుకున్నాయి. చెవులు దోరగించుకున్నాయి.

ఆ ఒకరు — మరెవరూ కాదు, శశిధర్.

గౌరాంగ్ సాధ్యమైనంత చిన్న గొంతుతో — సలహాలు చెప్పుకుపోతూనే వున్నాడింకా. "పెరటివాకిలి తెరచి - పొదులు — చెట్లగుబుర్లు వున్నదారినే....తెల్లచీరె కట్టుకోకండి. చీకట్లో తెలిసిపోతుంది. రంగు చీరలే లేవూ మీకు ? లేకపోతేయేం ? మీ ఆడబిడ్డకి బోలెడన్ని వున్నాయి - ఎర్రచీరెలు, పచ్చచీరెలు, నీలపుచీరెలు....వాటిల్లో ఒకటి తీసి కట్టుకోండి, చాలా జాగ్రత్తగా....చప్పుడన్నమాట కాకూడదు."

వాసంతికి సరిగ్గా చెవికెక్కడంలా అతడు చెప్పేవన్నీ.

వెళ్ళటానికి ఆమె తెగించుకునే వుంది. కాని మొదటినుంచి అలవాటయిపోయిన భయం పట్టుకుని పీడిస్తోంది మనస్సుని.

అవతల అతడికి ఆ దృష్టేలేదు. ప్రపంచజ్ఞాన రహితుడైన అతడికి తాను యిలా గుసగుస లాడుతూ మాట్లాడడం ఎవరూ తెలుసు కోరనే భావం. ఎంచేతంటే — ఇప్పుడే నిభానని బాదల్‌ని దగ్గిరపెట్టు కుని పడుకోవటం. లాంతరుమీద నూనె వెచ్చపెట్టి సుధాముఖి తల్లి కాళ్ళకి నూనెరాస్తూ. అవులిస్తూ కూర్చుని వుండటం చూసి వచ్చాడు.

శశిధర్ ఓవేళ వచ్చినా, వంటింటివైపు ఎందుకొస్తాడు?

శశిధర్ వంటింటివైపుకి రావటంతో ఊరుకోలేదు కర్రిలు. పిడ కలు పెట్టుకునే అటకమీదినుంచి తళ తళ లాడుతున్న ఓ పెద్ద వస్తువుని తీసుకుని వచ్చాడన్న సంగతి - వారి ఊహకే అందని విషయం.

* * *

వాసంతి వంటంతా ఎలా చేసిందో. అందరికీ భోజనాలెలా పెట్టిందో తెలియదు. వెళ్ళాలనే ఆసక్తి ఇంక యిప్పుడు మనస్సులో లవ లేశమైనా కన్పించటంలేదు. పైగా ఏదో భయం ఒకటి ఆవరించుకుని మనస్సు బరువెక్కినట్లుంది.

ఇప్పుడిహ వెళ్ళటం ఎలా ? అలా అని గౌరాంగ్ దగ్గిర మాట యిచ్చి వెనక్కి జారటం మాత్రం ఎలాగా అనే సమస్య.

తాను కొంచెం దూరం ముందుకి వెళ్ళి అక్కడ కనిపెట్టుకుని వుంటానని గౌరాంగ్ ముందుగానే చెప్పాడు. వాసంతి తలుపులుచప్పుడు కాకుండా తీసికొని బయలుదేరి వెడుతుంది.

ఆ. రంగుచీరె ఒకటి తీసుకుని ధరించింది వాసంతి.బుద్ధి పూర్వ కంగానే ధరించింది.కాస మేలిముసుగుకూడా వేసుకోవాలను కుంటోంది. అలా అయితే తనని సుధ అని భ్రాంతి పడతారు. రాత్రి భర్త వెంట సుధ దేవదర్శనానికి బయలుదేరి వెడుతోంది అని అనుకుంటారందరూ. ఎంత అదృష్టం అది !

* * *

చీకటి గాఢాంధకారం. ఎదుటవున్న మనిషే కన్పించనంతటి కారు చీకటి.

కృష్ణపక్షపు రాత్రి - అమావాస్య రాత్రోయేమో తెలియదు. పైగా ఈ ప్రాంతమంతా చెట్లూ అవీ చిట్టడవిలా గుంటుంది.

సామాన్యమైన టకటకమన్న ధ్వని. తర్వాత గుసగుసల్లా ఏవో విన్పించసాగాయి. 'వచ్చారా ? ఎవరూ చూడలేదుకదా ! ఎదురుదెబ్బ తగిలేను చూసుకుని నడవండి' టప్‌మని ఓ అగ్గిపుల్ల వెలిగింది. దాని వెలుతురులో అజ్ఞాతులైన ఇద్దరు అపరాధుల ముఖాలు ఒక్క క్షణం తళుక్కుమన్నాయి. ఒకరి ముఖంలో భయం వ్యక్తమవుతోంది. మరొకరి పరిహాసోల్లాసం తొణికిసలాడుతోంది.

మరొక వస్తువుకూడా కొంచెం దూరంలో తళుక్కుమన్నది ఒక్క క్షణం. అది వాసంతి కట్టెలు నరుకునే మోటుకత్తి.

• • • •

వెలిగించిన అగ్గిపుల్లని గౌరాంగ్ దూరంగా విసిరేసి, నవ్వు అణచుకుంటూ 'వాహ్ !' చాలా బావుంది.

శ్యామసుందరుని చెంతకు జనియెను రాధిక—
మసకచీకటిలో మందగమన అభిసారిక....

క్షణంలో ఒక క్రూరభయంకరమైన గర్జనతో పాడుతూ పాడుతున్న గొంతు కాస్తా బిగుసుకుపోయింది. అదేదో క్రూరమృగ గర్జనలా వుంది.

పాట పాడుతున్న గొంతునుంచి ఓ ఆర్తనాదం వెలువడింది. ఆనందోచ్ఛ్వసితమైన ఆ కంఠాన్ని ఎవరో నిర్దాక్షిణ్యంగా నులిమి వెయ్యాలని చూస్తున్నట్లున్నారు.

చీకట్లో యేమీ కనిపించటంలేదు. అస్ఫుటంగా కొన్ని మాటలు మాత్రం విన్పిస్తున్నాయి. ఆ మాటలు వాసంతి కంఠస్వరం నుంచి - "కొంపకి ముప్పు తీసుకురాకండి గౌరాంగ్‌దా !"

"గౌరాంగ్‌దా !" పళ్ళు బిగించి మాట్లాడిన కంఠస్వరం.

ఇటూ అటూ త్రోసుకుంటున్న ధ్వని, కిందపడిన ధ్వని, వన్య జంతువు ఆర్తనాదంలాంటి ఒక ఆర్తనాదం.

మళ్ళీ వాసంతి కేకలు "గౌరాంగ్‌దా! నమస్కారాలు మీకు. పారిపోండి. పారిపోండి యిక్కడినుంచి. కన్పించటంలా - వారు పొడిచేసేట్లున్నారు"

"కాని వాసంతీ! శశిధర్‌దా" మిమ్మల్ని....

"నాసంగతి ఏమయితే అదవుతుంది మీరు పారిపోండి. ఈస్థితిలో ఎవరైనా చూస్తే ఏం జరుగుతుందో గ్రహించలేకుండా వున్నారు. ఆ అపనింద మృత్యువుకంటె ఎక్కువది. నమస్కారాలు మీకు. వెళ్ళండి. వెళ్ళండి. వెళ్ళండి చెపుతున్నా"

ఒక దుర్నివార్యమైన శక్తిని అతికష్టంమీద అణచిపెట్టుకున్నట్లు పెద్ద పెద్ద నిట్టూర్పులు ఆమె మాటలతో కలిసి విన్పిస్తున్నాయి.

ఎండుటాకుల మీదనుంచి ఎవరోవ్యక్తి పరుగెత్తుకుపోయిన ధ్వని తర్వాత ఒక్కక్షణం స్తబ్ధత....

అది మృత్యువులాగా తుహినశీతలమైన స్తబ్ధత.

ఆ శీతల స్తబ్ధతని చీల్చుకుంటూ ఒక దృఢశాంత కంఠస్వరం ధ్వనించింది. 'కానీండి. ఇప్పుడిహ నన్ను చంపండి. నరకండి. మీ యిష్టం యేమైనా చేసుకోండి'

దాంతోపాటు ఓ బరువైన వస్తువు క్రిందపడ్డ ధ్వని....

తన యావచ్ఛక్తితో ఆ దేహాన్ని వాటేసుకుని గట్టిగా పట్టుకుని వాసంతి గౌరాంగ్‌కి పారిపోయే అవకాశాన్ని కల్గించింది. అతడి ముందు ఆత్మసమర్పణ కావించుకోటానికి చేతులు వదిలెయ్యగానే పట్టుతప్పి ఆ శరీరం కిందపడిపోయింది.

దారుణమైన ఉత్తేజనతో తెలివి తప్పిపోయిన మనిషి తన చేతి లోంచి జారిపోయిన కత్తి మీదనే పడ్డాడు.

తర్వాత?

తర్వాత భయార్తురాలైన వాసంతి కెవ్వున కేకపెట్టటం మొదలెట్టింది. గొంతు అణచుకుని మాట్లాడటం, గుసగుసలు, వాటి అవసరం తీరిపోయింది. ఆ అవసరమేమిటో గుర్తుకూడా లేదు.

• • • •

"మాష్టర్‌దా ! మాష్టర్‌దా !"

నిద్రపోతున్న స్టేషన్‌మాష్టర్ ఉలిక్కిపడి, కప్పుకున్న దుప్పటి తీసేసి లేచి కూర్చున్నాడు. ఎవరైనా పిలిచారా ? కలయేమైనానా !

ఉహూం. కలకాదు. కచ్చితంగా మనిషిపిలుస్తున్న కంఠస్వరమే. చిన్న కిటికీమీద ముఖం ఆనించి గౌరాంగ్ కంగారుగా పిలుస్తున్నాడు. "మాష్టర్‌దా ! తలుపుతెరవండి మాష్టర్‌దా !"

పైన కప్పుకున్న దుప్పటిని అలాగే బిగించి పట్టుకుని, తలుపు తెరచి బయటికి తొంగి చూశాడు స్టేషన్‌మాష్టరు. చూసి తెల్లబోతూ "ఏమిటి సంగతి గౌరాంగ్ ! ఇంత రాత్రివేళ....?" అని అడిగాడు.

"ఉండండి. ముందు మార్కొనీయండి" అంటూ గౌరాంగ్ లోపలికి వచ్చి "నీళ్ళున్నాయా యింట్లో ? మంచినీళ్ళు ?" అని అడిగాడు.

"అదేమిటి ? లేకపోవటమేమిటి ?" అంటూ కూజాలోనీళ్ళు గ్లాసెడు తీసుకొచ్చి యిచ్చాడు మాష్టర్, ఇచ్చి "కాని ఏం జరిగిందో చెప్పు. భూతమేమైనా తరుముకొచ్చిందా యేం ?" అని అడిగాడు.

గౌరాంగ్ ఒక్కగుక్కలో గ్లాసెడునీళ్ళు త్రాగేసి "ఇంచుమించు అంతే. అదో పెద్ద విపత్తుగా పరిణమించింది మాష్టర్‌దా !" అన్నాడు.

మొదటినుంచి చివరిదాకా జరిగినదంతా గడగడా చెప్పేశాడు గౌరాంగ్. తర్వాత "ఆమె అదృష్టం ఎలా రాసిపెట్టివుందో తెలియదు. శశిధర్‌దా అంతా తెలిసీ తెలియని రకం" అన్నాడు.

మాష్టారు గంభీరంగా "ఉహూం. నువ్వు చేసినపని మంచిదికాదు గౌరా! అతడంత కోపిష్ఠి అయినప్పుడు అతడి భార్యనలా...."అన్నాడు.

"ఆఁ ! ఆమె దుస్థితికూడా ఆలోచించండి. ఇంతమంది వెడుతున్నారు. పాపం, ఆమె కొక్కదానికి మాత్రం వెళ్ళటానికి వీల్లేకపోయింది. అదికాక శశిధర్‌దా జబ్బు నయమయ్యే మందుకూడా దొరుకుతుందని —"

సరిగ్గా ఆ సమయంలో మళ్ళీ బయట తలుపుకొట్టిన చప్పుడయింది.

"మాష్టరుగారూ ! మాష్టరుగారూ !"

మాష్టరు చెవులు దోరగించుకుని విని "ఎవరు?" అని అడిగాడు.

"నేను జగదీశ్‌ని. గౌరాంగ్‌దా వున్నారా యిక్కడ ?"

ఉత్తేజనతో కంపిస్తున్న కంఠస్వరం :

"ఆఁ. ఉన్నాను" అని వెంటనే అనబోయాడు గౌరాంగ్. కాని ఆ కుర్రాడు ఇలా ఎగశ్వాసతో పరుగెత్తుకు రావటం చూసి, ఏమను కున్నాడో ఏమో - మాష్టరుగారు చటుక్కున గౌరాంగ్ నోటికి చెయ్యి అడ్డంపెట్టి మాట్లాడక ఊరుకోమని సైగచేసి,గుమ్మందాకా వెళ్ళి గుమ్మా నికి చేతులు అడ్డంగాపెట్టి నుంచుని, ఆత్రంగా"ఏమిటి సంగతి జగదీశ్?" అని అడిగాడు.

జగదీశ్ ఆ సమాజంలో వుండే కుర్రాడే. గౌరాంగ్ అంటే పడి చచ్చేవాడు కూడా. అతడు విచలిత కంఠంతో "కొంప మునిగింది మాష్టరుగారూ! శశిధర్ ఘోషాల్ ఖూనీ అయినారు.గౌరాంగ్‌దా కన్పించ టం లేదెక్కడా ! ఎక్కడున్నాడో వెళ్ళి చూస్తాను. పోలీసులు కనుక వచ్చారంటే ముందే వెతకటం మొదలెడతారు"

కుర్రాడు తుపానులా ఎలా రివ్వున వచ్చాడో అలాగే రివ్వున వెళ్ళిపోయాడు – సమాధానం కోసమయినా ఎదురుచూడకుండా.

ఇంతలో గౌరాంగ్‌కూడా రివ్వున తుపానులా పరుగెత్తి వెళ్ళ బోయాడు. "ఖూనీ అయినాడా ? శశిధర్‌దా ఖూనీ అయినాడా ? మాష్టర్‌దా ! అతడు కచ్చితంగా నా చేతిలోనే ఖూనీ అయాడు. నేను చీకట్లో నన్ను విడిపించుకోబోయి త్రోసేశాను. ఆ తోపుకి కిందపడి పోయి వుంటాడు, తప్పకుండా తల పగిలిపోయి వుంటుంది. విడిచి పెట్టండి, నన్ను విడిచిపెట్టండి. మీకాళ్ళు పట్టుకుంటాను" అన్నాడు.

వ్యవహారం ప్రమాదకరమైనదిగా భావించి, మాష్టరు గౌరాంగ్‌ని రెండుచేతులతో వాటేసుకుని గట్టిగా పట్టుకుని ఆపాడని చెప్పనవసరం లేదు. అణచుకున్న కంఠంతో అతడు "కేకలుపెట్టకుగౌరా! ప్రమాదాన్ని పిలిచి తెచ్చుకోకు. నువ్వు ఇప్పుడే అక్కడికి వెడితే ఎంత కళంకం చుట్టుకుంటుంది ?" అన్నాడు.

"ఏమీ చుట్టుకోదు. అసంభవం. విడిచిపెట్టండి నన్ను"

"కాదు గౌరాంగ్ ! ఏమిటి ఉపాయం ? పరిస్థితి చూడు. ఒకరు ఎలాగూ పోయారు. నువ్వెళ్ళి నిజం చెప్పటానికి సిద్ధమయినావంటే - కళంకజ్వాలవల్ల వాసంతి కంఠాని కురిపోసుకోవలసి వస్తుంది. అదీకాక నీభార్య బాదల్‌తల్లి ? ఆమె సంగతి ఆలోచించవేం ? ఖూనీకి కారణ భూతురాల్ని చెయ్యదలుస్తున్నావా ఆమెని ?"

"కళంకం. వాసంతికి, సుధకి వైధవ్యం" గౌరాంగ్ చటుక్కున స్తబ్ధుడయిపోయాడు. తర్వాత ఉద్భ్రాంతునిలాగా "అయితే ఏంచెయ్యను మాష్టర్‌దా ?" అని అడిగాడు.

"ఏం చేస్తావ్ ? ఏం చేస్తావ్ ? పారిపో, చాలాదూరం పారిపో. చాలాదూ - రం ! బాసుల్‌పూర్ గడ్డమీద మళ్ళీ కాలుపెట్టకు. వెళ్ళు, ఇప్పుడేవెళ్ళు. నదయా జిల్లాని శాశ్వతంగా విడిచివెళ్ళు. నువ్వు బ్రతికి పోతావ్, అందర్నీ బ్రతికించిన వాడివవుతావ్. నా సంగతి యేమయితే అదవుతుంది, నాసంగతేమయితే అదవుతుంది"

చివరిమాటలు దుఃఖోద్రేకంవల్ల అస్పష్టంగా విన్పించాయి. గౌరాంగ్‌ని ఇంచుమించు తోసుకుంటూ ప్లాట్‌ఫాంమీదికి తీసుకువెళ్ళాడు స్టేషన్ మాష్టర్.

• • • •

అరనిమిషం ఆగుతుంది బండి.

ఎంతోమంది జనాన్ని, ఎంతో బరువుని వేసుకుని, దూరంనుంచి ఎక్కడినుంచో వస్తోంది—ఒకసారి ఆ గుంపులో అతణ్ణి కూడా చేర్చి వేసుకోటానికి. తర్వాత - 'వెనుక భయంకరమైన గాథ వుండి వెళ్ళిపోయాడతడు' - అని ఎవరు తెలుసుకోగలరు?

స్టేషన్ మాష్టర్ అతణ్ణి రైల్లోకి త్రోసి ఎక్కించి, అలవాటు ప్రకారం తన స్థానంలోకి వెళ్ళి నుంచున్నాడు - ఏదో యేమీ జరగనట్లు - ఇంతకుముందు ఈ కుగ్రామంలో ఎలాంటి భయంకరమైన సంఘటనా జరగనట్లు ...అసలు తానా సంఘటనకి నాయకుడైన వాణ్ణే ఏమీ ఎరగనట్లు నుంచున్నాడు.

అతణ్ణి ఇలా బలవంతంగా తరిమి పంపించకపోతే—వెళ్ళడు అన్నసంగతి మాష్టర్‌కి తెలుసు వాసంతికి కళంకం వస్తుంది అని భయ పెట్టే, అతణ్ని లొంగతీశాడు. లేకపోతే — ఉరిశిక్ష పడుతుందన్న భయమైనా అతణ్ని విచలితుణ్ణి చేయగలిగేదే కాదు.

ఇంతకుతప్ప ఇంక ఏం చెయ్యగలడు స్టేషన్ మాష్టరు ?

ప్లాట్‌ఫాందాటి వెళ్ళిపోతున్న రైలుకేసి చూస్తూ నుంచున్నాడు స్టేషన్ మాష్టర్. కర్తవ్యంలో పొరబాటేమీ జరగలేదు.

ట్రైన్ 'పాస్' అయిపోయేందుకు —యథాప్రకారం ఆర్డరిచ్చాడు. అయితే అది వెళ్ళిపోతున్నప్పుడు మాత్రం చాలాసేపు యించు మించు చీకగా ఉన్న యెగుడు దిగుడు ప్లాట్‌ఫాంమీద అలాగే చాలాసేపు నిల బడి పోయాడు.

తర్వాత మెల్లి మెల్లిగా తన ఆఫీసు గదికి తిరిగివచ్చాడు. అప్పు డతణ్ని చూస్తే—ఓ రాతిబొమ్మ మెల్లిగా అడుగులేస్తూ కదలి వెడు తోందా అనిపిస్తుంది.

డ్రాయరు తాళంవేసి ఉందా? లేదు, తాళం వేసిలేదు. తెరిచేవుంది. తెరిచే ఉంది.

• • • •

భగ భగ లేచిన మంటలుచూసి, 'పాయింట్స్ మెన్' ఎక్కడి నుంచో పరుగెత్తుకొచ్చాడు. "ఏం జరిగింది ?" అని అడిగాడు.

మెల్లిగా ఒకచేత్తో అతడ్ని వెళ్ళిపొమ్మని సైగచేశాడు స్టేషన్ మాష్టర్, ఈస్థితిలో ఎవరైనా రావటంమూ సహ్యంగా వుండదు. మాట్లాడటమూ సహ్యంగా వుండదు.

తన బిడ్డచితికేసి చూస్తూ వుండిపోయినట్లు - అర్థహీనమైన శూన్యదృష్టితో ఆ మంటలకేసి చూస్తూ వుండిపోయాడు స్టేషన్‌మాష్టర్. ఎన్నో కాయితాలు ఒక్కసారిగా తగలడి పోతున్నాయి.

తన సంతానంకంటె వీటి విలువ మాత్రం ఏమయినా తక్కువా ?

వీటికి తానే సృష్టికర్త. ఎంతో శ్రమించి, ఎంతో శ్రద్ధగా ఎన్నో ఆశలు పెట్టుకుని సృష్టించినవివి.

• • •

అనాహతమైన కాలవాహిని అవిచ్ఛిన్నంగా తనధోరణిని తాను ప్రవహిస్తూ పోతూనే వుంది.

సృష్ట్యాదినుంచీ నిర్నిరోధ - నిర్విరామ గమనం కాలానిది. తన గమనంలో ఎక్కడా రెండుక్షణాలు ఆగటానికిలేదు. డస్సిపోయి తనగమనాన్ని విరమించుకోటానికీ లేదు. రూపంలేదు, రంగులేదు. శీఘ్రతలేదు, మాంద్యంలేదు. రాత్రింబవళ్ళను సరిసమానంగా ఏర్పరచుకుంటూ ముందుకు పోతూ వుండటమే.

అయినా మానవులు దానికి రంగునీ, రూపాన్నీ ఆపాదించారు. అయితే అవిచ్ఛిన్నమైన కాలవాహినిని విచ్ఛిన్నం మాత్రం చేయలేకపోయారు. కాని కాల్పనికమైన ఖండాలుగా, విభాగాలు మాత్రమే చేయగలిగారు. రోజులు, వారాలు, మాసాలు, సంవత్సరాలుగా లెక్కలుకట్టి గుర్తు లేర్పరిచారు. కాని ఆ లెక్కకి నిజంగా విలువేమయినా వుందా ?

రోజు అంటే ఇరవైనాలుగు గంటల పరిమితి కలదేనా ?

కాలభారం అందరికీ సమానంగానే వుంటుందా ? సుఖవంతులు, అలవోకగా జీవితాన్ని వెళ్ళపుచ్చేవారు. అలాంటివారికి కాలంయొక్క అనుభూతి అనేది వుందా ? వారికల్లా గ్రీష్మం వెళ్ళిపోయాక వర్షరుతువు వస్తుందని. దాని తర్వాత శరదృతువు ప్రారంభమవుతూ వుంటుందని మాత్రమే తెలుసు. వారికి పగలు తర్వాత రాత్రి వస్తుందని, రాత్రి గడిచిపోయాక పగలు వస్తుందనే తెలుసు.

కాని, అస్వాభావిక జీవులకి కేవలం రాత్రిమాత్రమే వచ్చి ఆగిపోతూంటుంది. పగలనేది జీవితంలో రానేరాదు. జీవితపు కనాలనన్నీ బంధింపచేసి, కేవలం అనంతమైన అంధకారమే వారిమీద ఏకచ్ఛత్రాధిపత్యాన్ని కొనసాగిస్తూంటుంది. కాలం అంటే అర్థమేమిటో, ఎలా అంచనా వేయాలో అలాంటివారికే బాగా తెలుసు.

• • •

ఎంతకాలం పారిపోతూ తిరిగాడు గౌరాంగ్? మానవులు తయారు చేసుకున్న క్యాలెండర్ల లెక్కప్రకారం ఆరునెలలు కావచ్చు. కాని ఆ లెక్కే సరియైనదికాదు. ఆరు యుగాలు పారిపోతూ తిరిగాడు తరుమబడుతున్న జంతువులాగా. ఇక్కడినుంచి అక్కడికి, అక్కడినుంచి ఇంకా ఎక్కడి కెక్కడికో!

పారిపోతూ తిరగడంలోకూడా ఒక ఉద్వేగం వుంది. పట్టుకునేవారు ఎవరూ లేనిచోటు, గుర్తుపట్టేవారు ఎవరూ లేనిచోటు ఈ సహజమైన అమాయక ముఖంవెనుక రక్తాక్తమైన ఇతిహాసం ఒకటుందని కలలోనైనా ఊహించని వారుండేచోటు అలాంటిచోట్లనుంచి కూడా అభాగ్యజీవి అతుదొరక్కుండా పారిపోతూనే వుంటాడు.

వరుసగా అయిదారు రోజులు ఒకేచోట ఉండడు. ఎక్కడైనా ఎవరైనా తనమెడ రవంత ఆదరానురాగాల్ని వ్యక్తీకరించినా, అవాజ్యమైన అపేక్షని చూపించినా అతడికి అకారణంగానే అనుమానం ఎక్కువవటం మొదలెడుతుంది.

ఎందుకు వీరికింత అకారణమైన మమకారం? కచ్చితంగా పట్టించి యిచ్చేందుకు పన్నాగమై వుంటుంది. కనుక అక్కడినుంచికూడా పారిపోదామనిపిస్తుంది. దారిలో ఎవరైనా ఇద్దరు ముఖాముఖి మాట్లాడుకోవటం కన్పిస్తే తన సంగతే మాట్లాడుకుంటున్నారనిపిస్తుంది. తన వెనుక ఎవరైనా నడిచిరావటం కన్పిస్తే, వాళ్ళు తనని వెతకటానికి వస్తున్నారనే అనిపిస్తుంది. మనస్సులో అనుమానం పెట్టుకుని తిరిగే వారికి ప్రపంచం సరళంగానూ, సహజంగానూ ఎలా కనిపిస్తుంది?

అయితే గౌరాంగ్ నిజంగా ప్రాణభయంతోనే ఇలా వచ్చినచోట ఆగకుండా వెర్రివాడిలా తిరుగుతున్నాడా? గౌరాంగ్ స్వభావానికి అది అనుగుణమవుతుందా?

ఉహూఁ. గౌరాంగ్‌కి ప్రాణాలమీద అంత మమకారం ఎన్నడూ లేదు. స్వాభావికమైన సుందర జీవితాన్ని గడుపుతున్నప్పుడూ వుండేది కాదు. అసంగతమైన దుస్సాహసానికి పెట్టింది పేరు అతడు. ఎవరయినా

తన దుస్సాహసాన్ని ఖండించాలని ప్రయత్నిస్తే అతడు నవ్వుతూ "అరె బాబూ! ఎప్పుడైనా ఒక్కసారేకాని రెండుసార్లు చచ్చిపోముకదా? జీవితంలో ప్రతి అడుగూ అంత ఆచి, తూచి వెయ్యటం మనవల్లకాదు" అనేవాడు.

అలాంటివాడు వెంటాడుబడుతున్న మృగంలా ఇప్పుడిలా యెందుకు పారిపోతూ తిరుగుతున్నాడు?

అదే అద్భుతమైన రహస్యం.

అవును నిజమే. జడప్రకృతి ఒక అలంఘ్య నియమానుగుణంగా చరిస్తుంది. భ్రాంతిరహితమైన, భావరహితమైన గమనం దానిది. మనుష్య ప్రకృతి విధినియమ నిబంధనలనన్నిటినీ ఉల్లంఘించాలని కోరుకుంటూ వుంటుంది.

కాని నిజంగా అలా చెయ్యగలదా? బహుశా చెయ్యలేదేమో! స్వతంత్రమైన దాని ఆలోచనాశక్తి కీలకస్థానంలో ఎక్కడో అర్థంలేని జడత్వం, అనుగతకమైన మూఢత్వం వుంటుంది. అందుచేత ఒకసారి మొదలుపెట్టిన దానినుంచి తననింక మరల్చుకోలేకపోతుంది. గ్రహ నక్షత్రాల చుట్టూ వుండే జ్వాలాచక్రంలాంటి దుర్భేద్యమైన చక్రాన్ని తన చుట్టూ నిర్మించుకుంటుంది. ఆ అభాగ్యుడికికూడా అలాంటిస్థితే సంభవించింది.

ఒకసారి ఎవరో 'పారిపో, పారిపో యిక్కడినుంచి దూరంగా పారిపోకపోతే నీకు రక్షణలేదు' అని అతడి చైతన్య కవాటాన్ని సంచరింపచేస్తూ హెచ్చరించాడు. అది వినగానే ఈసారి పోవాలనే 'కుతి'పట్టుకుంది. దానినుంచి ఇంక బయట పడటమనేది లేదు.

ఆ మైకపు విషంలో మిగిలిన చైతన్యమంతా మొద్దువారిపోయి, తనలోతాను లీనమైపోయింది. దానిముందు ఇంక బాహ్యజగత్తు యావత్తూ విలుప్తమైపోయినట్లయింది. 'పారిపో, ఇక్కడినుంచి దూరంగా పారిపో' అన్న అవిరామధ్వని ఒక్కటే ప్రతిధ్వనిస్తోంది మనస్సులో.

ఆ దూరానికి అవధి యెక్కడో అతడికి తెలియదు. అందుచేత

నేనేమో ఒకొక్కప్పుడు పదిహేను రోజులు ఒకే ప్రదేశాన్ని లక్ష్యంగా పెట్టుకుని పారిపోయేవాడు. ఎక్కడైనా రవ్వంత ఆశ్రయం లభించినా, ఎక్కడైనా రవ్వంత స్నేహస్పర్శ సోకినా విగళితుడవుతూ వుండేవాడు. మళ్ళీ ఎక్కడైనా అవమానం, అనుమానం, తిరస్కారం ఎదురయితే అక్కడినుంచి తల వంచుకుని మెదలకుండా వెళ్ళిపోయేవాడు.

ఇతడా వ్యక్తేనా?

కొద్దిరోజుల క్రితంవరకూ కూడా - తన సంగీతంతో నభోంత రాళాలు ఒంపినవాడు - తన హాసకాంతులతో ఎన్నో ప్రదేశాల్ని ఉజ్వలింప చేసినవాడు. కేవలం పసివానిలా అమాయకుడైనవాడు — ప్రపంచంలో ఈర్ష్యా ద్వేషాలు, అసహ్యము మానటం ఉంటాయని తెలియనివాడు—అతనేనా ఇతడు! అతణ్ణి ఈ ఆకారంలో చూసి పోల్చుకోగలగటం సాధ్యమేనా ?

ధూళి ధూసరమైన శరీరం, దుబ్బు రేగిన జుట్టు — నల్లటి కప్పు వేసిన రాగిరంగు - ఓ పూట తినీ, ఓపూట తినక పసులతో అస్థిశల్యావశిష్టుడైనాడు.....కొన్నాళ్ళు ఓ టీ దుకాణంలో పనిచేశాడు. వాళ్ళు ఓ జత దుస్తులు యిచ్చారు. అవికూడా ఎప్పుడూ వుతుక్కోక పోవటం వల్ల - బాగా మాసిపోయి వున్నాయి.

ఆపని దొరకడం విచిత్రం. అప్పటికి ముఖంలో ఇంత మొరటుతనం రాలేదు.

ఓ టీ దుకాణం ప్రక్కన కూర్చుని వున్నాట్ట - "ఇక్కడ పని చేస్తావా?" అని అడిగాడు యజమాని.

గౌరాంగ్ ఉదాసీనంగా తల ఊగించాడు "ఉహూ!" అంటూ.

"ఉహూ! ఏమిటి ? చెయ్యరాదూ ?"

"చెయ్యాలని లేదు."

"ఆఁ ఎందుకుంటుంది ? కష్టపడి పనిచేసుకుని తిందామనే ఉద్దేశం ఎంతమంది దేశతమ్మరుల కుంటుంది లోకంలో ? ముఖంచూస్తే

వారంరోజులనుంచీ తిండీ తిప్పలు లేనట్టుంది. పని ఎందుకు చెయ్యావు ? ఎందుకు చెయ్యరాదూ? తిండి దొరుకుతుంది?"

కపటియైన ఆవ్యక్తి — కేవలం తిండిపెట్టి, చచ్చేంత చాకిరీ చేయించుకుందామని యెత్తువేశాడు. అంచేత వుదారత్వాన్ని నటిస్తూ "రా ఇవాళ పనేమీ చెయ్యక్కర్లేదు. ఊరికేనే తిందువుగాని. రేపటినుంచి పనిలో చేరాలి తెలిసిందా ? ఇవాల్టికి స్నానంచేసి, గుడ్డలవీ వుతుక్కుని శుభ్రంగా వుండు.ఏదో తల్లిపోయిన వాడిలాగా గడ్డంపెంచాడు చూడండి. ఇదిగో నాలుగు పైసలుతీసుకో. వీధి మలుపులో మంగలి వున్నాడు. వెళ్ళి గడ్డం చేయించుకురా, అరె బాబా! ఏ జాతివాడో అనుకున్నాను. కాని మెళ్ళో జంధ్యంకూడా వుందే! మంచిది, మంచిది" అన్నాడు.

* * *

అతడు గౌరాంగ్‌ని నాపితుని దగ్గిరికి పంపి, ఎన్నో గాలిమేడలు కట్టుకోసాగాడు. "నౌకరుపని ఎలాగూ చేస్తాడితడు. అదీకాక రోజూ గణపతి పూజ చేయటానికి నెలకి మూడు రూపాయలిచ్చి పెట్టుకున్న పూజారిని తీసేసి, ఆపనికూడా ఇతడికే అప్పగించి ఆ ఖర్చు తగ్గించుకోవచ్చు.

అదీకాక శుక్రవారం శుక్రవారం ఇంట్లో లక్ష్మిపూజ చెయ్యటానికి ఇల్లాలు ఓ పురోహితుణ్ణి నియమించింది — పూజకి రూపాయి యిచ్చేట్లు. ఆ పూజకూడా ఇతడిచేతే చేయించి ఆ డబ్బుకూడా మిగల్చుకోవచ్చు.

అంతేకాక ప్రతియేడూ తండ్రి తద్దినానికి ఓ బ్రాహ్మడికెట్లాగూ భోజనం పెట్టాల్సివస్తోంది. చాలా కాలంనుంచి అనుసరిస్తున్న ఆచారాన్ని చటుక్కున మానెయ్యటానికి వీల్లేదు. ఇతణ్ణి కనుక ఇంట్లో పెట్టుకుంటే చాలు. ఇహ ఆ ఖర్చులన్నీ తప్పించుకోవచ్చు. భోజనం యితడికేపెట్టి, భోజనానంతరం నాలుగుపైసలు దక్షిణకింద చేతిలోపెడితే సరిపోతుంది. తింటాడు - ఎంతతిన్నా ఇద్దరి భోజనం చేయలేడుకదా !

ఇన్ని ఆశలు పెట్టుకుని మొదట కొన్నాళ్ళు గౌరాంగ్‌ని చాలా

ఆదరంగానే చూశాడా వ్యక్తి. కాని ఆశాభంగం జరగటానికి ఎన్నాళ్ళో పట్టలేదు. గౌరాంగ్ అసమర్థత అడుగడుగునా వెల్లడవుతూ వచ్చింది. అక్కడినుంచి ఉద్వాసన. ప్రత్యేకమయిన అవమానం ఎందుకు జరగలేదో తెలియదు. బహుశా అతడి "జాతి" మూలంగానేమో!

ఆ తర్వాత ఓ పెద్దమనిషి యింట్లో దొరికింది ఆశ్రయం. ప్రపంచంలో నిర్హేతుకమైనస్నేహమనేదేలేదసలు. అలా ఉండటానికి ఆస్కారంలేదు. అయితే ప్రపంచం ఏ ఆధారంతో నిలబడి వుంది?

కాని అక్కడా భయమే ఏర్పడింది.

ఓనాడు ఆయింటి యజమాని శ్రేయోభిలాషి ఒకరు వచ్చి, బిగ్గరగా "ఇంట్లో ఇలా ఎవడికో ఆశ్రయం అయితే ఇచ్చావ్ బాగానేవుంది కాని, అతడెవరో అతడి అనుపాను లేమిటో తెలుసుకున్నావా? ఆ ముఖం అదీ చూస్తే పరారీలోవున్న నేరస్థుడిలా వున్నాడు" అంటూ హెచ్చరించటం మొదలెట్టాడు.

"లేదు, లేదు. అతడు చాలా అమాయకుడు. అతడి మాటా అదీ వింటేనేచాలు తెలుస్తుంది. మాట్లాడిచూడు" అన్నాడు యజమాని.

అతడు మాట్లాడి చూడటం జరగలేదు. మాట్లాడదామని వచ్చి చూసేసరికి పక్షి ఎగిరిపోయింది. పంజరం ఖాళీ. తర్వాత ఆదుర్దాగా నవ్వి "ఇంట్లో వస్తువులవీ యేమీ పోలేదుకదా! చూడండి" అన్నాడు.

* * *

హఠాత్తుగా ఓనాడతడు వర్ధమాన్‌లోని ఓ హోటల్‌దగ్గిర కన్పించాడు. హోటల్ వెనుక గుమ్మందగ్గిర ఎవరికోసమో యెదురుచూస్తూనుంచున్నాడు. కొంచెంసేపటికి తలుపు తీసుకుని హోటల్ వంట బ్రాహ్మడు బయటికి వచ్చాడు. అతడి చేతిలో అన్నంపళ్ళెం వుంది.

గౌరాంగ్‌ని పేర్రితాత్మ!

అయినా అతడు హఠాత్తుడై నాలుగుప్రైపులా చూశాడు. ఇరుకు సందు పెంటపోగుతో దాంతో అపర నరకంలావుంది. దగ్గిరలోనేవుంది రాచబాట.

"ఇక్కడ ఎక్కడ కూర్చుని తినను ? ఇక్కడ కూర్చుని తినటం యెలా ?"

వంట బ్రాహ్మడు గొంతు తగ్గించి "అయితే నేనేంచెయ్యను ? నెల చివరరోజు లిప్పుడు. ఈ సమయంలో యజమాని తనిఖీ హడావిడి ఎక్కువగా వుంటుంది తెలుసా ? ప్రొద్దున్నే వచ్చి కూర్చున్నాడు. రాత్రి దాకా కదలడు. నామీద ఆయనకి అనుమానం వుంది అసలు. ఓసారి కనుక కనిపెట్టాడంటే నీ తిండీ పోతుంది. నా నౌకరీ పోతుంది. ఊఁ ఊఁ కూర్చో ఎక్కడో అక్కడ" అన్నాడు.

"ఇక్కడ కూర్చోలేను"

"తీసుకోపళ్ళెం. నేను నీ అన్నం పళ్ళెం పట్టుకుని నుంచోనా ? దాసీలూవాళ్ళు రాక్షసిముండలు. చూశారంటే కొంప మునుగుతుంది. వెంటనేపోయి యజమాని చెవిలో ఊదేస్తారు.ఇవాల్టికి ఎలాగో అలా తినరాదూ ?" అన్నాడు బ్రాహ్మడు.

అతడలా అనేసరికి గౌరాంగ్ మరోసారి పరిసరాలకేసి చూశాడు. అహఁ. అసంభవం. కూరగాయల తొడిమెలు,పుచ్చులు, చేపపొలుసులు, బూడిదకుప్పలు ఎక్కడచూసినా. ఇక్కడ తినటమా ? తానేమైనా వీధిలోని కుక్కా ! "అన్నం తీసుకువెళ్ళు. ఇవాళింక ఇక్కడ తినటానికి వీలుపడదు"

అతడు కంగారుగా తొందరపడుతున్నాడు. అంచేత యింక బ్రతిమాలటం - ప్రాధేయపడటంలాంటిఏమీ జరగలేదు. "అయితే రాత్రి చీకట్లో రా! ఎవరికీ తెలియకుండా, తెలిసిందా?" అన్నాడు.

"సరే."

తలవంచుకుని మెల్లిగా వెనక్కి తిరిగి వెడుతున్నాడు గౌరాంగ్. వంట బ్రాహ్మడు ఒకక్షణం సానుభూతి దృష్టితో అతడు వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయాడు. బహుశా సానుభూతితో పాటు అతడిమీద కొంచెం గౌరవభావం కలిగి వుండొచ్చు. తర్వాత ఒక నిట్టూర్పు విడిచి, తలుపు వేసేశాడు.

దారిలో పరిచయం, అతడెవరో శ్రీమంతుల యింటి బిడ్డ అయి వుంటాడని.కోపంవచ్చి ఇంట్లోంచి పారిపోయి వచ్చివుంటాడని—అతడి కెలా కలిగిందో ఓ అభిప్రాయం కలిగింది. అంచేత అతణ్ణి చాటుగా - హోటల్ వంటగదిలోకి తీసుకెళ్ళాడు.

అప్పటినుంచి కొన్నాళ్ళు ఈ భోజనం యేర్పాటు గడిచింది.

'కస్టమర్స్' రద్దీ కొంచెం తగ్గగానే - ఈ వెనుకవైపు గుమ్మం తలుపు తెరిచి అటూ యిటూ చూసేవాడొకసారి. చూస్తే గౌరాంగ్ నిల బడి అయినా ఉండేవాడు. లేదా పెంటపోగులకి కొంచెం దూరంలో అటూ యిటూ తిరుగుతూనయినా ఉండేవాడు. పిలిచి తీసుకెళ్ళి భోజనం పెట్టి పంపించివేసేవాడు.

అయితే ఈ యేర్పాటు ఒక్క గౌరాంగ్ కోసమే సృష్టింపబడ లేదు. ఈ పద్ధతిని అనేక సమయాల్లో—ఇలాంటి సోదరుల్ని ఎంతో మందిని ఆదరిస్తూ వుంటూ వుంటాడా వంట బ్రాహ్మడు.

కాని గౌరాంగ్ వర్ధమాన్ నగరానికివచ్చి ఏ ఆకర్షణవల్ల ఇక్కడ ఇన్నాళ్ళు వుండిపోయాడు ? ఎక్కడినుంచి ఎలా వచ్చిపడ్డాడో అక్క డికి. అది అతడికి జ్ఞాపకం లేదు.

ఏమయినా యిక్కడికివచ్చి, చాలారోజులుండి పోయాడు. ఎందు కనో ఎవరికి తెలుసు ? యెవరతణ్ణి ఇక్కడ ఆపివుంచారు? హోటల్ బ్రాహ్మడి దయార్ద్ర హృదయతతోపాటు నిశ్చింతగా లభించే అన్నం మీది ఆశతో ఉన్నాడా ? కాక మరేదయినా అనిశ్చితమైన ఆశ పెట్టుకుని వున్నాడా ?

టీ దుకాణంలో మిగిలిన కొన్ని చిల్లర డబ్బులున్నాయి చేతిలో. అతడేదో ఒక రైలు ఎక్కాలి. సాధ్యమైనంత దూరం వెళ్ళిపోవాలి.

బాసుల్ పుర్ గడ్డమీదికి లేకుండా, మరే గడ్డమీదికైనా వెళ్ళి పోవాలి.

• • •

స్టేషన్ తర్వాత - స్టేషన్. దగ్గిర దగ్గిర ఊళ్ళు. రైలు కొంత

దూరం మెల్లిగావెళ్ళి, ఓ నిట్టూర్పు వదిలి, ఇహ అక్కడినుంచి మళ్ళీ తన రస్తాని పరుగులెడుతున్నట్లుంది.

ఒక మూడవతరగతి రైలుపెట్టెలో కన్పించాడు గౌరాంగ్. లక్ష్య హీనమైన శూన్యదృష్టి. హఠాత్తుగా ఏమి తోచిందో—చటుక్కున ఓ స్టేషన్‌లో దిగాడు సామాన్లు అనేవి ఏమీలేవు చేతిలో. దిగిపోయాడు.

జొపుల్‌పూర్ స్టేషన్‌తో పోలికేమీ లేదు. అయినా ఎదుట కన్పిస్తున్న దృశ్యం – ఏమిటో అలికేసినట్లు కన్పిస్తోంది. అస్పష్టంగా మనస్సుకి గుర్తువస్తోంది. ఓ చిన్న స్టేషన్. ఇంత ఓ చిన్న షెడ్. రంగు మాసిపోయిన ఓ చిన్న బోగీ. పాములాగా మెలికలు తిరిగిన ఒక జంట లైను. ఆలైను పొలాల్లోంచి గృహస్థుల యిళ్ళ ముంగిళ్ళ ప్రక్కనుంచి బస్తీ గాలితగిలిన ఏదో ఊరి టీ దుకాణం - స్టేషనరీ షాపులముందు నుంచి దారిచేసుకుని వెడుతోంది.

కళ్ళలో యేమిటి నీళ్ళు తిరిగాయి?

లేకపోతే అంతా ఏదో అలికేసినట్లు కన్పిస్తోంది ఎందుకని?

అడ్డ దిడ్డంగా అటూ యిటూ పోతూ పోతూ—హఠాత్తుగా గతుక్కుమని ఆగాడు గౌరాంగ్. కొయ్యపలకమీద రాసిన ఆ ఊరిపేరు ఏదో అతణ్ని నిలవేసినట్లుంది.

త్రివేణీ-

త్రివేణీ!

ఎక్కడ విన్నాడు గౌరాంగ్ ఈ పేరు? ఎప్పుడు? ఎవరినోట విన్నాడు? విన్నాడా? లేక చూశాడా? కొయ్యపలకమీద రాసింది కాదు, కాగితమ్ముక్కమీద రాసింది. ఆ కాయితపుముక్కని మరికొన్ని ముక్కలుగా చించి, గాలిలో వదిలేశాడు గౌరాంగ్.

ఈ త్రివేణీ—ఆ త్రివేణీయేనా యేం?

త్రివేణీలో గంగ వుండదా? పర్వదినాల్లో స్నానాలు చెయ్యటానికి వస్తూ పోతూ ఉంటారుజనం! ఎక్కడ వున్నది ఆ గంగ? ఎటు వైపున వుంది?

ఒక మనిషిని ప్రశ్నించగానే—అతడునవ్వి. ఒకవైపు చేత్తో చూపించి వెళ్ళిపోయాడు.

"ఇదుగో, ఇదుగో—ఏయ్‌రిక్షా....ఆగు, ఆగు"

గౌరాంగ్ తప్పుకుపోవటానికి ప్రయత్నించాడు. కాని ఇంచు మించు మీదిమీదికి వచ్చేసిన సైకిల్‌రిక్షా యెక్కి వస్తున్నవారి లక్ష్యవస్తువు గౌరాంగ్ అనేది నిస్సందేహం.

ఆఁ. ఆ రిక్షాలోవున్న ఆమె దిగింది.

"ఇదేమిటి ? గౌరాంగ్‌ఠాకూర్ కాదూ ? ఏమిటి మొహం ఇలా తయారయింది ? పారిపోతున్నారా యేం? స్వభావమేమీ మారనట్లు కన్పిస్తోంది. రండి, రండి"

'ఉహూఁ గుర్తించటంలో పొరపాటు పడలేదు'

ఒంటికి అతుక్కున్నట్లుండే బ్లౌజు ధరించి, ముస్తాబయివున్న ఆ యువతి ప్రధానమైన పర్వదినమవటంవల్ల ప్రత్యేకంగా ధరించిన పట్టు చీరె, పట్టుబ్లౌజు, రిక్షాలో తడిగుడ్డలు,గంగాజలంవున్న పాత్ర వున్నాయి. స్నానంచేసి తిరిగివస్తున్న మూర్తి !

* * *

రిక్షావాడు 'బాలన్సు' నిలపుకుంటూ 'పెడల్'ని కాలితో తొక్కిపట్టి ఒకచోట రిక్షాని ఆపివేశాడు. అపర్ణ చేతులూపుతూ "రండి, రండి. రానంటేవీల్లేదు. అయితే రిక్షాలో ఎక్కండి అనిమాత్రం అనకుతెండి. వీధిలో జనమంతా కళ్ళింతింత చేసుకుని చూడటం మొదలెడతారు. అంతకంటె ఈకాస్త దూరం నడిచే వెళదాం పదండి. ఏయ్ రిక్షా! నువ్వు వాటిని తీసుకుని ముందు పోతూవుండు. రండి మహాశయా ! ఎంతో దూరం నడవక్కర్లేదు - ఈ దగ్గిరలోనే యిల్లు"

గౌరాంగ్ విభ్రాంతుడై. ఆ 'ప్రగల్భురాలి' ముఖంకేసి చూస్తూ - "ఎవరియిల్లు ?" అని అడిగాడు.

"ఎవరిదేమిటి ?" అకారణంగానే నవ్వింది అపర్ణ. "మా ఇల్లే. నిలబడిపోయా రెందుకు ? పదండి"

"మీ యింటికి అకారణంగా నే నెందుకు రావటం ?"

"'ఎందుకు ?' అన్నది యింటికి వెళ్ళాక చెపుతాను. ఏమయినా చేతికి చిక్కినవారిని మిమ్మల్ని విడిచిపెట్టను మాత్రం విడిచిపెట్టను. వ్రతం పూర్తి చేశాను నేను. ఎంత ఆశతో పంపించాను బాసుల్‌పూర్ మనిషిని ? మీరు ఎక్కడికో నిర్దేశ్యంగా వెళ్ళిపోయినట్లు విన్నాను. మొత్తానికి భలే కయ్యాళి మనుషులండీ !"

మాటమాటకీ ఆమె నవ్వుతూ వుంది.ఆ నవ్వులో ఏదో సంగీతపు లయ వున్నట్లుంది.

కాని ఇటుకేసి చూడగల దృష్టి గౌరాంగ్‌కిలేదు. అదీకాక, ఒక్క మాట అతడి మస్తిష్కంలో, ఒక్కమాట సుత్తిదెబ్బలా టక్‌టక్‌మని కొడుతోంది. అందుచేతనేనేమో ఈ రుద్ధ కంఠస్వరపు ప్రశ్న !

"మనిషిని పంపారా బాసుల్‌పూర్ ?"

"అవును స్వామీ, అవును. మిమ్మల్ని, బాదల్ని తీసుకురావటానికి ఎంతో బ్రతిమాలి పంపాను మనిషిని. అయితే నా దురదృష్టం కొద్దీ-"

గౌరాంగ్ కళ్ళు రెండూ పెద్దవి చేసుకుని "ఎక్కడికి పంపించారు మనిషిని ?" అని అడిగాడు.

"ఇదెక్కడితంటా! నేనేం చిరునామా మరిచిపోయాననుకున్నారా? మనిషిని బాసుల్‌పూర్ శశిధర్ ఘోషాల్ గారింటికి పంపాను"

"ఎన్నటికీకాదు. అసంభవం !"

"ఇదుగో చూడండి. భలే పిచ్చివారు మీరు ! సంభవా సంభవాల చర్చ వీధిలో నిలబడి చేయటం బావుండదు. ముఖం ఇలా మారిపోయింది ఎందుకనా అని ఆలోచిస్తున్నా."

ఏయ్‌రిక్షా ! ఇంకా పోతున్నా వెక్కడికి ? ఆగు. రండి ఠాకూర్ మహాశయా !"

పూర్వకాలపు ఓ పెద్ద భవంతిముందు ఆగింది రిక్షా.

పెద్ద భవనం. కాని కళావిహీనమైన భవనం. శిథిల స్థితికి వచ్చి

నట్లుంది. పై అంతస్థులో వరుసగా వున్న ఇనుపకమ్మీల కిటికీలు — యించు మించు అన్నీ మూసివున్నాయి. ముందు పెద్ద ఇనుపగేటు దగ్గిర ఓ హిందూస్తానీ దర్వాన్ కూర్చుని ఉన్నాడు.

అపర్ణను చూసి, నేలకంటా వంగి సలాంచేసి. ప్రశ్నార్థకంగా చూశాడు గౌరాంగ్ కేసి.

అయితే గౌరాంగ్ అతడి దృష్టిని గమనించలేదు. అప్పు డతను సింహద్వారపు స్తంభాలమీది శిల్పశోభను పరీక్షగా చూస్తూ వున్నాడు. చేత్తో స్పృశించి, ఎంత పురాతన శిల్పమయి వుంటుందా అని ఆలోచిస్తు న్నాడు.

ఆ దర్వాన్ సలాంకి సమాధానంగా - అపర్ణ నవ్వుతూ - కన్ను గిలికి, గొంతు తగ్గించి "మాకు గురువులవుతారు మిశ్రాజీ !" అన్నది.

మిశ్రాజీ తొట్రుపడుతూ సలాంచేసి ప్రక్కకి తప్పుకున్నాడు.

"రండి." గురువుల్ని పూజ్యుల్ని అభ్యర్థన చేసేంత వినమ్రతతో అపర్ణ అతడికి అభ్యర్థన తెలిపి లోపలికి తీసుకెళ్ళింది. మంత్రముగ్ధుని లాగా గౌరాంగ్ ఆమెని అనుసరించాడు.

లోపలి యింటి మెల్లాకూడా అలాగే నిర్జనంగా, కాళాహీనంగా వుంది. మనుషుల అడుగుల అలికిడికి, కొన్ని పావురాలవీ ఎగిరిపో యాయి.

రిక్షావాలా మెల్లాప్రక్కనవున్న ఎత్తైన వరాండాలో గంగాజలం ఉన్న పాత్ర, తడిగుడ్డలు పెట్టి, వెళ్ళిపోయాడు.

ఈ అతి నిస్తబ్ధతమధ్య నుంచుని గౌరాంగ్ ఇంచుమించు చిరా కుగా "ఇక్కడికి తీసుకొచ్చారెందుకు నన్ను ?" అని అడిగాడు.

అతడు చికాకు కన్పరచటంతో అపర్ణ చాపల్యం, చమత్కారం కాస్త అణగింది. మ్లాన విషణ్ణదృష్టితో ఓసారి చూసి "పేదవారింట బ్రాహ్మణుల, సాధువుల పాదధూళి పడనేకూడదా స్వామీ ? శూద్రుల యింట భోజనం చెయ్యటానికి అభ్యంతరం లేదుకదా భాగవతోత్తము లకి ?" అన్నది అపర్ణ.

ఆమె చంచలనేత్రాల్లో నవ్వు తళుక్కుమన్నది. ఆ నవ్వు పెద వులమీదకూడా విరిసింది. మాటలోనూ తొణికింది. "తర్వాత కావాలంటే ప్రాయశ్చిత్తం చేసుకుందురుగాని లెండి. ఏమంటారు ?

గౌరాంగ్ ఒక్కసారి ఆమె ముఖంచేసి చూసి, గంభీరంగా — "ఎవరియింట్లో భోజనంచేసినా ఎవరూ ప్రాయశ్చిత్తం చేసుకోనక్కర్లేదు. ఆ భోజనంతోపాటు హృదయపూర్వకమైన స్నేహభావం కనుక వుంటే - తెలుసా ?"

అమాట వినగానే ఒక్కక్షణంపాటు అపర్ణలోని చాంచల్యం మ్లాన మయింది. కాని మరుక్షణంలోనే మళ్ళీ నవ్వుతూ "స్నేహం, మమత, భక్తి, శ్రద్ధ వీటికికూడా బ్రాహ్మణత్వ శూద్రత్వాలున్నాయా మహాశయా? అందలి భక్తిశ్రద్ధలూ అందరూ స్వీకరించటానికి యోగ్యులేనా ?"

"నాకు అంత జాతిమత వివక్షతలేదు." అంటూ అపర్ణ వెనకాలే లోపలికి వెళ్ళాడు గౌరాంగ్.

* * *

అపర్ణ ఆత్రంగా వరాండా కిటికీలోంచి క్రిందికి చూస్తూ భాగవ తోత్తములకి పాలు వెచ్చచేసి తీసుకురమ్మని వంటమనిషిని కేకేసి చెప్పింది.

"పాలా ? ఎందుకు ? పాలెందుకు ?" గౌరాంగ్ తొట్రుపడుతూ "అవన్నీ నాకక్కర్లేదు. వద్దని చెప్పండి" అన్నాడు.

"మీ కక్కర్లేదు. నాకు కావాలి. ఎంత అదృష్టంకొద్దీ నాకు మీరు లభించారు ?" అన్నది అపర్ణ.

"అదృష్టమా ? హూఁ. అదృష్టమే. సంగతంతా తెలిస్తే మీరీ మాట అననేఅనరు" అంటూ భోజనంముందు కూర్చున్నాడు గౌరాంగ్.

* * *

"నన్నింక విడిచిపెట్టండి" భోజనమయాక ప్రయాణోన్ముఖుడైన

గౌరాంగ్ అపర్ణ ముఖంకేసి ఆప్యాయంగా చూస్తూ అన్నాడు "ఎంతో ఆదరించారు. కలకాలం జ్ఞాపకం వుంటుంది. ఇంక వెడతాను"

• • • •

ఇంక వెడతాను.

అపర్ణకు తెలియదా గౌరాంగ్ వెళ్ళిపోవటానికి అడుగుతాడని ? అయితే మరి ఇంత వ్యాకులపాటు దేనికి ? వెయ్యి చేతులతో అతడి దారి కడ్డుపెట్టాలని తహతహలాడటం దేనికి ? కనీసం మరో రెండు రోజులు !....

ఆ సమయానికి తోచినదేమో అనేసింది. "ఇవాళే వెడతారా స్వామీ ! మీరు ఒకరోజు మా రాధావల్లభ మందిరంలో సంకీర్తన చేస్తారని నేనెంతో ఆశపడ్డాను"

"కీర్తనలా ?" గౌరాంగ్ ఏదో గతుక్కుమన్నాడు. తర్వాత గట్టిగా తల త్రిప్పుతూ "అహఁహఁ. అవన్నీ నావల్లకాదు. నే పాడలేను. నేనన్నీ మరిచిపోయాను"

గౌరాంగ్ కంఠంలో విస్పహాయతతో కూడిన వ్యాకులపాటు వ్యక్తమయింది.

అపర్ణ కొంచెం విచారంగా "మీరు కీర్తనలు మరిచిపోయారంటే నేనది ఎలా విశ్వసించగలను స్వామీ ! నేను చూసిన ఆ రూపం,అహఁ ఎలాంటి రూపం. మేడమీద వెదురు కటకటాల చాటున నిలబడి చూశానని స్వర్గలోకంలోని ఏ దేవతయినా మర్త్యలోకంలోకి దిగివచ్చారా ? అనిపించింది" అన్నది.

మైమరచిపోయివున్న అపర్ణ స్మృతులను నెమరువేసుకుంటోంది. విహ్వలభావంతో "ఆ చూసిన రూపాన్ని ఇంక మరచిపోలేకపోయాను. అది శిలావిగ్రహాల్లో కానవచ్చే ఓ దివ్యమైన రూపం !" అన్నది.

గౌరాంగ్ ఈ విహ్వలతలోని భావాన్ని అర్థంచేసుకోలేకపోయాడు. విస్మితభావంతో "ఏమిటి అన్నారు ?" అన్నాడు.

"అహఁ, ఏమీ అనలేదు." అంటూ నిగ్రహించుకుంది అపర్ణ.

"ఇంక రెండురోజులుండి వెళ్ళండి స్వామీ! అంటున్నాను. నేను మరొక్కసారి ఆ గానాన్ని వింటాను. ఒక్కసారి మా రాధా వల్లభునికి విన్పింపచేస్తాను."

గౌరాంగ్ తొట్రుపడుతూ—"ఇదిగో చూడండి. మీరూ సరిగ్గా అర్ధంచేసుకోవడం లేదు. ఉండేందుకు వీలులేదు నాకు" అన్నాడు.

అపర్ణ ఈసారి మరొకవిధంగా అర్ధంచేసుకుంది. అంచేత చిన్న పుచ్చుకున్న ముఖంతో - "ఎందుకు వీలులేదు స్వామీ? మీకు పోనీ నేనంటే అసహ్యత వుండొచ్చు. కాని రాధావల్లభుడంటే? ఆయన కేవలం నా దైవమేకాదు. మా అత్తవారింటి కులదైవంకూడా!"అన్నది.

అసహ్యం! గౌరాంగ్ విషణ్ణంగా నవ్వి - "మీకేమీ తెలియదు కనుక అలా అంటున్నారు. ఏ కారణంవల్ల నయినా సరే — ఎవర్నయినా సరే అసహ్యించుకునే అధికారం లేదు నాకు. తెలుసా? నేను అభాగ్యుణ్ణి. లోకులకందరికీ అసహ్య పాత్రుణ్ని. అందుకా యెందుకు—మీరే యిప్పుడు నా గాథంతా విన్నారంటే నామీద అసహ్యతతో ఒళ్ళు కంపరమెత్తిపోయి, నన్నిక్కడినుంచి తక్షణం వెళ్ళగొట్టేస్తారు" అన్నాడు.

"నేనా? మిమ్మల్నా?"

విస్ఫారిత నేత్రాలతో చూసింది అపర్ణ. తర్వాత నిట్టూర్చి .... "ఇలాంటి మాట మీలాంటి అమాయకులే అనటం సంభవం స్వామీ!" అన్నది.

గౌరాంగ్ కొంచెం తటపటాయించి...."నేను వెర్రివాణ్ణే — కాని మీరుమాత్రం ఏమంత తెలివికలవారు? అడగటంలేదు. పెట్టటంలేదు. హఠాత్తుగా ఎక్కడో దారిలో కనపడగానే - సరాసరి ఇంట్లోకి తీసుకొచ్చేశారు. దీనివల్ల మీకేం విపత్తు వచ్చిపడుతుందో అన్నదయినా ఆలోచించారా? ఈ యింట్లో మగవాళ్ళెవరూ లేరల్లే వుంది. కనుక మీరూ చెయ్యగలిగారు వున్నట్లయితే."

"ఉన్నట్లయితే బ్రతకనిచ్చేవాళ్ళు కాదు. ఏం అంతేనా?" అపర్ణ

ముఖం ప్రక్కకి త్రిప్పుకుని నవ్వి "అదృష్టవశాత్తూలేరు. అందుకనే ఈ దుస్సాహసం। కాని మాట యివ్వండి స్వామీ। ఇంకా రెండురోజు లుంటారా?" అన్నది.

గౌరాంగ్ స్థిరస్వరంతో "కాని మరి ఆ అవకాశం చూసుకుని పోలీసులు వచ్చి మీ యింటిమీద పడితే?" అన్నాడు.

"పోలీసులా? పోలేసులెందుకు?"

"మరేమిటి నే చెప్పేది?" గౌరాంగ్ బాధగా నవ్వి "పోలీసులు నా కోసం గాలిస్తున్నారు" అన్నాడు.

అపర్ణ ఈమాట వినికూడా యేమీ విచలితురాలు కాలేదు. విచిత్రమైన నవ్వొకటి నవ్వి - "ఎందుకో చెప్పండి స్వామీ। ఎప్పుడైనా వాళ్ళకి మీపాట విన్పించారా యేం?" అన్నది.

గౌరాంగ్ హఠాత్తుగా పాత అలవాటుకి తిరిగి వచ్చాడు. స్వభావ సిద్ధమైన గదమాయింపుతో "ఇదీ। ఇదే ఆడవాళ్ళ కుర్రతనపుచేష్ట। వచ్చింది భయంకరమైన విషయ ప్రస్తావన. మీరేమో పరిహాసాలాడు తున్నారు" అన్నాడు.

అపర్ణ మళ్ళీ అలాగే నవ్వి "పైకిమాత్రం అమాయకురాలిలాగా- "నాకేం తెలుసు. ఆడి రేకానీండి. ఇల్లు విడిచిపెట్టి పోయేట్లు చేసిందది ఎవరు చెప్పండి. నేను కాదుకదా।" అన్నాడు.

'ఆఁ।' అంటూ గౌరాంగ్ మండిపడ్డాడు."అసలు సంగతి వింటే ఆ నవ్వూ అదీ అన్నీ యెగిరిపోతాయి. ఖూనీచేసి పరారిఅయి తిరుగు తున్నాను నేను తెలుసా? ఖూనీ, ఇంకాచెప్పాలా ఏమైనా చాలా?"

"ఖూనీయా? మీరు ఖూనీయా?"

ఒక్కసారి ఒక్కక్షణంపాటు గతుక్కుమన్నది అపర్ణ. ఆ ఒక్క క్షణమే మరుక్షణంలోనే మళ్ళీ నిస్సంకోచంగా కిలకిల నవ్వింది. ఆగే టట్లు కన్పించలేదు ఆ నవ్వు.

ఏదో ఇంత కుతూహల కరమైన మాటకి ఎంత నవ్వినా తనివి తీరనట్లు.

అపర్ణ అంతావిని నిట్టూర్చి, "మీరు ఖూనీచేశారు అని వైకుంఠం నుంచి సాక్షాత్తూ నారాయణుడే దిగివచ్చి చెప్పినా నేనది విశ్వసించలేను" అన్నది.

"విశ్వసించరూ ?" గౌరాంగ్ వ్యగ్రుడై – "నిజం చెప్పినా విశ్వసించరూ?" అన్నాడు.

"విశ్వసించను."

"ఎందుకని ?"

"ఇందులో ఇహ 'ఎందుకని' అన్న ప్రసక్తే లేదు స్వామీజీ ! జరగనిది, జరగటానికి వీల్లేనిది ఎలా జరుగుతుంది?"

గౌరాంగ్ హతాశుడై – "హూఁ. కాని నేను నిజంగానే ఖూనీ చేశాను" అన్నాడు.

"స్వామీ ! అర్థమైంది. మీరిలా నన్ను భయపెట్టి, నానుంచి తప్పించుకుని పోవాలని అనుకుంటున్నారు. కాని ఇలా మభ్యపెట్టలేరు నన్ను. చెప్పండి స్వామీ : మీలాంటివారు హఠాత్తుగా ఓ మనిషిని ఖూనీ చెయ్యవలసిన అవసరం ఏం వచ్చింది? అసలు ఎలా చెయ్యగలిగారు ?"

గౌరాంగ్ విహ్వలభావంతో – "ఎలాగా ? అది నాకు తెలియదు. ఎలా జరిగిందో, ఏం జరిగిందో అదేమీ నాకు తెలియదు. వాళ్ళు ఖూనీ జరిగింది అని చెప్పారు. స్టేషన్ మాష్టరు పారిపో అన్నారు. ఇంకేమీ తెలియదు. అహఁ ఇంకేమీ జ్ఞాపకం రావటంలేదు" అన్నాడు.

"కాని మీకోసం పోలీసులు గాలిస్తున్నారు అని చెప్పారే మీరు స్వామీ ? అది నిజమేనా ?"

"నిజంకాదూ ?" గౌరాంగ్ నిశ్చిత స్వరంతో – "ఒక నిండు ప్రాణాన్ని ఖూనీచేస్తే, పోలీసులు దర్యాప్తు చెయ్యడం మొదలెట్టక మానా్తరా?" అన్నాడు.

గౌరాంగ్ ఇలా అనగానే అపర్ణ ముఖం అలా ఉజ్వలమైంది

దేనికి ? ఆనంద దీప్తిమూలంగానా ? ఈ భయంకరమైన వార్త మాటున అంత ఆనందకరమైన దేముంది?

"అదేకనుక అయితే స్వామీ ! మీరు పారిపోవటానికి ఇంత కంగారు పడటం దేనికి ? నా యీ లంకంత యిల్లు శూన్యంగా పడి వుంది. ఇక్కడ వుండరాదూ ? ఇక్కడికి పోలీసులు జన్మలో తొంగి చూడటానికి రారు ఎన్నడూ ?"

"ఇక్కడా ? ఇక్కడుండనా నేను ? మీకేమయినా పిచ్చా ? వెర్రా ?"

అపర్ణ తనలోతాను "వస్తుతః నేను అలాంటిదాన్ని కాదు. కాని మీరలా చేశారు" అని అనుకుంది. పైకిమాత్రం "ఇందులో ఇంత తెల్ల బోవాల్సిందేముంది స్వామీ ? మిమ్మల్ని నేను మన సా వాచా గురువుగా భావించాను. గురువులు శిష్యులింట వుండరా ?" అన్నది.

"ఏం బెడద ! మీయింట్లో ఎవ్వరూలేరు -"

"ఎవ్వరూ లేకపోవటం అది నా తప్పా స్వామీ ! భగవంతుడు నన్ను వంచితురాల్ని చేశాడుకదా అని, నేను ఎవరినుంచి రవంత దయా హృదయాన్ని ఆశించకూడదా ? నేను యింత శూన్యభవనంలో కొంత మంది దాసీలను పెట్టుకుని కాలం గడుపుతున్నాను. ఈ హాహాకార భరిత మైన ప్రాణిమీద మీ గానం ఓ చల్లని మంచిగంధపు పూతపూసింది. ఈ మంత్రాన్నికూడా నేను పృధివినుంచి కాంక్షించకూడదా స్వామీ ? సంతో షం, సంగీతం, ఆశ, ఆనందాలలో మిళితమైన పేర్మితో నిండివుందీ ప్రపంచం. దీనిమీద నాకేమీ హక్కు వుండటానికి వీల్లేదా ? చెప్ప గలరా నా అపరాధమేమిటో? ఒకవ్యక్తి అకాలంలో నిష్క్రమించారు. దానికి నేను బాధ్యురాల్ని ? అందులో ఈ నిండు వయసులో నేను...."

"ఛీ !" అన్నాడు గౌరాంగ్ చిరాకుతో - "హిందూస్త్రీ ఆలాంటి ఆలోచనల్నే రానీయకూడదు"

'రానీయకూడదూ ?' అపర్ణ చటుక్కున నవ్వింది. నవ్వి "ఆలోచ నలు రావటం అనేది మన చేతుల్లో వుందా ? ఆలోచనలమీద మన అధి

కారం చెల్లుతుందా ? ఈ దుస్సహమైన నిస్సంగజీవితపు రాత్రింబగళ్ళు కేవలం ఆలోచనలతోనే గడుస్తున్నాయి నాకు. పురుషుల దోషం ఏదీ కాదు. స్త్రీకి ఆలోచన వచ్చినా అపరాధమే. అది ఎంచేతనో చెప్పగలరా స్వామీ ? నా జీవితం ఎలా గడుస్తోందో మీకు తెలుసా స్వామీ ? చిన్నప్పుడే పెళ్ళి అయింది నాకు. సుందరవిగ్రహుండు నాభర్త. ఆ నూతన జీవితంలో వెల్లువలా వచ్చింది ప్రేమ. కాని.... కాని.... పువ్వులో పురుగుంది. అపరమన్మథ రూపంమాటున భయంకరమైన క్రూరజంతువుంది. అహ., హ.. మీరు దేవతలు స్వామీ ! మీకు తెలియదు మానవుని దేహంలో ఎంత భయంకరమయిన జంతువు నివాసం ఏర్పరచుకోగలరో మీకు తెలియదు. అతడు మరణించి నాకు విముక్తి కల్గించాడు. ఇందుకు నేనతడికి చాలా కృతజ్ఞురాలిని. కాకపోతే నేనే చావవలసి వుండేది. కట్టల్ని ఒరసుకుంటూ వచ్చిన ఆ వెల్లువ ఎందుకు మాయమవలేదో, ఎందుకు ఎండిపోలేదో చెప్పగలరా స్వామీ ?" అన్నది.

గౌరాంగ్ నిట్టూర్చి "చూడండి, పల్లెటూరిలో పుట్టి పెరిగిన మూర్ఖుణ్ణి. నేనిలాంటివన్నీ సరీగ్గా తెలుసుకోలేను. నాకు వెళ్ళిపోవటానికి అనుమతినివ్వండి. పోలీసుల భయంతో నేను మీయింట్లో దాక్కుంటే మనశ్శాంతిని పొందలేను" అన్నాడు.

"అర్థమయింది స్వామీ ! మీరు నన్ను అసహ్యించుకుంటున్నారు. కాని ఒక్క విజ్ఞప్తి చేసుకుంటున్నాను. వచ్చే శ్రావణపూర్ణిమ వరకు వుండండి. ఆ రోజున మా మందిర ప్రతిష్ఠ. అప్పుడెంతోమంది బ్రాహ్మణులు, సాధువులూ కూడా వస్తారు"

"దోల పూర్ణిమా ?" గౌరాంగ్ ఆలోచనలో పడ్డాడు. "అది ఇంకా యెన్నాళ్ళుంది ?" అని అడిగాడు.

నిస్సహాయస్థితిలో పడినట్లు అడిగా డామాట.

వ్యథిత దృష్టితో చూసింది అపర్ణ. తర్వాత "మీరు కనుక వుంటే స్వామీ. మీకు సర్వోపచారాలూ సలిపి ధన్యనవుతాను నేను" అన్నది.

* * *

ప్రతిమాలితే పర్వతాలయినా చలిస్తాయి.

గౌరాంగ్ డోల పూర్ణిమవరకు వుండటానికి అంగీకరించాడు.

అపర్ణకి జీవితంలో యివి మహోత్సవపు రోజులు.

ఆమె రాధావల్లభ మందిరంలో నిత్యమూ ఉపచారాలూ, ప్రత్యేక మయిన పూజలూ....అంచేత కీర్తన కాలక్షేపం అవసరం. పారిపో చూచినవానిని ఆపి వుంచటానికి ఇదొక పన్నాగమేమో అనిపిస్తుంది.

ఈ అవకాశంలో అపర్ణ సేవాశుశ్రూషాదరాలతో ఆత్మసమర్పణ చేసుకోసాగింది.

* * *

"ఊః. బ్రతికిపోయాను బాబూ! అద్దంలో ఒక్కసారి చూసు కోండి స్వామీ: మిమ్మల్ని మీరు గుర్తుపట్టుకో గలరో లేదో! గడ్డం మీసం పెంచుకుని, ముఖాన్ని ఏ స్థితికి తెచ్చుకున్నారు?"

గౌరాంగ్ తనకి తెలియకుండా అంతకుమునుపే చేయించుకున్న గడ్డంమీద చెయ్యి ఆనించి చూసుకుని "అయినా గుర్తుపట్టాను" అన్నాడు.

"గుర్తుపట్టారా! అది కేవలం అహం వద్దు. ఆ మాటవింటే మళ్ళీ సాధుస్వాములకి కోపం వచ్చేస్తుంది. ఇవాళ మిమ్మల్ని నేను స్వయంగా అలంకరిస్తాను స్వామీ! ముఖాన చందన తిలకం దిద్దుతాను. మెళ్ళో రజసగంధపు పూలమాల వేస్తాను. ధరించటానికి పట్టువస్త్రాలు, తలకి...." తన్నుతాను మరిచిపోయిన ధోరణిలో మాట్లాడుతుంది అపర్ణ.

"మీ తలకి ఏమందార నూనె అయినా మర్దన చేసుకోండి. తలలో ఏదో లోపం వున్నట్లుంది కొంచెం" అంటూ అక్కడినుంచి లేచాడు గౌరాంగ్.

* * * *

క్షణక్షణమూ ఇలాగే మనస్సులో ద్వైధీభావం పెరుగుతోంది.

అపర్ణ నైవేద్యం పెట్టిన పళ్ళెం - పళ్ళెం తీసుకువచ్చి అతడి కెదురుగా పెట్టి "తినండి స్వామీ!" అన్నది.

గౌరాంగ్ చిరాకుతో దాన్ని త్రోసివేస్తూ "ఈ బాహ్మడు బ్రహ్మ

రాక్షసి అని ఎవరు చెప్పారు మీకు ? ఇదిగో ఈ పళ్ళెముడు 'సందేష్' లు ఏమనిషి తినగలడు ?" అన్నాడు.

అప్పుడప్పుడు అంటూ వుండేవాడు. "మీ ఆదరానురాగాల మూలంగా డోల పూర్ణిమకి ముందే హడలెత్తి పారిపోవాల్సి వస్తుంది నేను. ఇది ఆదరించటంకాదు శిక్షించటం" అనేవాడు.

పచ్చివెలక్కాయ గొంతున పడ్డట్లయేది అపర్ణకి. మెల్లిగా షర్బత్ గ్లాసో, పైన బెజ్జంకొట్టిన కొబ్బరి బొండమో తీసుకుని అక్కడినుంచి వెళ్ళిపోయేది.

కాని మళ్ళా అప్పుడే మనసు మెత్తపడేది గౌరాంగ్‌కి. "ఇవ్వం డివ్వండి. ఆ సమయంలో కొబ్బరునీళ్ళు తాగి, సన్నిపాతాన్ని తెచ్చు కుంటే అదేమంచిది. మూతి బిగించుకుని వెడుతున్నారాయె మరి !"

• • •

కాని హాస్యపరిహాసాలతో ఏర్పడిన 'జాలు' ద్వారానే అజాగ్ర త్తగా వున్నప్పుడెప్పుడో పచ్చిపడుతుంది మొసలి.

మర్నాడు డోల పూర్ణిమ.

ఆనంద విషాదభరితమైన పాత్రచేత పుచ్చుకుని వస్తుంది మరు సటిరోజు అపర్ణకి. రేపు మహోత్సవపు రాత్రి. అంచేత ఈ ఆనందం. అపర్ణ మామగారి హయాంనాటి 'రాధావల్లభుడు' ఇన్నాళ్ళా వారి పూజా గృహంలో వున్నాడు. అపర్ణ ఆ రాధావల్లభునికి ఆలయం కట్టించింది. అక్కడ మర్నాడు ప్రతిష జరుగుతుంది.

పువ్వులు, ధూపదీప చందనాదులసువాసనలతో, దేవతాగమనంతో మర్నాడు ఈ మందిరం కళకళలాడుతుంది.

అయితే రేపే మళ్ళీ శూన్యమవుతుందేమో మరొక మందిరం ! గౌరాంగ్ వీడ్కోలు తీసుకుని వెళ్ళేది రేపేనేమో !

ఇంక అతణ్ణి ఏనెపంతో ఆపి ఉంచటం !

లోపలి మందిరాన్ని మాలలతో అలంకరించే భారం గౌరాంగ్

స్వీకరించాడు. పూలతోరణాలు, ఆకుల తోరణాలు, ప్రతిగోడకీ పూల దండలతో చక్కటి అలంకరణ.

ఈ ఉత్సవపు మైకంలోపడి గౌరాంగ్‌కూడా తానొక పరారీ నేరస్థుణ్ణన్న సంగతి మరిచిపోయినట్లున్నాడు. అతడి ముఖంలో సంతృప్తి లక్షణాలు కన్పిస్తున్నాయి.

హఠాత్తుగా ఝుంయ్ మంటూ ఎక్కడినుంచి వచ్చిందో గాలివాన వచ్చిపడింది.

టపటప కిటికీల తలుపులన్నీ మూసుకుపోయాయి. వరుసగావున్న చెట్ల తలలు ఒరిగిపోసాగాయి. ఇంతసేపూ చేసిన అలంకరణ అంతా ఛిన్నాభిన్నం అయిపోయింది. తర్వాత యిహ పెద్దవాన ప్రారంభమయింది.

శ్రావణమాసపు ప్రబల వర్షం....క్షణంలో వర్షపునీరు వెల్లువయిపోయేట్లుంది.

మందిరం లోపలినుంచి బయటికివచ్చి నృత్యమంటపంలోకి వెళ్ళి కూర్చున్నాడు గౌరాంగ్. అక్కడినుంచి గాలివాన ఉధృతాన్ని బాగా చూడవచ్చు. ఇలా జోరున వర్షంలోనే ఒకప్పుడు బయలుదేరి వెళ్ళాడు. తల దాచుకోటానికి యెక్కడా రవంత ఆశ్రయం దొరకలేదు. ఈనాడు అతడికి ఎంత సుఖవంతమయిన చక్కటి ఆశ్రయం!

• • • •

హఠాత్తుగా యింటి వెనుకవైపు వరాండాలోనుంచి అపర్ణ వచ్చి నిలబడింది. ఆమెచేతిలో ఓ పూలసజ్జ.

ఇంచుమించు ధ్యాననిమగ్నునిలా కూర్చుని వున్న అతడి వెనుక వచ్చి నుంచుని "స్వామీజీ!" అని పిలిచింది.

ఉలిక్కిపడి చూశాడు గౌరాంగ్.

అపర్ణ నృత్యమంటపంలోని స్తంభం వేదికమీదికి వచ్చి కూర్చుని "అలంకరణ అయిందా?" అని అడిగింది.

"అయింది ఒకరకంగా"

"చాలాసేపు అయింది కూర్చోరాదూ ?"

గౌరాంగ్ తొట్రుపడుతూ "ఎక్కడ కూర్చోను యిక్కడ?" అని అడిగాడు.

అపర్ణ యివాళ అన్నిటికీ తెగించిందా ? అంచేతనే తన ప్రక్కన వున్న రవంతచోటుని చూపిస్తూ "కాస్త దగ్గిరగా కూర్చుంటే జాతి పోతుందా ?" అని అడిగింది.

"మీ మాటలవీ నాకేమీ బాగుండలేదు." చిరాకుతో అన్నాడు గౌరాంగ్.

దెబ్బతిన్న దానిలా లేచి నుంచుంది అపర్ణ. హఠాత్తుగా గౌరాంగ్ చేతిని అదిమిపట్టుకుని, రుద్ధకంఠంతో "ఎందుకు బాగుండలేదో చెప్పగలరా స్వామీ? రాధారాణి విహార ప్రభువులతో మీ హృదయం నిండిపోయి వుంది. పరకీయ ప్రేమభావంతో మీరు మైమరచిపోయారు" అన్నది.

"ఆగండి — పరకీయప్రేమ. వైష్ణవ పరకీయప్రేమంటే ఏమిటో తెలుసా ? నేనంటేమీకు - మనిషికి మనిషికి వుండే ఆసక్తిని పరకీయ ప్రేమ అనరు. ఆ పరమోత్కృష్టమైన దాన్ని అర్థంచేసుకోగలశక్తి లేదు మీకు." అంటూ చెయ్యి విడిపించుకున్నాడు గౌరాంగ్.

కాని ఇవాళ అపర్ణ దుస్సాహసానికి సిద్ధపడినట్లుంది.

అంచేత అదర్శాచులా తలయెత్తి దృప్తభంగిమతో - "మానవ ప్రేమ అంత హీనంగా చూడతగిందా స్వామీ ? ఇది స్వర్గంనుంచే వస్తుంది. మానవుల్లో కేవలం ఆసక్తికాదు వుండేది : త్యాగంకూడా వుంటుంది. ఆఁ మిమ్మల్ని నేను ప్రేమించాను స్వామీజీ - భక్తులు తమ దైవాన్ని ప్రేమించినట్లు" అన్నది.

• • •

"అమ్మా, అమ్మా ! మీరిక్కడున్నారా ?" అంటూ కొత్తగా నియమించబడిన ఒక దాసీది పరుగెత్తుకు వచ్చింది బయట కాకీదుస్తులు ధరించిన ఒక వ్యక్తి నిలబడి వున్నాడు. "ఇన్‌స్పెక్టరో యెవరోట, మీకోసం వచ్చారుట" అన్నది.

"ఇన్‌స్పెక్టరు !" అపర్ణ ఒక్కసారి బిగుసుకు పోయినట్లయి. గౌరాంగ్ ముఖంకేసి చూసింది. తర్వాత క్షీణకంఠంతో "ఇంకేమడిగారూ?" అని అడిగింది.

"ఏమీ అడగలేదు. మీ యజమానురాలు యెక్కడ?అని మాత్రమే అడిగారు"

గౌరాంగ్ కొంచెం బాధగానవ్వి "పదండి. ఇహ అతిథి సేవా ఫలితాన్ని అనుభవిద్దురుగాని పదండి" అన్నాడు.

గౌరాంగ్ దాసీదానివెంట వెళ్ళటాని కుద్యుక్తుడయాడు. అపర్ణ దాసీది అక్కడ వున్నదన్న సంగతి మరచిపోయి, అతడి చేతిని గట్టిగా నొక్కి పట్టుకుని అణచుకున్న గొంతుతో "వద్దు. ఏమయినాసరే వద్దు. మీరు వెళ్ళటానికి వీల్లేదు. మీరు ఈ మందిరం వెనుకవైపునున్న మామిడితోపులోంచి స్టేషన్‌కి వెళ్ళిపొండి. తర్వాత ఏరైలు అందితే ఆ రైలెక్కి పారిపోండి" అన్నది.

గౌరాంగ్ మరొకసారి చెయ్యి విడిపించుకుని "ఉహూఁ. ఇంక పారిపోను. పారిపోయి తిరగటంచాలు ఇంతటితో. నువ్వు వెళ్ళు అమ్మీ, వెళ్ళి ఆయన్ని కూచోమని చెప్పు. ఇంక మీరు నాకు అడ్డు తగలకండి. ఇలా పారిపోయి బ్రతకాలనే వాంఛలేదింక నాకు అపర్ణాదేవీ ! జీవితంలో యెవరికీ యేమేలూ చేయలేకపోయాను. అందరికీ నష్టాన్నే కలిగించాను. విధి విధానానికి విరుద్ధంగా నడవలేము. అపరాధిని శిక్షపడటమే మంచిది. ఖూనీకోరుకి వురిశిక్ష పడటమే సబబు. దారి వదలండి. నన్ను వెళ్ళి పట్టుపడనీయండి" అన్నాడు.

అపర్ణ కాళ్ళూ చేతులూ వణకుటున్నాయి. పెదవులుకూడా కంపించసాగాయి. ఎలా ఈ విపత్తును అడ్డగించటం !

హఠాత్తుగా తీవ్రకంఠంతో "ధర్మబోధలు వద్దు. చాలుస్వామీ ! మీరు పట్టుపడితే నాస్థితి యేమవుతుందో ఆలోచించారా? ఖూనీచేసిన నేరస్థుణ్ణి దాచివుంచితే ఆ దాచిన వారికి శిక్షపడదూ ? మీరు నన్ను అన్ని విధాలా అధోగతిపాలు చేద్దామని చూస్తున్నారా ?" అన్నది అపర్ణ.

అపర్ణ పెదవి కొరుక్కుంటూ అన్నదీ మాటలు :

కాని ఆమె ఉద్దేశం సిద్ధించింది. గౌరాంగ్ చటుక్కున వ్యంగ్యపు నవ్వొకటి నవ్వి "ఓ అదా ! పోసింది. 'భక్తురాలు - భగవంతుడు' అన్న వ్యవహారం ముగిసినట్లేనా అయితే ?" అన్నాడు.

"ఆఁ. తమ ప్రాణాల్ని కాపాడుకోవాలని ఎవరు చూసుకోరు ? వెళ్ళండి. వెళ్ళండి మీరు చెపుతున్నా"

"సరే, వెడుతున్నా అయితే. మిమ్మల్ని విపత్తులోకి త్రోయను" గంభీరకంఠంతో అన్నాడు గౌరాంగ్. "ప్రపంచంలో పారిపోయే మార్గాలు ఎక్కువలేవు నిజమే. కాని పట్టియిచ్చేందుకు మార్గాలనేకం వున్నాయి. ఉరిపడేంతవరకు శాంతిలేదు నాకు"

* * *

అపర్ణ చూపించిన మందిరం వెనుకవైపునుంచి మెల్లిగా నడుస్తూ వెళ్ళిపోయాడు గౌరాంగ్. వెళుతూంటే అడుగడుక్కి వానవల్ల అంత రాయం కల్గుతూవచ్చింది. అయినా ముందుకు సాగి వెళ్ళిపోయాడు.

దాసీది మళ్ళీ పరుగెత్తుకొచ్చింది. "అమ్మగారూ ! అంత ఆల స్యం చేస్తున్నారేమిటి ? ఆయన మహా తికమక పెట్టేస్తున్నారు"

అపర్ణ ఏమీ మాట్లాడకుండా ఆ దాసీని అనుసరించింది. ఏ ప్రశ్నకి ఏం సమాధానం చెప్పవలసి వుంటుందో ఆలోచించుకుంటూ మాత్రం వెళ్ళింది. అతణ్ణి మాటలలో ఎలా ఆపి, గౌరాంగ్‌కి పారిపోయే అవ కాశాన్ని కల్గించటమా ? అన్నది ఆలోచించసాగింది.

కాని ఇదేమిటి ? అపర్ణకోసం ఇలాంటి 'అదృష్టపరిహాసం' సిద్ధంగా వుంది. దాసీది ఇన్‌స్పెక్టరుగా వర్ణించిన వ్యక్తి అపర్ణని దూరం నుంచే చూసి "ఇదిగో చూడు అపూ ! ఈ దాసీది నన్ను యింటిమించు వెళ్ళకొట్టటానికి సిద్ధమయింది. ఇంట్లోకి రానీయనేలేదు. ఎలాంటి వాళ్ళని పెట్టుకున్నావంటేను ?" అంటూ గొడవ చెయ్యసాగాడు.

"చినబాబాయ్ ! మీరా ?"

వరాండాలోని మెట్లమీద కూలపడింది అపర్ణ.

పెద్దమనిషి చిక్కులోపడ్డ ముఖంతో "నేనే : కాని నువ్వెందు కింత గాబరాపడతావ్ ? 'బాబాయ్, ఆలయప్రతిష్ఠ చేయిస్తున్నా నువ్వు తప్పకుండా రావాలి' అని అంత యిదిగా ఉత్తరం రాశావ్ ? మరిచి పోయావా ? నేను ఈ నెల్లాళ్ళ క్రితపు ఉత్తరం సంగతి జ్ఞాపకం పెట్టు కుని నిజం చెప్పొద్దూ ! అసలు ఇటువైపున నాకు ఇన్స్పెక్షన్‌కూడా వుంది. ఇదేమిటి ? ఇదేమిటి ? ఏం జరిగింది ? దాసీ, దాసీ కాసినినీళ్ళు, కాసిననీళ్ళు. విసనకర్ర ! విసనకర్ర! ఏమిటి ? ఏం జరిగింది ? ఉప వాసాలూ అవీ చాలా చేసివున్నావల్లేవుంది" అన్నాడు.

• • •

"పోరాడక ఊరుకోవటమేమిటి ?" అపర్ణ పింతండ్రి చాలా నొక్కి నొక్కి చెప్పాడు "నువ్వు అతడి దగ్గిర 'దీక్ష' పుచ్చుకున్నా వంటే, అతడు నీకు గురువు అయినాడన్నమాట ! అప్పుడిహ అతడి తరఫున పోరాడాల్సిందే ! డబ్బు కుమ్మరించామంటే కేసు గెలిచి వేయొచ్చు. తెలుసా అపూ ? ముఖ్యంగా నీ వతడు నిర్దోషి అని చెపు తున్నావ్ కనుక !"

"నే నామాట మనసావాచా విశ్వసిస్తున్నాను బాబాయ్ !"

"అయితే ఇహనేమీ అక్కర్లేదు. అతడికి డబ్బు వుందా ?"

"డబ్బా ? ఆఁ. బాబాయ్ ! చాలా డబ్బుంది వారికి. చాలా డబ్బు"

"చాలు. అయితే ఇహనేం నెగ్గేసినట్లే. డబ్బుతో పరిష్కరించ లేని అపరాధమనేది లేనేలేదనుకో. తెలిసిందా ? ఇహ ఇదంటావా ? నువ్వేమీ దిగులుపడకు. కచ్చితంగా గెలవచ్చు. గురువులకు డబ్బు దండిగావుంటే శిష్యప్రశిష్యుల అండకేం బ్రహ్మాండంగా వుంటుంది. అబ్బ ! వర్షమేమిటి దంచికొడుతోంది. అదృష్టవశాత్తూ దారిలో చిక్కు పడకుండా ఇంట్లోకివచ్చి పడ్డాను"

కాని అతడిమాట పూర్తికాకముందే అక్కడినుంచి లేచి ప్రక్క గదిలోకి వెళ్ళింది అపర్ణ. విద్యుద్వేగంతో పెట్టెలు, ఇనప్పెట్టెలు, బీరు

వాలూ తెరవటం మొదలెట్టింది. ఉన్న నగలంతా పైకితీసినా మనస్సుకి సంతృప్తి కలగలా. ఇనప్పెట్టె తెరచి, హారాలు, కంకణాలు, తాపీజులు. బాజుబుదులు మొదలైన నగలన్నీకూడా బయటికి తీసింది. దారిలో చిక్కు పడకుండా ఇంట్లోకి వచ్చి పడినందుకు అదృష్టాన్ని స్తుతించుకున్నాడు బాబాయ్! కాని భయంకర సమయంలో అపర్ణ అతణ్ణి ఇంట్లోంచి బయటికి పంపించివేసింది.

ఏ విపత్తువచ్చి పడుతుందో అని లేనిపోని భయంతో ఈ దుర్యోగ సమయంలో 'వెళ్ళు వెళ్ళు' అని తరిమివేసిన ఆ అభాగ్యుని వెనకాలే చప్పున పరుగెత్తాలి. హఠాత్తుగా తల తిరిగి పడిపోయి తనంతటతానే ఆలస్యం చేసింది అపర్ణ. ఇప్పుడిహ ఎంతదూరం పరుగెత్తితే అతణ్ణి అందుకోగలుగుతుంది? అపర్ణ అతణ్ణి చేరుకునేలోగానే, నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టబడిన అభాగ్యుడు తనకితానైపోయి పోలీసులకి చిక్కితే?

అప్పుడిహ ఏం చేస్తుంది అపర్ణ? ఏం చేస్తుంది?

హే భగవాన్! రక్షించు....రక్షించు భగవాన్!

• • • •

మనిషికంటె జంతువే మంచిదేమో అనిపిస్తుంది.

ఓ పాడుపడిన యింట్లో దూరి కూర్చుని, కారుక్రమ్ముకువచ్చి వర్షిస్తున్న ఆకాశంకేసి ఉదారదృష్టితో చూస్తూ గౌరాంగ్ ఈ వేదాంతపు ఆలోచనలోపడ్డాడు. ఈ పాడుపడిన యింట్లోకి ముందుగా తడిసి నీళ్ళు కారుతున్న ఓ కుక్కవచ్చి వుంది. రెండుకాళ్ళ సందున తల ఆనించుకుని కునికిపాట్లు పడుతోంది అది.

అది గౌరాంగ్ రాగానే అలస దృష్టితో ఓసారి అతడికేసి చూసి కళ్ళు మూసుకుంది. ఎలాంటి అభ్యంతరాన్ని తెలుపలేదు. తర్వాత ఇహ యిద్దరూ ఒకే ఆచ్ఛాదనక్రింద కూర్చున్నారు కదలకుండా. ఎలాంటి విరోధభావమూ తలయెత్తలేదు ఇరువైపులనుంచీ.

• • •

ధూత్ పాడులోకం!

ఉదాసీన వ్యక్తి నిశ్చల నేత్రాల్లో—హఠాత్తుగా స్థిరసంకల్పపు వెలుగు తళుక్కుమన్నది. ఈ పాడు ప్రపంచంలోపడి వుండటం కోసమే - ఇంత ప్రయత్నం. ఇంత ఊగిసలాట! ఇంత తాపత్రయం—ఛీ-ఛీ.

ఉహూఁ, ఇంక ఇలా ప్రాణా లరచేత పెట్టుకుని పారిపోతూ తిర గడు తాను: శశిధర్‌ని హత్యచేసిన వానికి ఉరికంబాని కెక్కించి కాని విశ్రమించడు.

అపర్ణ హృదయ విహీనత - మూర్ఛితమైపోయిన అతడి చైత న్యాన్ని కుదిపి కుదిపి, అతణ్ణి సచేతనుణ్ణి చేసినట్లుంది. గత ఆరుమాసాల నుంచి తిండీ తిప్పలు లేకుండా భయంతో పారిపోతూ, తిరుగుతూ వచ్చిన తన దైన్యరూపాన్ని తలపుకి తెచ్చుకుంటే తనమీద తనకే అసహ్యం కలగసాగింది గౌరాంగ్‌కి.

కేవలం బ్రతకటంకోసమని ఇంత దీనత్వమా? దీనికేమయినా అర్థం వుందా? మెలకువగావుంటే ఎక్కడో దాక్కుని అతి జాగ్రత్తగా అటూ యిటూ చూసుకుంటూ రోజంతా గడపడం....ఇహ నిద్రపోయే అవకాశం కనుక లభిస్తే దుస్స్వప్నాలతోనే ఆ నిద్ర మొదలవటం. భయంకరమయిన దుస్స్వప్నాలో పైన తలమీద ధగధగలాడుతున్న ఒక మంచి పదునైన ఆయుధం. ఇహపోతే కాళ్ళకింద సన్నటి నల్లటి రక్త ధార!

ఆనాడు ఎవరిచేతుల్లో ఎవరు ఖూనీ అయినారో ఇప్పటికీ సరీగ్గా అర్థంచేసుకోలేకపోతున్నాడు గౌరాంగ్.

శశిధర్ ఖూనీ అయిపోయి, గౌరాంగ్ బ్రతికివున్నాడా? మధ్య మధ్య గౌరాంగ్ తన శరీరాన్ని తానే గిల్లుకుని, తాను కచ్చితంగా బ్రతికి వున్నదీ లేనిదీ నిర్ధారణ చేసుకుంటూ వుంటాడు.

బ్రతికివున్నదీ లేనిదీ ధృవపరచుకోటానికి శరీరాన్ని గిల్లుకుని గిల్లుకుని, నిదర్శనల్ని చూసుకోవటం. ఈ హేయ జీవితాన్ని పైనవేసు కుని తిరగటం ఇంతటితో సమాప్తంకానియ్!

బహుశా ఇలాగే జరుగుతూ వుంటుందేమో !

మానవుని హృదయ విహీనత మానవుని ఉదాసీనుణ్ణి చేస్తుంది, వేదాంతుణ్ణి చేస్తుంది. మానవుని హృదయ విహీనత శిశువుని, పరిణతుణ్ణి చేస్తుంది, అమాయకుని విజ్ఞుణ్ణిగా చేస్తుంది. నేటి అపర్ణ హృదయ విహీనతాభినయం కూడా అలాగే మొద్దుబారిపోయిన గౌరాంగ్ మనస్సుకి ఆలోచనాశక్తిని కలిగించింది.

అందుచేతనే 'ధూత్ ! పాడులోకం' అని అనేసేశాడు గౌరాంగ్.

ఏమనుకున్నాడో కుక్కమీద కాసేపు ఆదరణ చూపాడు. తర్వాత పాడుపడిన యింటి యిటుకగుట్టల్ని దాటి ఇవతలికి వచ్చి కారుచీకటిలో కలిసిపోయాడు.

మేఘ మలినమైన నిశ్శబ్దాకాశం. గాలి ఇంకా బాగా చెమ్మగానే వుంది. బాగా వర్షంతో తడిసిపోయిన నేల స్పర్శ సోకి ఆగాలి మరింత బరువెక్కినట్లుంది.

వెడుతూ వెడుతూ ప్రకృతినంతనీ ఒక్కసారి పరిశీలనగా చూస్తూ నడుస్తున్నాడు పథికుడు. మళ్ళీ మధ్య మధ్యన ఈ లోకంలో రెండు నాళ్ళు ఎక్కువ వుండటానికై మానవులు ఎంత తాపత్రయ పడతారు ? ఆశ్చర్యం !' అని ఆలోచించుకుంటున్నాడు.

కాని ఎన్నాళ్ళయింది - అతడిలాగే ఒంటరిగా నడిచి వెడుతూ వెడుతూ 'ఈ పృధివి, ఈ వెలుగు, ఈ వాతావరణం మధ్య మానవుడు ఆనందాన్ని వెతుక్కోలేడు ఎందుకని ?' అని ఆలోచించి ఎన్నాళ్ళయింది !

* * *

కూతవేసి రైలు వెళ్ళిపోయింది.

శూన్యంగావుంది లైను. సద్యోవిధవ పాపిట రేఖలాగా వుంది — చూపరుల హృదయాన్ని బరువెక్కించటానికి. రైలు వెళ్ళిపోయాక

ఇంజను ధ్వనికూడా విన్పించకుండా పోయాక శూన్యంగా వుండే రైలుని చూస్తే మనస్సుకి దిగులెయ్యని వాళ్ళంటూ ఎవరైనా వుంటారా ?

బాసుల్‌పూర్ స్టేషన్‌లో అరనిమిషంసేపు ఆగుతుంది రైలు. పగలు - రాత్రి రెండుసార్లు దాని డ్యూటీ. రాత్రి నాలుగింటికి, పగలు నాలుగింటికి ఇక్కడ అరనిముషం అరనిముషం ఆగి, మళ్ళీ తన మదగర్వితగమనానికి భంగం రాకుండా ముందుకు సాగిపోతూ వుంటుందది. ఈ స్టేషన్‌లో పగటిరైల్లో ఎప్పుడైనా నలుగు రయిదుగురు ఎక్కటం దిగటంకద్దు. ఇహ రాత్రి రైల్లో ప్రయాణీకులు ఎక్కటం దిగటం అనేది దైవికంగా జరిగితే జరగాల్సిందే.

అయినా బాసుల్‌పూర్ స్టేషన్‌లో అరనిముషం సేపు ఆగుతూనే ఉంటుంది రైలు.

* * *

అయినా తెల్లవారకట్ల రైలు వెళ్ళిపోయాక స్టేషన్ మాష్టరు— నాలుగువైపులా అద్దాలుబిగించిన రైల్వేకంపెనీవారి చీలుచదరపు పెద్ద లాంతరుని పైకిఎత్తి పట్టుకుని ఎవరికోసమో వెతుకుతూ తిరుగుతూం టాడు. చూసినచోటే మళ్ళీ చూస్తూ ఉంటాడు. తన పరధ్యానం మూలంగా కన్పించలేదేమో అని, నూతిదగ్గిర పూలచెట్ల నీడలు మాటి మాటికి మనిషేదో వున్నట్లు భ్రాంతిని కల్గిస్తూ వుంటాయి.

వెతుకుతూ వెతుకుతూండగా తెల తెలవారిపోవటం మొదలవు తుంది. పృధివి తన రహస్య గాంభీర్యాన్నంతనీ కోల్పోతుంది. లాంత రుని ఆర్పివేయవలసి వస్తుంది.

కాని దానితోపాటు ఆశాజ్యోతులన్నీ ఆరిపోయినట్లేనా ? ప్రతీక్ష ఇంక సమాప్తమయినట్లేగా ?

కాదు, కాదు. సాయంత్రం నాలుగుగంటల రైలు వచ్చేవేళకి మళ్ళీ తాను బాదల్‌ని వెంటపెట్టుకునివచ్చి నిలబడి వుండవలసిందే !

ఇదొక క్రొత్త డ్యూటీ అయిపోయింది స్టేషన్‌మాష్టరుకి.

సాయంత్రం మూడుగంటలు కాకముందే వారింటికి వెళ్ళి బాదల్‌ని తీసుకురావటం. తర్వాత ఒక్కొక్క నిమిషమే ఆ సమానవయస్కు లయిన మిత్రులిద్దరూ వృథా ఆశతో ప్రతీక్షిస్తూ గడపటం....దూరాన ఇంజనుకూత వెయ్యటం విన్పిస్తుంది. ప్లాట్‌ఫాం ఏదో కంపించినట్లవు తుంది. రైలు వస్తుంది. ఇంజను కళ్ళముందునుంచే దాటి వెడుతుంది. రైలు కంపార్ట్‌మెంట్‌లన్నీ కన్పిస్తాయి. ఎంత పాతదయినా ఎప్పటి కప్పుడు క్రొత్తగానే కన్పిస్తుంది రైలు. నిత్యమూ క్రొత్తఆశల్ని రేకెత్తిస్తుందది.

ఇవాళ వస్తాడు. బహుశా యివాళ రావచ్చు.

రైలువచ్చే క్షణంవరకూ ఆ ముదుసలి, ఈ పసివాడు క్షణం విరామం లేకుండా మాట్లాడుతూనే వుంటారు. వారే వక్తలు, వారే శ్రోతలు. పసివాడి దోసిలి జామ్‌కీపూలు, దాసానిపూలతో నిండిపోతుంది. నున్నటి గుండ్రటి చిన్నచిన్న రాళ్ళతో జేబు నిండిపోతుంది. తండ్రి హఠాత్తుగా వస్తే చటుక్కున అతడికేం కానుక యివ్వటం అనేది తోచక యివన్నీ పోగుచేసుకోవటం. రైలు రావటానికి చాలా వ్యవధివుంటే ఇద్దరూ కాసేపు కంకరగుట్టమీద కూర్చుంటారు. బాదల్ ఫిర్యాదుచేస్తున్న ధోరణిలో "రాసిన నాటకాలన్నీ తగలపెట్టారుకదా పెద్దనాన్నగారూ! నాన్న వచ్చి అడిగితే ఏం చెపుతారు సమాధానం?" అని అడుగుతాడు.

"నాన్నవస్తేనా?" మాష్టరు విచలిత కంఠంతో గట్టిగా నొక్కి పలుకుతూ — "అన్నీ తగలపెట్టాను. మంచిపనిచేశాను. దౌర్భాగ్యుడివి, మూర్ఖుడివి నువ్వు. ఎందుకు వెళ్ళిపోయావ్? అని అడుగుతాను" అంటాడు.

"నాన్నని మీరు తిడతారా పెద్దనాన్నగారూ?"

"తిట్టనూ? వందతిడతాను. వెయ్యి తిడతాను. దౌర్భాగ్యుడు నాకింత సంకటం తెచ్చిపెట్టాడు - నేను అతణ్ణి తిట్టకుండా వుంటానా?"

బాదల్ కాసేపు మెదలకుండా ఊరుకుని దిగులుగా "నాకూ నాన్నని గురించి కష్టంగావుంది పెద్దనాన్నగారూ!" అంటాడు.

"తిడుదువుగాని. నువ్వూ తిడుదువుగాని"

ఇత్తడి గుండీలు కుట్టిన కోటు చేతులు కళ్ళదగ్గిరగా పెట్టుకుంటూ "బాగాతిట్టు, గట్టిగాతిట్టు" అంటాడు మాష్టరు.

"ఎన్నటికీ తిట్టను" బాదల్ ఎంతో రోషంతో చెపుతాడు సమాధానం "నేను ఒక్కటికూడా తిట్టను నాన్నని. గౌరవిస్తానంతే"

"సరైన మాటన్నావ్ నాయనా ! సరైనమాట అన్నావు. "గౌరవిస్తావ్ అంతే ! నువ్వు శిశువువి, దేవతలాంటివాడివి నువ్వు. మా మాదిరిగా స్వార్థపరుడివి కావుగా ! గౌరవిస్తావ్, గౌరవిస్తావ్. మంచి మాటన్నావ్"

మనస్సులోని ఉద్వేగంతో లేచి నిలబడతాడు మాష్టర్. లేచి అటూ యిటూ పచార్లు చెయ్యటం మొదలెడతాడు. కాసేపటికల్లా బాదల్ పూర్ ప్రసక్తి తీసుకురావచ్చు. "అనువుకాని, పెదనాన్నగారూ ! పత్రికల్లో నాన్నపేరిట ఉత్తరం ప్రచురించామని చెప్పారుగా మీరు ? చాలా రోజులయింది: ఏదీ సమాధానమేమీ వచ్చినట్లు లేదే?"

మాష్టరు భగ్నస్వరంతో : "వస్తుందిరా బాదల్! వస్తుంది. ఆ ఉత్తరం ఆశతోనేగా ఇలా రోజులు లెక్కపెడుతూ కూర్చుంది" అంటాడు.

"ఆ ఉత్తరం అచ్చుఅయిన పత్రికను. అత్తయ్య రోజూ చదువుతూంటుంది పెదనాన్నగారూ ?"

"అఁ. రోజూ చదువుతుందా ? అత్తయ్య రోజూ చదువుతుందా? మరి మీ అమ్మ?"

"అమ్మా ? అమ్మకి చదవటం చేతవునా యేం?" హఠాత్తుగా నవ్వాడు బాదల్. "అమ్మ ఎంత అమాయకురాలంటే పెదనాన్నగారూ; మీరు యిచ్చిన ఫోటో ఉందే—దానికింద భీష్ముని అంపశయ్య అని స్పష్టంగా రాసివుందా?....అలా కింద ముళ్ళుగుచ్చి వానిమీద పడుకున్నాడెందుకురా ముసిలాడు? శివమెక్కిన సన్యాసా యేం ? అని అడిగింది అమ్మ."

మాష్టరుగారి సగం నెరిసిన మీసాల చాటునకూడా కాంతిరహిత మైన నవ్వొకటి తొంగిచూసింది.

*　　　　*　　　　*

దూరంగా రైలు కూతవేసింది.

ఇద్దరూ గతుక్కుమని ముందుకు వెళ్ళారు. మాష్టరుగారికి స్వంత డ్యూటీ ఒకటుంది. "బాదల్ ! కాస్త ఉండు. వస్తున్నా, బాగాకన్నువేసి వుండు. ఎవరైనా దిగి అటూ ఇటూ పారిపోయేను !" అన్నాడు.

ఏ పరారి అయిన వ్యక్తి మళ్ళీ ఎందుకువచ్చి బాసుల్‌పూర్‌లో దిగుతాడో — మళ్ళీ ఎందుకు పారిపోతాడో — ఆ ఆలోచన లేదు మాష్టారుకి. అతడి బెంగల్లా — పరారీ అయిన ఖయాలీమనిషి చేతికందీ మళ్ళీ జారిపోతాడేమో అనే.

ట్రైన్ 'ఇన్' కాగానే పుస్తకంలో సంతకం చెయ్యాలి స్టేషన్ మాష్టర్. మళ్ళీ అది స్టేషన్ విడిచి వెళ్ళటానికి ఆర్డరు ఇవ్వాలి. అది ఒక నియమం మాత్రమే. బాసుల్‌పూర్ స్టేషను మాష్టరు శ్రమ అతడికి వచ్చే జీతానికి తగినట్లుగానే వుంటుంది.

ట్రైన్ వస్తుంది, అరనిమిషం ఆగుతుంది. మళ్ళీ కూతవేసి బయలుదేరి పోతుంది.

మళ్ళీ బావురుమంటూ వుంటుంది స్టేషన్.

"నాన్న యింక రారా పెదనాన్నగారూ?"

నిరాశా పూరితమైన శిశు హృదయం — ఉగ్గపట్టుకుని మాట్లాడి నట్లు...."నాన్న అసలు ఇంక ఎన్నటికీ రాడు" అంటుంది.

శ్రోత ప్రాణం విల విల లాడిపోతూంది. భయంతో కుర్రవాడి నోటికి చెయ్యి అడ్డం పెడతాడు మాష్టరు. అది బహూశా తన హృదయంలోని ఆశంకని అణచి వుంచుకోవటమే నేమో !

"ఖబర్‌దార్ ! ఆమాట మాత్రం యెప్పుడూ అనకు బాదల్ ! ఖబర్దార్ ! అనకు. రాకపోవటమేమిటి? తప్పకుండా వస్తాడు. రాకుండా ఎక్కడికి పోతాడు?"

*　　　　*　　　　*

ఇంక యేమీ మాట్లాడుకోరు. మూకప్రాణు లిద్దరూ ఊరివైపు తిరిగి వస్తూంటారు. బాదల్‌ని యింటికి తీసుకెళ్ళి దింపించి, స్టేషన్ మాష్టరు – ఇంతదూరం నడిచి మళ్ళీ స్టేషన్‌కి వెడతాడు.

వచ్చేప్పుడు కనీసం ఓ పసివాడు తోడుంటాడు. తన ప్రపంచం లోకి క్రొత్తగావచ్చిన కోమల హస్తస్పర్శ వుంటుంది. అపరాహ్ణ సమ యపు అపరంజ వెలుగు వుంటుంది. తిరిగి వెళ్ళేప్పుడు అంతా అంధ కారమే.

అయినా మళ్ళీ కొన్ని గంటలు కాగానే. ఆ చీకట్లో ఓ దీపాన్ని పైకిఎత్తి పట్టుకుని, వెతికినచోటే మళ్ళీ వెతుకుతూ తిరుగుతూంటాడు మాష్టరు. ఓవేళ ఎవరయినా తన కంటపడకుండా రైలుపెట్టెలోంచి దిగారేమోనని !

* * *

"అల్లుడి సంగతి యేమయినా తెలిసిందా నిభాననీ ?" నీలాటి రేవులో నిత్యమూ నిభాననిమీదికి వచ్చిపడే బాణమే ఇది.

చేతిలో బిందెని మాంచి విసురుగా నీళ్ళలో ముంచుతూ "ఏదీ ? ఎక్కడ ?" అన్నది నిభానని.

"ఆఁ. ఏమయినా మీరూ అంతశ్రద్ధగా వెతకటం కూడా లేనట్లుం దిలే అక్కయ్యా ? ఏమయినా పిల్లదాని మొహంచూసి అయినా వెతకక తప్పదుకదా ! మీ మనుమడుకూడా తండ్రి దగ్గిర దాగా మాలిమి అయిన వాడు పాపం ! తండ్రి లేచిపోయిన తర్వాత కుర్రవాడేమిటో నల్లగా కప్పువేసిపోయాడు. కాస్త భోగట్టా రాబట్టటం మంచిదెలాగయినా !"

నిభానని నీళ్ళబిందె తపీమని గట్టుమీద ఓప్రక్క పెట్టేసి "ఈ వీధిలో అతడి మేలు కోరేవారికేం తక్కువ లేనప్పుడు భోగట్టా తెలుసు కోనే లేకపోతారా ? మా స్తోమతకి మించి చెయ్యమంటే ఏం చెయ్యగలం మేమింకా ?" అన్నది.

ఇంతలో మరొక ఆమె ఇంకో ప్రశ్న బాణం విసిరింది.

"అప్పునమ్మా! అసలు బావమరదు లిద్దరికీ మధ్య తగాదా ఎందుకు వచ్చింది? అవి యింకా పరిష్కారమయి పోనేలేదా యేం?"

ఇరుగు పొరుగువారి కుతూహలం ఇగిరిపోవటమంటూ వుండదు. ఆరు మాసాలు ఎండ, గాలివానవల్లకూడా మ్లానమయిపోదు. ఒకదానిమీద ఒకటి రాత్రింబగళ్ళు పొరలుపడుతున్నా అణగిపోదు.

ఘోషాల్‌గారింటి రక్తపాతం, గాధ పలాయనంగాధ స్పష్టంగా తెలుసుకోవాలనే ఆసక్తి వారికి సన్నగిలటం అంటూ లేదు. ఎందుకు సన్నగిలుతుం దసలు? గౌరాంగ్ తిరిగి వచ్చేంతవరకు వాళ్ళ కుతూహలం చల్లబడే అవకాశం కన్పించటంలేదు.

మనస్సులో దిగులువల్ల పెత్తనాలకి వెళ్ళటం మానేసింది సుధ. ఎప్పుడుపడితే అప్పుడు గుడివాకిట్లో కెళ్ళి కూచోవటం తగ్గించిందినిభానని.

* * *

నిభానని వెళ్ళిపోయి నీలాంటిరేవు వారింటి విషయాల చర్చలో నిండిపోయింది. చాలారోజులకి నిస్తరుగలగావున్న నీటిలో రాయివచ్చి పడింది. దానివల్ల ఏర్పడిన తరంగాలను అరికట్టటానికి ఎవరికీ మనసొప్పటంలేదు.

వారిదిమాత్రం తప్పేముంది?

ఇక్కడ అసలెప్పుడూ ఎలాంటి సంఘటనలూ జరగనే జరగవు. బారసాలలు, పెళ్ళిళ్ళు, చావులు ఇవన్నీ అతి సామాన్యులయిన సాంసారిక సంఘటనలు. వీటిల్లో ఉత్సాహోద్దీపకమైన విషయం ఒకటే ఒకటి ఎవరి యింటికి అయినా కళంకం వచ్చిపడటం. అది అగ్నిశిఖలాగా ఒకరి నోటినుంచి మరొకరి నోటికి ప్రాకుతుంది. ఆ వేడివల్ల చచ్చుగా మాట్లాడే వారికికూడా చమత్కారం వచ్చిపడుతుంది. ఆ ప్రసక్తి మందమతులకుకూడా చురుకుతనాన్ని కల్గిస్తుంది. అదీకాక నిభాననిని పనివేళా పిలిచి అడగటంలో మాత్రం తక్కువ ఆనందం వుందా? ఒకవ్యక్తిని కించపరచగలిగితే అంతకంటె ఆనందకమయినది ఇంకేముంటుంది?

* * *

ఇంటికి రాగానే బాదల్ వసారాలో చాపవేసుకుని హరికేన్ లాంతరు పెట్టుకుని చదువుకోటానికి కూర్చుంటాడు. చదువుమీద అతడికి ఎక్కడలేని ఆసక్తి. మనస్సు ఎంత బాగుండకపోయినా చదువు విషయం మాత్రం అశ్రద్ధచెయ్యడు. అప్పుడప్పుడు ఊరికే కళ్ళవెంబడి మాత్రం నీళ్ళు వస్తుంటాయి. అప్పుడిహ తల పైకెత్తి ఎదురుగా అడవిలా వున్న చెట్ల తలలకేసి చీకటిగావున్న మెల్లాకేసి శూన్యదృష్టితో చూస్తూ కూచుంటాడు.

ఒక్కొక్కప్పుడు పుస్తకం మూసిపెట్టేసి, చీకటికి మరింత దగ్గరగా జరిగి, కాళ్ళు చాచుకుని కూచుంటూ వుంటాడు.

కుర్రవాడలాంటప్పుడు ఏ మాలోచించుకుంటూ ఉంటాడో ఎవరికి తెలుసు ? ఓవేళ తండ్రి సంగతులే అయివుండొచ్చు; అవి కాకపోయినా కాకపోవచ్చు.

తండ్రి వున్నన్నాళ్ళూ బాదల్ ఎన్నిసంగతులు మాట్లాడేవాడు తండ్రితో ! కాని ఆశ్చర్యం! ఒంటరిగా కూర్చుంటే ఆ మాటల్లో ఒక్కటైనా గుర్తుకురా వెందుకని ? జ్ఞాపకంవస్తే 'సోనాడాంగా' నుంచి తిరిగి వచ్చేప్పుడు ఎద్దుబండిలో కూర్చుని, తండ్రి పరిహాసోద్దీపితమైన ముఖంతో తనని ఉడికించటానికి అన్న మాటలే జ్ఞాపకం వస్తూ వుంటాయి.

"బాదల్ ! నీకిప్పుడు కొత్త పిన్నిదగ్గిర వుండాలనిపిస్తోంది. కడుపునిండా రసగుల్లాలు తింటూ వుండొచ్చు. జరీఅంచు పంచెలు కట్టుకోవచ్చు. సిల్కుచొక్కాలు తొడుక్కోవచ్చు. కాదురా ?" బాదల్‌ని తీసుకువెళ్ళటానికి క్రొత్తపిన్ని ఓసారి మనిషిని పంపించిందిట ! బాదల్ చూడలేదు. బళ్ళోంచి వచ్చాక విన్నాడు. అమ్మమ్మ ఆ వచ్చిన వ్యక్తిని అప్పుడే తరిమేసిందిట !

కొత్త పిన్నిని కలుసుకోవటం పడినట్లయితే నాన్నని వెతకటానికి ఉపాయమేమైనా దొరికేదేమో ఏం తెలుసు ? వాళ్లు చాలా గొప్పవాళ్లట, గొప్పవాళ్ళంటే కావలసినంత డబ్బు వుందిట వాళ్ళకి. డబ్బుకనుక

వుంటే ప్రపంచంలోవున్న వస్తువులనన్నీ తనవిగా చేసుకోవచ్చు అన్న సంగతి లోకపరిజ్ఞానంలేని కుర్రవాడికి కూడా తెలుసు.

* * *

వాసంతి వెనుకనుంచి వచ్చి తల నిమురుతూ"రా బాదల్. అన్నం తిందువుగాని రా !" అన్నది.

ఆకస్మిక స్పర్శకి బాదల్ ఒక్కసారి గతుక్కుమన్నాడు. తరువాత నిశ్చల భావంతో - "ఇప్పుడు తినను. తర్వాత తింటాను" అన్నాడు.

"అమ్మో ! ఇంకా ఎంతసేపయాక తింటావ్ ? చిన్న పిల్లాడివి. చిన్నపిల్లలు రాత్రి మరీ ప్రొద్దుపోయాక తింటే - లోలోగా కడుపులో ఎలుకలు దూరుతాయ్. తెలుసా?"

"అవన్నీ నువు కల్పించిన మాటలు" బాదల్ ఉంగమొహం పెట్టి అన్నాడు.

"సరే, కల్పించిన వయితే—కల్పించినవే అనుకో. నిజంగా ఎలుకలు దూరినప్పుడు తెలుస్తుంది తమాషా."

"తింటే—మరి తిన్నాక కథ చెపుతావా? క్రొత్తకథ"

"అరే. క్రొత్తకథలు ఎక్కడినుంచి తీసుకురానురా ! నా కథలన్నీ పాతకథలయి పోయాయిగా!"

వాసంతి చిరునవ్వుతో అన్నది.

"అన్నీ పాతవే అయిపోయాయా? అ—న్నీ?"

"ఆఁ, అన్నీ"

"నాన్న చాలా క్రొత్తకథలు నేర్చుకుని వస్తాడు—కాదు అత్తా? ఇన్ని రోజులు - ఎన్నెన్ని క్రొత్త క్రొత్త ఊళ్ళకి వెళ్ళి ఉంటాడో - ఎంతమంది క్రొత్తవాళ్ళతో స్నేహము చేస్తుంటాడో - కాదు అత్తా?"

"ఎందుకుకాదు—?"

"పెదనాన్నగారు అంటున్నారు-నాన్న రాగానే తిరతాట్ట ఆయన"

"అమాటే నేనూ అంటాను. గట్టిగా తిడతాను."

బాదల్ ఇంకేమీ మాట్లాడకుండా తల వంచుకుని అన్నంముందు కూర్చున్నాడు. నాన్నవస్తే తిడతామని అందరూ అంటున్నారు. ఆశ్చర్యం! వాళ్ళ మనస్సుల్లోని ఆలోచనలు బాదల్‌కి ఏం అర్థమవుతాయి? ఎన్నోరోజులు ఎదురుచూడగా, చూడగా ఎలాగోవస్తే చివరికి ఆ వచ్చినాళ్ళ కాళ్ళమీద పడి, పాదధూళి తీసుకోవాలనిపిస్తుంది. కాని అలాంటి వాణ్ని పట్టుకుని ఎలా తిట్టగలుగుతారు? బాదల్‌కి అన్నీ ఆశ్చర్యంగానే కన్పించాయి.

* * *

బాసుల్‌పూర్ పోలీసుస్టేషన్‌కి ఓ వ్యక్తి వచ్చి "ఇన్‌స్పెక్టరుగారిని కలుసుకోవాలి, ఇన్‌స్పెక్టరుగారిని కలుసుకోవాలి" అంటూ ఒకటే గొడవ చేస్తున్నాడు.

అతడికి కాళ్ళకి చెప్పులులేవు. జుట్టు రేగిపోయివుంది. కట్టుకున్న పంచె, తొడుక్కున్న చొక్కా కూడా చిరిగిపోయి వున్నాయి. గేట్‌లో పహరావుండే పోలీసులు అతణ్ణి ఏ విధంగానూ అక్కడినుంచి బయటికి పంపలేకపోతున్నారు. అతడికేమయినాసరే ఇన్‌స్పెక్టరుగారు కావాలట!

పోలీసుస్టేషన్ అంటే పెద్ద స్టేషనేంకాదు. ఓ చిన్న షెడ్‌లా వుంది. ఇన్‌చార్జ్ గోవర్ధన్ గడాయీ అందులోనే ఓవైపున డిటెక్టివ్ నవల ఒకటి చదువుతుంటూ కూర్చున్నాడు. బయటగోల చెవిని పడటంతో విసుగ్గా "ఎవరు అక్కడ?" అని అరిచాడు.

బంట్రోతు 'దుకడీదాస్' ఆ గొడవ జరుగుతున్న చోటునుంచే వచ్చాడు. అతడు నిర్లక్ష్యంగా "అదేమీ లేదండీ! ఓ పిచ్చివాడువచ్చి మొండికేసుకు కూర్చున్నాడు" అని చెప్పాడు.

"రెండుతన్ని పంపించెయ్యమను. వెళ్ళు"

"చిత్తం. అంత పిచ్చివాడుగానూ లేడు హుజూర్! గౌరవ కుటుంబంలోని వాడిలా వున్నాడు"

"పిచ్చివాడు - కాని, అంత పిచ్చివాడు కాదు. అదేం మాటో యెందుకండీ?"

"అదే అదే హుజూర్!" అని తల గోక్కోవడం మొదలెట్టాడు.

"ఏమంటా డతడు?"

"తమర్ని కలుసుకోవాలంటాడు"

గోవర్ధన్ చాలా సేపటినుంచి __ పీనుకాలు తలమీద అలుక్కుపోయినట్లు అచ్చుఅయిన డిటెక్టివ్ నవల చదివి చదివి అలసిపోయినట్లున్నాడు. అంచేత ఈ కొత్త ఆలోచనతో మళ్ళీ తేరుకుని కూర్చున్నాడు.

"నన్ను కలుసుకోవాలంటున్నాడా. నిజమే! అతని పట్టుదలకేమీ తక్కువలేదల్లే వుందే! అయినా ఏం చెపుతాడో అడుగువెళ్ళి"

దుకడి తిరిగివచ్చి - "మీదగ్గిర ఓ మహజరు పెట్టుకోవాలిట. దయవుంచి అతణ్ని లోపలికి రావటానికి అనుమతి యిప్పించండి" అన్నాడు.

"సరే, పట్టుకురా చూద్దాం"

'తీసుకురా' అంటే చెయ్యిపుచ్చుకుని తీసుకు రావటం వాళ్ళ రివాజు అయినప్పుడు పట్టుకురా అన్నప్పుడు నెట్టుకుంటూ తీసుకురావటంలో విచిత్రం యేముంది? ఆ పిచ్చివాడు చేతులు జోడించి "తోస్తారెందుకు భాయీ! నా అంతట నేనే వస్తూంటే?" అంటున్నకొద్దీ దుకడీ త్రోస్తూనే వున్నాడు.

గోవర్ధన్ గడాయ్ టేబిల్‌మీద కాళ్ళు పెట్టుకుని సిద్ధంగానే వున్నాడు. అతణ్ణి చూడగానే నోట్లో బీడీ తీసి పట్టుకుని "గొడవ చేస్తున్నావ్ట, దేనికి?" అని అడిగాడు అతిగంభీరంగా.

"చిత్తం, నేనేమీ గొడవచెయ్యలేదు. గొడవ చేస్తున్నది మీ చాకిదారులే"

"నిజం?"

"అవును ఇన్‌స్పెక్టరుగారూ! ఒక్కమాటతో మిమ్మల్ని కలుసుకో నిచ్చినట్లయితే తీరిపోయేది"

"హూం. నన్ను కలుసుకోవాల్సిన అవసరమేమిటోయ్! ఏమిటి నీకు కావాల్సింది?"

అతడు కొంచెం గుటకలుమింగుతూ "చిత్తం. ఉరికి పంపటం సార్!" అన్నాడు.

దుకడీ యజమాని మర్యాద కాపాడటానికి బిగ్గరగా నవ్వటానికి బదులు ముఖం ప్రక్కకి తిప్పుకుని నవ్వుకున్నాడు. ఇహపోతే యజమాని గోవర్ధన్ మాత్రం హహహ అంటూ బిగ్గరగా నవ్వాడు.

అతడు తెల్లబోతూ ఆ నవ్వుకి కదలిపోతున్న ఇన్‌స్పెక్టరు బొజ్జకేసి చూస్తూ వున్నాడల్లే వుంది. కాస్త ఆ కదలిక ఆగింది. "ఈ జబ్బు ఎన్నాళ్ళనుంచి పట్టుకుందోయ్?" అని అడిగాడు ఇన్‌స్పెక్టరు.

"ఏమిటి? ఏమన్నారు?"

"అదే, ఈ మతిచెడి ఎన్నాళ్ళయింది అని అడుగుతున్నా"

"విశ్వసించండి యిన్‌స్పెక్టరుగారూ! మతిచెడటం కాదు. అంతకంటె మనస్సు చెడిందనండి. నేను ఖూనీ చేశాను హుజూర్. నా కంఠానికి ఉరి వేయించమని నా ప్రార్థన."

ఇన్‌స్పెక్టరు అతణ్ని పూర్తిగా పిచ్చివాణ్నిగా భావించి, ముసిముసి నవ్వులు నవ్వి ..."నీ ప్రార్థన చెడ్డదేమీకాదు. పైగా ఇంట రెస్టింగ్‌గావుంది. అరే దుకడీ! ఇతణ్ని తీసుకెళ్ళి వ్రేలాడతియ్. బ్రాహ్మడి ముచ్చట తీరుతుంది" అన్నాడు.

"ఆహూం. మీరు దయవుంచి నామాట వినండి. ఆచండీ ఉత్సవాలప్పుడు నేను ఖూనీ చేశాను. అప్పుడేవో గుబులు దొర్లి పారిపోవటం మొదలెట్టాను. కాని ఇంక అది నావల్ల కాదు హుజూర్. పారిపోయి, పారిపోయి....జీవితంమీద అసహ్యం పుట్టింది. కళ్ళు మూసుకుంటే రక్తం కన్పిస్తుంది. ఉరితప్ప నాకు విముక్తిమార్గం లేదు"

గోవర్ధన్‌గడాయీ – కొంచెం ఆలోచనలో పడ్డాడో యేమో —

కొంచెం గంభీరంగా - "హూం. ఖూనీ యెక్కడ చేశావ్ ?" అని అడిగాడు.

"చిత్తం. ఇక్కడే. ఈ జాసుల్‌పూర్‌లోనే"

"జాసుల్‌పూర్‌లోనా ? ఉఫ్ . నా యిలాకాలో ఖూనీ జరిగింది. నేను మాత్రం కనిపెట్టలేకపోయానా ? వెళ్ళు, వెళ్ళు. అట్టే వేధించకు"

తన మర్యాద తాను నిలుపుకుంటూ అన్నాడు ఇన్‌స్పెక్టరు.

ఆ పిచ్చివాడు కాసేపు గంతులవీ వేస్తాడేమో అనుకున్నాడు ఇన్‌స్పెక్టరు. కాని అలాంటి ధోరణియేమీ కన్పించలేదు. అతడు చూస్తే పూర్తిగా పిచ్చివాడుగానూ లేడు.

"మీరు దయతలచకపోతే నేను ఆత్మహత్య చేసుకోవలసివస్తుంది ఇన్‌స్పెక్టరుగారూ ! త్వరగా నాకు ఉరిపడే యేర్పాటేదో చెయ్యండి"

"ఉస్ ! హచెడ్డ వేధించేస్తున్నావే ? నీపేరేమిటీ అన్నావ్ ?"

"పేరు ! నాపేరు ! ఓ ! నాపేరు గౌరాంగప్రసాద భట్టాచార్య"

ఏదో విస్మృతి గహ్వరంలోంచి పేరుని వెలికి తీసుకువచ్చినట్లున్నాడు గౌరాంగ్.

"నిజమే. భలే మంచిపేరేనే ! హఠాత్తుగా ఖూనీ చెయ్యాలనే సరదా యెందుకు పుట్టిందోయ్ ?"

అతడు నిశ్శబ్దంగా చేతులురెండూ యెత్తి జోడించాడు. గోవర్ధన్ గడాయ్ కాలుతున్న బీడీని ఓగట్టి దమ్ము లాగి "ఖూనీ ! హూం ! మా ఠాణాయిలాకాలో ఖూనీ జరిగింది. నేమాత్రం కనుక్కోలేకపోయాను. గోవర్ధన్ గడాయీ కళ్ళు మూసుకుని వుండే పిల్లికాదోయ్ ! గాండ్రించే పులి ! ఈ ఇలాకాలోని ప్రతి సంగతీ గడాయీ గోటిచివర వుంటుంది తెలుసా ?" అన్నాడు.

"ఈ విషయాన్ని దాచిపెట్టి వుంచొచ్చు.ఈ ఊళ్ళోవుండే శశిధర్ ఘోషాల్‌ని హత్యచేసి పరారీ అయినాను నేను"

గోవర్ధన్ ఠఃసారి నిటారుగా కూర్చున్నాడు. కళ్ళలో ముఖంలో

వెటకారాన్ని వ్యక్తంచేస్తూ "ఏమిటి? పేరేమిటన్నావ్? శశిధర్ ఘోషాల్?" అన్నాడు.

హఠాత్తుగా నేరస్థుడి స్థైర్యం సడలిపోయిందొక్కసారి. బావురుమని యేడుస్తూ "అతడు నాకు అన్నగారిలా వుండేవాడు ఇన్స్పెక్టరుగారూ! నాకు తిండి బట్ట యిస్తూ ఆశ్రయమిచ్చాడు. దానికి నేనుఅతణ్ణి-ఈ అసహ్య జీవితాన్ని గడపటం యింక ఇష్టంలేదు ఇన్స్పెక్టరుగారూ?" అన్నాడు.

గోవర్ధన్‌కి కొంచెం జాలివేసినట్లుంది. అంచేత వెటకారం మాని "ఇదుగో, చూడుబాబూ! నీకు నేను మంచి సలహా చెపుతా విను. ఎవరి దగ్గరకైనా ఓమంచి ఆయుర్వేద వైద్యుడు దగ్గిరకి వెళ్ళు. కొంచెం మందు అదీ యేదయినా తీసుకో. ఏ కారణంవల్లనో ఏమో! నీ బుర్ర బాగా వేడెక్కిపోయింది" అన్నాడు.

"హే భగవాన్! నేనెట్లా నమ్మించేది ఈయన్ని?" గౌరాంగ్ చటుక్కున తొట్రుపడుతూ "నాకు సాక్షులున్నారు హుజూర్! రండి వారి దగ్గిరకి" అన్నాడు.

—ఓ! సాక్షులనీ వాళ్ళనీ సిద్ధంగా ఉంచుకుని ఖూనీ చేశానని చెప్పు. దుకడీ: మీదగ్గిర కొబ్బరిబొండాలు ఏమీ లేవూ!"

"చిత్తం, అదేంమాట! ఇప్పుడే తీసుకొస్తాను. లేతవా కొబ్బరి పట్టినవా హుజూర్?"

"అహఁ హఁ. నాకు కాదు, నాకు కాదు. అతడికివ్వమంటున్నాను" అంటే ఇదొక విధమైన ఉదాత్తస్థాయి వ్యంగ్యం.

గౌరాంగ్ కింక విసుగేసిపోయింది అతడు కోపంతో "కొబ్బరి నీళ్ళు తాగించి పల్లబడేట్లు చేయనక్కర్లేదు నన్ను. నేను పిచ్చివాణ్ణి కాను. తెలుసు....తెలుసు....ఇన్స్పెక్టరుగారి పరాక్రమం ఎవరికీ తెలియనిదికాదు. ముక్కుల్లో కాస్త ఆవనూనె వేసుకుని నిద్దరోతేసరి. పది ఖూనీలు జరిగితే మాత్రం ఎవరు చూడొచ్చేది?" అన్నాడు

"నోర్ముయ్ జాగ్రత్త!"

పౌరుషంగల సింహం గర్జించింది.

"జాగ్రత్తా! భయమెందుకు మహాశయా! భయమెందుకు? ఉరి కంటె మించిన శిక్ష లేదు. దాన్నే స్వయంగా కోరుకుంటున్న వాడిని — మళ్ళీ యింకా భయపెట్టటం దేనికి? రండి స్టేషనుమాష్టరుగారి దగ్గిరకి, మాష్టరుగారు సాక్ష్యమున్నారు."

దుకడీకి ఒకకాలు కుంటి. "వెతికి తీసుకురానా హుజూర్?" అని అడిగాడు.

"ఎవర్ని?"

"స్టేషను మాష్టర్ని"

"డ్యూటీలో వుండడూ?"

"డ్యూటీ!" దుకడీ నిర్లక్ష్యంగా - "ముసలివాడికి కునికిపాట్లు పడటమేగా డ్యూటీ! అప్పు డప్పుడు ఓ కుర్రవాడి చెయ్యిపుచ్చుకుని తిరుగుతూ కన్పిస్తూంటాడు" అన్నాడు.

దుకడీ యిల్లు స్టేషన్ ప్రక్కనే.

చిన్న పిల్లాడు.

గౌరాంగ్ కళ్ళు రెండూ విస్ఫారితాలయినాయి. కచ్చితంగా బాదలే. 'హే! పరమేశ్వరా! ఎంత పొరపాటు చేశాడు తాను. ఒకసారి వాళ్ళని దూరంగా చాటునుండి చూడకుండా ఎందుకు వచ్చాడు తాను! 'మాష్టర్‌దా! మీ కోరికను నిలబెట్టలేకపోయాను. నన్ను క్షమించండి' అని చెప్పి ఎందుకురాలేదు తాను.

ఇలా బ్రతికి వుండటం అసంభవం. ఈ బ్రతుకుకి గుడ్డిగవ్వంతయినా విలువలేదు. కాని ఎంత తెలివితక్కువ పని చేశాడు తాను. ఓసారి ఎందుకు చూసిరాలా వాళ్ళని? తాను ఎక్కడినుంచి వచ్చిందీ ఎవరికి తెలుసు? సరాసరి రైలుదారిని మాత్రంకాదు. ఎక్కడో ఏ గ్రామం నుంచో నడిచి, కాలువలూ, కందకాలూ దాటుకుంటూ వీళ్ళు. అడవులూ దాటి వచ్చాడు. నడిచివస్తూ దారిలో యెవరు కనపడితే వాళ్ళని 'బాసుల్

పూర్ పోలీస్టేషన్ ఎటువైపున బాబూ! బాసుల్‌పూర్ పోలీసుస్టేషన్'అని అడుగుతూ వచ్చాడు.

• • • •

గోవర్ధన్ గడాయీ "గట్టిచిక్కులోనే పెట్టాడే! ఏమో ఏదైనా అఘాయిత్యం చేసేవచ్చాదేమో ఓవేళ? అంచేతనే బుర్ర చెడిపోయిం దేమో! ఎవరికి తెలుసు? దుకడీగాడు సాక్ష్యమున్నాడు పైగా - ఈ కేసునికనుక త్రోసిపుచ్చితే రపీమనిపోయి పైవాళ్ళ చెవిలో ఊదేస్తాడు. ఒట్టి గుడ్లగూబ వెధవ. వీలుచిక్కిందంటే అసలు వాళ్ళని వదిలేసి పై వాళ్ళనిపోయి పట్టుకునే గడ్డితినే స్వభావం మొదట్నుంచీ వాడిది" అని ఆలోచించాడు.

తర్వాత ఓవేళ ఎక్కడైనా ఆచూకీకనుక బయటపడితే అప్పుడు? ఎంతచెడ్డా పిచ్చివాడి విషయంలోకూడా ప్రభుత్వోద్యోగాన్ని నిర్వ హిస్తున్న వాడికి ఒక పిధమైన బాధ్యత వుందికదా!

గత్యంతరంలేక గోవర్ధన గడాయీ కన్ను గీటుతూ "వెళ్ళు, స్టేషన్ మాష్టర్ని తీసుకురా!" అని ఆదేశించాడు దుకడీని.

"చిత్తం. ఏమనిచెప్పి తీసుకురాను?"

"'సాక్ష్యం యివ్వాలి. ఇన్‌స్పెక్టరుగారి ఆజ్ఞ' అని చెప్పు - వెళ్ళు"

• • • •

అమాయకుడైన స్టేషన్‌మాష్టరు తొట్రుపడుతూ "స్టేషను విడిచి పెట్టి వచ్చేందు కనుమతిలేదు భాయీ! డ్యూటీలోవున్నా నిప్పుడు" అన్నాడు.

"ఇనస్పెక్టరుగారి హుకుం. వచ్చితీరాస్సిందే మాష్టరుగారూ!" అన్నాడు దుకడీ.

"సరే"

స్టేషనుమాష్టరు గొడుగు చంకనపెట్టుకుని కంగారుగా అడుగులు ముందుకు వేయసాగాడు.

"అంత మరీ కాళ్ళు ఈడ్చుకుంటూ నడవకండి మాష్టరుగారూ!" అంటూ దుకడీ కేకేశాడు.

"వస్తున్నా భాయీ! వస్తున్నా. కాని అసలింతకీ సంగతేమిటో చెప్పు దుకడీ! దేనికి సాక్ష్యం? నాకేం అర్థంకాకుండా వుంది"

"అర్థమవక్కర్లేదు మాష్టరుగారూ! ఓ పిచ్చివాడి పాలపడి ఇనస్పెక్టరుగారు ఇప్పుడు తెలుసుకున్నారు చిక్కులోపడ్డట్లు. ఆ ముద్దాయే వచ్చి "నేను ఖూనీ చేశాను. నాకు ఉరి వెయ్యండి" అని అడుగుతున్నాడు.

నడుస్తూ నడుస్తూ వున్నవాడల్లా గతుక్కుమని ఆగాడు మాష్టరుగారు. విస్మయ విస్ఫారిత నేత్రాలతో "ఈమాట అన్నాడా? ఎలావున్నాడతడు?" అని అడిగాడు.

"పిచ్చి పిచ్చిగా వున్నాడు. అంతకంటె ఇంకెలా వుంటాడు? కాలు సాగించండి మాష్టరుగారూ. మా ఇన్‌స్పెక్టరుగారు అలాంటివాడు - ఇలాంటివాడు కారు. రెండు తన్ని పంపించివేసేవారే....కాని అలా చెయ్యలేదు. అతడు చెప్పిందంతా సవిస్తరంగా విన్నారు కూర్చుని. అతడు ఖూనీచేశాట్ట—స్టేషన్‌మాష్టరు సాక్షిట. ఇదీ విషయం. హత్య చేసిందెవర్నో తెలుసు నా పైగా? శశిధర్ ఘోషాల్‌నిట! అతడు రెండుపూటలా ఆఫీసుకివెళ్ళి వస్తున్నాడు. ఏమిటి మీరిలా ఇదవుతున్నారేమిటి?"

"ఇదవటం ఏమిటి? అహఁ హఁ. ఏమీ అవటంలేదుభాయీ! ఏమీ అవటంలేదు. పద, ఎక్కడికి వెళ్ళాలో తీసుకువెడుదువుగాని పద దుకడీ."

• • • •

అర్ధరాత్రి చీకట్లో - రక్తసిక్తుడైన శశిధర్, ఏడుస్తున్న తన తల్లి, చెల్లెళ్ళ ముఖాలమీదికి యవనిక దింపేసి, ఏ గదిలోంచి అయితే వెళ్ళిపోయాడో - మళ్ళీ ఆగది యవనిక ఒక వైశాఖమాసపు అపరాహ్ణవేళ - పైకిపోవటం కన్పించింది.

తోటవైపు ఆ అభిశప్త ద్వారం తలుపులు తెరిచే వున్నాయి. తలుపులు తీసి వుండటంతో ఆ అపరాహ్ణ సమయపు గాలి - గదిలోని వస్తువులన్నిటినీ అస్తవ్యస్తం చేసేస్తోంది.

గుమ్మం దగ్గరే మెదలకుండా కూర్చుని వున్నాడు శశిధర్ - గాలికి ఊగిసలాడుతున్న ఓ వేపచెట్టు చిటారుకొమ్మలకేసి చూస్తూ....

రెండుమాసాలు మంచంమెక్కాడు శశిధర్. అప్పుడు రోజూ గంటలకొద్ది సమయం యిలాగే చూస్తూ గడిపేవాడు – వాసంతి వంటింట్లోనో, నీలాటి రేవుల్లోనో ఉండేసమయాల్లో.

పక్కమీద అలా పడుకునివుండే శశిధర్ కిటికీలోంచి కన్పిస్తున్న రవంత ఆకాశాన్ని, ఈ వేపచెట్టుని చూస్తున్నాడు.

అప్పుడు ఈ చెట్టుకి లతకళ వుండేదికాదు, ఇంత నిండుతనం వుండేదికాదు. ఆకులన్నీ పూర్తిగా రాలిపోయాయి. ఆకులు రాలిపోయిన ఆ బోసికొమ్మలు, ఆకాశంవైపు చేతులు చాచి, ఎవరివద్దనో ఏదో భిక్ష నర్థిస్తున్నట్లుండేది.

ఏమిటా భిక్ష ?

అది ఈ 'ప్రాణరస'మేనా ? సమస్తమైన తిక్తతని శోషితంచేసి వేపలోని చేదుసకూడా ఆస్వాదింప చేయగలిగిన ప్రాణరసం అసు క్షణమూ సిల్కుగుడ్డల పీలికల్లాంటి చివురుటాకుల కదలికలు ఈ పసుపు ఆకుపచ్చరంగుల తళతళలు ఇవన్నీ అప్పుడు ఎక్కడ వుండేవి ! ఈ ప్రాణరసాన్ని చిందింపచేసిందెవరు ? ఎండి మోడులైపోయిన కొమ్మలకి కొత్త చైతన్య స్పందనని సమకూర్చిందెవరు ?

ఇంటా బయటా అందరూకూడా శశిధర్ ఆస్థితినుంచి బ్రతికి బయటపడటాన్ని 'పునర్జన్మ'గా భావించారు. తగిలిన గాయం చిన్నదేమీ కాదు. పైకి ఎత్తిన పదునైన కత్తి జారి క్రింద నేలమీద పడటానికి బదులు అతడి మెడమీదనే పడింది.

ఎన్నాళ్ళు అతడు స్పృహలేకుండా పడి వుండవలసివచ్చిందో సరీగ్గా జ్ఞాపకంలేదు. కాని ఇదిమాత్రం జ్ఞాపకం వుంది. మళ్ళీ స్పృహ రాగానే మొట్టమొదట అతడికి తనమీద తనకే అసహ్యం వేసింది.

ఆశ్చర్యం ! వాసంతిమీద అసహ్యం వేయలేదు. కోపమూ,

ద్వేషమూ కలగలేదు. పరారి అయిన అభాగ్యుడిమీద. సిగ్గుతో, పశ్చాత్తాపంతో మనస్సేమిటో మొద్దువారిపోయింది. ఆ స్తబ్ధత మాటునుంచి ఏదో 'ఛీ ఛీ' అన్న అనుచ్చరిత ధ్వని లీలగా వినిపించసాగింది.

పునర్జన్మ కాదు నవజన్మ.

లేకపోతే శశిధర్ కింత ఆలోచనాశక్తి యెక్కడినుంచి వచ్చింది? ఇంత గంభీరుడెలా అవగలిగా డతడు? పక్కమీద పడుకుని అదేపనిగా ఆలోచిస్తూ వుండటం వల్లనా? లేక కిటికీలోంచి నిర్విరామంగా అతని ముఖంమీద ప్రసన్నదృష్టిని పరపుతూవున్న ఆకాశమే అతడి మనస్సు కింత ఉదారతని కూడా చేకూర్చకలిగిందా?

మంచంలో పడుకుని. శశిధర్ నూతన దృష్టితో చూశాడు వాసంతిని. అహం. ఆమెని కొత్తగా పొందగలిగి వుంటాడు.

కళ్ళు తెరవగానే వేదనాహతమైన ఒక ఉద్విగ్నముఖం అతడి కంటపడింది.ఆ ఉద్విగ్నముఖం అతి శ్రద్ధగా చేస్తున్న సేవా-శుశ్రూషలు చూశాడు. ఆ ముఖం దేవీముఖంలాగా ఆనాన ఆమె హృదయపూర్వకమైన అర్ఘ్యంలాగానూ తోచింది.

అహం. ఇహ భ్రాంతిపడడు శశిధర్.

• • •

శశిధర్, వాసంతి ఇలాంటి వారందరూ అల్పశిక్షితులూ, అశిక్షితులూ అయిన స్త్రీ పురుషులు వీరి జీవితాల్లో చెప్పలేనన్ని పొరపాట్లు వీరికి చదువులేదు, తెలివిలేదు. మనస్సులోని భావాన్ని స్పష్టంగా స్వచ్ఛమైన భాషలో చెప్పగల శిక్షణలేదు. తమ హృదయ రహస్యాన్ని చక్కగా తర్జన భర్జన చేసుకుని చూసుకునే ఓర్పులేదు. అయినా విధాత ప్రసాదించిన ఒక సంపదనుంచి వారు వంచితులు కాదు. అనుభవ దారిద్ర్యమేమీ లేదు వారికి.

ఆ అనుభూతుల్ని నాకు బహుశా మాటల్లో వ్యక్తం చెయ్యలేకపోవచ్చు. బహుశా ఆ వ్యక్తంచేసే తీరు బలంగా లేకపోవచ్చు. శిక్షితమైన సమాజం యెదుట అది హాస్యకరం కావొచ్చు. అయినా వారి జీవితాల్లో దాని విలువ తక్కువదికాదు వారు ఊహించటం తమ ధోరణిలోనే ఊహిస్తారు విశేషం.కాని పదేపదే. ఏమీ తక్కువపడరు మళ్ళీ.

దీర్ఘాలోచనలో మునిగినప్పుడు, మనస్సు బరువెక్కినప్పుడు అప్పుడు వాళ్ళకికూడా వైశాఖమాసంలో అపరాహ్ణవేళ క్రొత్తగా చిగిర్చివుండే పచ్చని - ఆకుపచ్చని వేపచెట్టు రెమ్మలకేసి చూస్తూ వుండటం ఆహ్లాదంగానే వుంటుంది. సిల్కుపీలికల్లా నిగనిగలాడే చిగురుటాకుల్ని నిర్లిప్తంగా చూస్తూ వుండటం ఎంతో బావుంటుంది మనస్సుకి.

• • • •

ఆనాడు వైశాఖ పూర్ణిమేమో!

ఆలయంలో సత్యనారాయణస్వామి పూజ. చాలారోజులకి మళ్ళీ నిభానని కూతుర్ని వెంటపెట్టుకుని ఆలయానికి వెళ్ళింది. భర్త ప్రత్యాగమనాన్ని వాంఛిస్తూ ఆమెచేత మ్రొక్కింపచేయటానికేమో!

'కళావతీ' ఉపాఖ్యానంతో సుధ అదృష్టానికి సంబంధం యేమయినా వుంటే! అల్లుణ్ణి నిభానని సరీగ్గా చూడలేదు నిజమే. కాని అతడు హీనంగా ప్రవర్తించటం సంభవం కాదన్న జ్ఞానం నిభాననికి వుంది.

కాని ఇప్పుడు దిగులల్లా ఆ అభాజనుడు పారిపోయి ఆత్మహత్య చేసుకున్నాడేమోనని, తన కూతురు బ్రతుకు బండలై పోతుందే అన్న దిగులు పట్టుకుందామెకి. అంచేత కూతురిచేత ఉపవాసం చేయించి, ఆమెని ఆలయంలో మ్రొక్కించటానికి తీసుకువెళ్ళింది.

బాదల్‌నికూడా వెంట తీసుకురావటానికి వీల్లేకపోయింది. సాయంత్రం కాగానే స్టేషన్‌కి వెళ్ళాలతడు. ఇంట్లో ఏమీ మాట్లాడడు బాదల్. బాదల్ ఏ దురాశతో రోజూ స్టేషన్‌కి వెడుతున్నదీ ఎంత నిరాశతో ముఖం చిన్నపుచ్చుకుని యింటికి వచ్చి ఎవరితో మాట్లాడకుండా పుస్తకం తీసుకు కూర్చుంటూ వుండేదీ ఇంట్లో అందరికీ తెలుసు.

బాదల్ దుఃఖాన్ని చూస్తూంటే మధ్య మధ్య కఠిన హృదయురాలైన నిభాననికి కూడా గుండెలు విచ్చిపోయేవి.

• • • •

త్వరత్వరగా అతిముఖ్యమయిన గృహకృత్యాలు ముగించుకుని వాసంతి గదిలోకి వచ్చింది. కాసేపు మెదలకుండా శశిధర్ వెనుకవైపున నుంచుని "ఏమిటి అంత దిగాలుపడి ఆలోచిస్తున్నారు?" అని అడిగింది.

శశిధర్ గతుక్కుమని చూశాడు. వాసంతి రావటం అతడు గమనించలేదు తర్వాత "ఆ అభాగ్యుడి సంగతే ఆలోచిస్తున్నాను.ఆ గుబులు రాయుడు ఓవేళ ఎక్కడైనా ఏట్లో దూకాడేమో !" అన్నాడు.

'దుర్గా ! దుర్గా !' వాసంతి దిగులుగా "ఆమాట అనకండి" అన్నది.

"మనసయి అంటున్నానా వాసంతీ! ఆర్నెల్లయిం దిప్పటికి.ఒక్క గాలి కబురయినా తెలియలేదతణ్ణి గురించి. కలకత్తాలోని మూడు పెద్ద పత్రికల్లో అతడి 'జాడ తెలియటంలేదు' అని ప్రకటనలు వేయించాను"

వాసంతి కొంచెం సబురాలై "అతడలాంటి పత్రికలూ అవీ చదివే వాడా యేమన్నానా ?" అన్నది.

"చదవడు. ఆసంగతి తెలుసు. అంతకుతప్ప ఆచూకీ తెలియటానికి మరొక ఉపాయంకూడా కన్పించటంలా. ఇంత విశాల ప్రపంచంలో ఎవరయినా తప్పిపోతే ఎప్పటికయినా వాళ్ళంతట వాళ్ళు రావటమే కనుక సంభవించకపోతే, ఎక్కడని వెతకటం ?"

"'తప్పకుండా వస్తాడు' అని తోస్తుంది నా మనస్సుకి. ఎప్పుడో ఓరోజు తప్పకుండా వస్తాడు"

నిష్కపటంగా తనహృదయంలోని విశ్వాసాన్ని వెల్లడించటానికి వెనుకాడలేదు వాసంతి.శశిధర్ సందేహ సంకోచాలు పూర్తిగా తీరిపోయినట్లు తెలుసు ఆమెకి.

• • •

ఉహూం. నిజంగానే ఇంక సంశయభావమనేది లేదు శశిధర్‌కి.

తన మనస్సులోని కుత్సితమైన సందేహాన్ని తలచుకుంటే ఇప్పుడతడికి సిగ్గుతో చచ్చిపోవాలనిపిస్తూ వుంటుంది. ఆ భయానకమైన రాత్రివేళ అతడు నిజంగానే జ్ఞానాన్ని కోల్పోయాడు.వంటయింటి గుమ్మంలో గునగునలాడుతూ కూర్చున్న గౌరాంగ్‌ని చూడగానే అతడి మనస్సులో చుట్టచుట్టుకుని వున్న అనుమానసర్పం పడగవిప్పి లేచింది. తర్వాత చాటుగా వెనుకనుంచుని వుండగా ఇంట్లోంచి పారిపోవటం సంగతి చెవిని పడింది. అప్పుడు అతడిహ సంకోచాల నన్నిటినీ త్రెంచివేసుకున్నాడు. హితాహిత జ్ఞానాన్ని పూర్తిగా కోల్పోయాడు.

ఇంత పెద్ద ప్రమాదకరమయిన సలహాకి కారణం ఎంతో హాస్య కరమయిన దన్న సంగతి యెవరు అర్థం చేసుకోగలరు ? కాని ఆ సందర్భంలో ఓనాడు వాసంతి గట్టిగా ధూడించేసింది. "అర్థంచేసుకోవటం భావ్యం ! పదేళ్ళనుంచీ చూడటంలా మీరతణ్ణి ? పశువుకీ, భగవంతుడికి వ్యత్యాసం తెలుసుకోలేరూ ? అతడికి ప్రాపంచిక విషయ పరిజ్ఞానం వుండటం ఏనాడయినా చూశారా ? అతడికి స్వార్థబుద్ధి అనేది లవలేశమయినా వుందా ? మనిషిని సందేహించగానే అయినట్లేనా ? సందేహం అనేది స్వల్పవిషయమా ? కేవలం అతణ్ణి ఒక్కణ్ణే సందేహించలా. నన్ను సందేహించారు మీరు. ఎందుకని భార్య అంటే గుప్పిట్లో వుండే వస్తువు. వరికినా, చంపినా ఎవరూ ఏమీ అనబోరు. ఆమెని సందేహిస్తే వచ్చే పెద్ద ప్రమాదమేమీలేదు అందుచేత చటుక్కున సందేహించి ఆమాట అన్నారు. ఏ అపవాదు వేస్తే స్త్రీ మానహానితో ఆత్మహత్యకి పాల్పడవలసి వస్తుందో ఆమాటని మీరు సునాయాసంగా అనగలిగారు. భార్య అంటే 'బందిని' కదా అనేగా ! అంతేనా ?"

అభిమానం దెబ్బతినడంవల్ల ఆ రక్తమైన ఆమె ముఖంకేసి చూసి శశిధర్ లోపల్లోపల క్రుంగిపోతున్నాడు. తాను అల్పుణ్ణి అని అనిపించసాగింది. వాసంతి మరిఎవరినయినా ప్రేమిస్తున్నది – అన్న ఊహే అతడికింత మనస్సు సరిలేకుండా చేసివేసింది.

వాసంతి చాలా సీరియస్‌గా అన్నది – "ప్రేమిస్తున్నాను. ఏముంది దానికి ! ప్రేమ అనేది అంత చెడ్డదా? బాదల్‌ని ప్రేమించనూ నేను ? ఇద్దరు వ్యక్తులమధ్య ప్రేమ వుండదూ? ఒకమనిషిమీద మరొక మనిషికి శ్రద్ధాభక్తులనేవి వుండటానికి వీల్లేదా ? పెళ్ళిఅయిన దగ్గిర్నుంచి చూస్తున్నా - మీ యింట్లో మనుషులు ఏదో పనులు చేసే యంత్రాలు. ఓ సరదాలు, సంతోషాలు, నవ్వులు అనేవి యేమీ లేవు. నాకు ప్రాణం కడగట్టినట్లుండేది. అతణ్ని ఒక్కణ్నే చూశాను చైతన్యం వున్న వ్యక్తిని. అందుచేత అతడు నాకు నచ్చాడు. అలా అని నే నతడితో లేచిపోవటానికి ప్రయత్నిస్తాననే నా అర్థం ? దొడ్డతెలివే మొత్తానికి ! ఒక మనిషితో నవ్వుతూ రెండు మాటలు మాట్లాడినంత మాత్రాన ఆడదాని సతీత్వమే కనుక హరించుకు పోయేట్లయితే – ఉస్ అంత

ఉస్ అంటే పోయేది లేకపోవడమే మంచిది. ఉన్నా అలాంటి వానికి పిలుపేమిటి ? అయినా మీ ప్రేమ మాత్రం యేమిటి - రవంత విశ్వసించడం అనేది యెరుగనిది ? మనస్సులో అనుక్షణం అపనమ్మకాన్నే పెంచుకుంటూ, ఆ భార్యని గదిలో పెట్టి తాళం వేసి వుంచడంలో అర్థమేమయినా వుందా ? అది తమకి మాత్రం అవమాన కరంకాదూ ? ఆ భార్యతో సంసారం చెయ్యటానికి అసహ్యం వెయ్యదూ ! శరీరం అనేది మట్టిగూడు. లోపల్లోపల యెవరయినా పరపురుషుని కొలిస్తే — వాళ్ళకింకేముంటుంది ?"

వాసంతి చదువుకున్న నవనాగరికురాలే కనుక అయితే - ఆమె జల్లెడుపూస్పలా అన్న మాటలు గంభీరోపన్యాసంగా పరిణమించేవే. కాని అలాకాలేదు. అయినా ఆమె చెప్పతలచింది ఎందుకు అర్థంకాలా ? అంతకంటె ఎక్కువ ఆడంబరంగా చెపితే శశిధర్ మాత్రం అర్థం చేసుకోగలిగేవాడా ?

అనుదినమూ సేవా సాహచర్యాలవల్ల వాసంతికి ఎంతో అవకాశం కలిసివచ్చింది. ఎన్నో సంగతులు చెప్పింది అతడికి "ఇదే, మీరు జమీందారులవద్ద పని చేస్తున్నారంటే పరస్పర విశ్వాసం వుండటం వల్లనే చేస్తున్నారు. హఠాత్తుగా వారు మీమీద దొంగతనం మోపి,ఖజానా డబ్బు మీరు కాజేశారని కనుక అంటే మీకు యెలా వుంటుంది ? మనస్సుకి విరక్తి కలిగి నేనూ ఆత్మహత్య చేసుకుందామని అనుకున్నాను. కాని మీ యీ పరిస్థితి చూసే అన్నీ మరిచిపోయి ఇలా వుండవలసి వచ్చింది.

శశిధర్ ఆమె చెయ్యి పట్టుకుని క్షమాపణ వేడుకున్నాడు. "నేను గ్రుడ్డివాణ్ణిగా వున్నా నిన్నాళ్ళూ వాసంతీ! నిన్ను ఎన్నడూ అర్థంచేసుకోలేకపోయాను" అన్నాడు.

"మీ స్టేషన్‌మాష్టరు కూడా మొత్తానికి ఒక పిచ్చివాడు. రోజూ ఈ మిటమిటలాడే యెండలో కుర్రవాణ్ణి తీసుకెళుతూ వుంటాడు రైలు చూపించటానికి"

"బాదల్ ఇంకా తిరిగిరాలేదు కదూ ?"

"ఇంతకుముందే వచ్చాడు. నేను వాణ్ణి సమాధానపరచి దేవా

లయానికి పంపించాను. 'అక్కడ అమ్మ వుంది. అమ్మమ్మ వున్నారు. వెళ్ళిరా నాయనా! ఓసారి అలా వెళ్ళి తిరిగిరా. అమ్మ మనస్సుకి కాస్త ఇదిగా వుంటుంది' అంటే వెళ్ళాడు. ఆడబిడ్డని చూస్తూంటే నా మనస్సుకి ఎంతో బాధగా వుంటుంది. ఆ అసూయలేదు. తగాదాపడడంలేదు. పెత్తనాలకి తిరిగి వద్దామనే ఆసక్తిలేదు. దిగులుగా కుర్చుంటూ వుంటుంది యెప్పుడూ. కూర్చుని ఏదో అల్లికపని చేస్తూ వుంటుంది"

"అల్లికపని చేస్తుందా? సుధకి అవన్నీ చేతవునా?"

"చేతకాదు. కాని నా దగ్గర నేర్చుకుంది. 'వారు ఎప్పుడైనావస్తే ఈ అల్లిన రుమాల పరచి కూచోపెట్టండి. ఓవేళ అలారాక ఈలోగా నే చచ్చిపోతే దీన్ని ఆ చితిమీద పడెయ్యండి' అని అంటూ వుంటుంది"

చెపుతూంటే వాసంతికేకాదు, వింటూంటే శశిధర్‌కూడా కళ్ళు రెండు చెమ్మగిలాయి.

శశిధర్ దీర్ఘంగా నిట్టూర్చి "అన్నవైవుండి నేను దాని అయిదువతనానికి ముప్పు తలపెట్టాను" అన్నాడు.

"ఊరుకోండి. ఇంక అవన్నీ తలచుకుని మనస్సుని పాడుచేసుకోకండి. 'భగవాన్! ఇంటిపట్టునవుండే మనిషిని మళ్ళీ యింటికి వచ్చేట్లు చెయ్యి' ఆడబిడ్డ మనోవ్యధ దూరంచెయ్యి. పిల్లవాడి ప్రాణాలు కుదుటపడేట్లు చెయ్యి. నాకొక అప్పుణ్ణి దగ్గరకి చేర్చి మనశ్శాంతి కల్గించు" అని భగవంతుని షష్టిగడియలూ వేడుకుంటున్నాను.

శశిధర్ జాలిగా నవ్వి "అయితే నావంతుకి యేమీ మిగల్చలేదే చివరికి?" అన్నాడు.

"మీకా?" వాసంతి కొంటెనవ్వు ఒకటి నవ్వి "మీరు మళ్ళీ కుంభ నికుంభల వేషం కట్టండి" అన్నది.

• • •

కాసేపు యిద్దరూ మెదలకుండా ఊరుకున్నారు. కొంతసేపటికి సంజెపడింది. వాసంతి లేచి "వెడతాను. తులసికోటముందు దీపారాధన చేసి వస్తాను" అన్నది.

"నాకూ్కడా ఆహ్నికానికి యేర్పాట్లు చెయ్యి పూజా పారాయణలు ఏమీ బావుండటంలేదు నాకింక.తొమ్మిదోయేట ఉపనయనం అయిన

దగ్గిర్నుంచి చేస్తూనే వున్నారుగా, ఏం కన్పించింది ఫలితం ! మనో భ్రాంతినే తీర్చలేక పోయింతర్వాత గురువూ వృధాయే, గాయత్రి వృధాయే" అన్నాడు శశిధర్.

శశిధర్ పూజకి కూర్చున్న కాసేపటికి హఠాత్తుగా బయట ఏదో గందరగోళం విన్పించింది. మెల్లాలో అటువైపు దడిగున్మం దగ్గిర్నుంచి విన్పిస్తోంది గందరగోళం. గాయత్రి ప్రారంభించాడు.లేవటానికి వీల్లేదు శశిధర్‌కి. జపాన్నిమాత్రం నిలిపి, చెవులు అప్పగించి కూర్చున్నాడు.

అనేక కంఠాల మధ్య యెవరిదా కంఠం?ఎవర్నో బ్రతిమాలుతూ చెపుతున్నాడు. ఆ కంఠస్వరం చుట్టూ ఎన్నో కంఠాలు కలచిన రొద విన్పిస్తోంది. ఏం జరిగింది ? ఈ అసురసంధ్యవేళ ఎవరైనా దొంగనీ, గొంగనీ పట్టుకున్నారా యేం ? కాని ఆ కంఠస్వరం ఎవరిది ?

ఎలాగో అలా పూజచేసేసి శశిధర్ ఆ గదిలోంచి వెళ్ళిపోబోతు న్నాడు. సరీగ్గా ఇంతలో అప్పుడే వచ్చిన బాదల్ తీక్షణకంఠం వేణు నాదంలా ధ్వనించింది. "నాన్న ! నాన్న ! మా నాన్న వచ్చాడరా్రి !"

దానితోపాటు నిభానని పెద్ద పెద్ద రాగాలు "అరే, మా పోయిన సొత్తు నట్టింటికి తిరిగి వచ్చింది. అమ్మాయ్ వాసంతీ ! చప్పున ఇరుగు పొరుగు వాళ్ళిళ్ళకి వెళ్ళి పండు ముత్తయిదువు కెవరికైనా తాంబూలం ఇచ్చిరా. అభాగ్యుడికోసం ఈ తాంబూలం వ్రతం పట్టించాను నేను" అన్నది.

విరహమనేది బహుశా మనస్సునిలాగా శుష్కింపచేస్తుందేమో ! భవిష్యత్తులో బహుశా మళ్ళీ నిభానని అల్లుణ్ని తిట్టవచ్చు. ఇలాంటి అల్లుడు వుండటంకంటె కూతురు విధవ అవటమే మంచిదని గట్టిగా ఢంకా బజాయించికూడా అనవచ్చు. అయినా ఈ క్షణంమాత్రం విలువ లేనిదికాదు. ఇది పరమోత్కృష్టమైన క్షణం. హఠాత్తుగా అసావసాధ్య సంగా వున్నప్పుడు మనిషిలోని ఏ 'రంగు' అయితే బయటపడుతుందో అదే అసలయిన రంగు.

* * *

ఇనస్పెక్టరు గోవర్ధన్ గడాయీ పట్టుకు తీసుకువచ్చారు స్టేషన్ మాష్టరుని. విడిచిపెట్టలేదు. దారిలో వస్తూండగా గుమికూడిన యిరుగు పొరుగు వాళ్ళు వీధిగుమ్మం వరకువచ్చి వెళ్ళిపోయారు. ఎంచేతంటే వాళ్ళకింకా యిప్పటికీ సందేహం తీరలేదు. ఇనస్పెక్టరు కూడా రావటంతో ఓ కట్టుకథ కల్పించుకుని అదే చెప్పుకుంటూ పోయారు. ఎవరు చెప్పగలరు బాబూ! ఎవరైనా వచ్చి తమనిసాక్ష్యం వేసుకుంటామంటే?

అయితే అడగగానే వెళ్ళి సాక్ష్యమిచ్చి వచ్చేటంత అమాయకులు కారు బాసుల్‌పురవాసులు. ఆ రాత్రి బావమరదు లిద్దరు ఎందుకు కలహించుకున్నారో, ఎందుకు రక్తపాతం జరిగిందో అసలు ఆ సంఘటన జరిగినప్పుడు ఊళ్ళో వాళ్ళందరూ గాఢనిద్రలో వున్నారన్న సంగతి యెవరెరుగరు ?

గడాయీతో శశిధర్‌కి కావలసినంత పరిచయం వుంది. అంచేత అతడు బాదల్‌ని, అక్కడ చూస్తూ నిలబడిన ఇద్దరు స్త్రీలని, ఉగ్గపట్టుకుని ఉండలేని స్థితికి తీసుకువచ్చి పళ్ళెముడు మిఠాయీ తినిగాని విడిచిపెట్టి వెళ్ళలేదు.

తండ్రిఒళ్ళో కూర్చుని వున్న బాదల్ యిప్పటికి తండ్రిని తిరిగి పొందగలిగానే అన్న సంతృప్తికరమైన నిట్టూర్పు వదిలి, బ్రతికి పోయాడు.

మాష్టరుగారు కూర్చునే వున్నారు. గౌరాంగ్ గాథ అంతా వినందే అక్కడినుంచి కదిలేట్లు లేదు. ఓఇద్దరు ఉత్కంఠి తలైన స్త్రీలు అతడితో ఏకాంతసమయం కోసమై యెదురుచూస్తూ వున్నారు. కాని స్టేషన్ మాష్టర్ కా ధ్యాసేలేదు."

"అమ్మా ! ఈ ముసలివా డివాళ విడిచిపెట్టేట్టులేడు" అనుకుంది సుధ. అతడికిహ పనీ, పాటూ, ఏమీలేదా యేం ? ఎటూ వచ్చాక అన్నీ తెలుసుకోవచ్చుగా. రేపే పరుగెత్తు కొస్తాడుగా. మీరందరూ కలిసి కూర్చుని మాట్లాడుకునే చోటుకి. ఇంటికి వచ్చిన వాడిని ఇంట్లో వాళ్ళతో కాసేపు స్తిమితంగా మాట్లాడుకోనీయ రాదూ!

భర్త రానంతవరకు - సుధకి మనస్సులో ఓ పెద్ద భయం వుండేది. అతడసలు ఇహ రాదేమోఅని .... అప్పుడనుకునేది. ఓవేళ

భగవంతుడి దయవల్ల అతడు తిరిగేకనుక వస్తే.... అప్పుడిహ — లజ్జా సంకోచాలేవీ పెట్టుకోకుండా - పరుగెత్తుకెళ్ళి అతడి కాళ్ళమీద పడి — "నన్ను క్షమించండి" అని వేడుకోవాలని అనుకుంటూ వుండేది.

కాని తీరా ఆసమయం వచ్చేసరికి చూస్తే - అలాంటిదేమీ జరిగినట్టు లేదు. భర్త విదేశాలనుంచి వచ్చిన నవోఢ అయిన వధువు — అవగుంఠనంధరించి అతడిచుట్టూ తిరుగుతూ గడుపుతోందో అలాగే అవగుంఠనాన్ని మరింత పెద్దది చేసుకుని తిరగసాగింది సుధ.

బహుశా ఆరాత్రి వరకు వేచివుండక తప్పదేమో,

వాసంతి ఏమిటిలా అయింది అని .... ఆలోచించసాగింది. ఆకస్మికమైన గగుర్పాటుతో ఆమె గడ్డకట్టుకు పోయినట్లయింది. ఒక్క మాట అయినా మాట్లాడలేకపోయింది. కూకలెయ్యటం జరగనేలేదు.

అయినా మాష్టరుగారి అపేక్షని అర్థంచేసుకోగలదు వాసంతి. అతడి హృదయోద్వేగంలోని తత్తరపాటుని గ్రహించ గలరని. అంచేత ఆమెకూడా అవగుంఠనంలో నుంచి — చూస్తూ ఊరుకుంది. ఏమిటిలా మారిపోయింది ముఖం ! సంపంగి పువ్వులాంటి రంగు - ఇలా తామ్ర వర్ణానికి తిరిగిందేమిటి ?

ఇప్పుడిహ శశిధర్ మిథ్యా సందేహ ప్రవృత్తిని తప్పు పట్టలేక పోతోంది. తప్పంతా పూర్తిగా తనదే అని అనుకుంటోంది.

తాను ఇలా పసితనంగా ప్రవర్తించి వుండకపోయినట్లయితే ఈ సందేహమే వచ్చేది కాదసలు. భగవంతుడే చక్కదిద్దాడు అన్నీ. శశిధర్ కే కనుక ఏమయినా జరిగివున్నట్లతే ? ఓవేళ గౌరాంగ్ ఆత్మహత్యే చేసుకున్నట్లయితే ?

కంపించిపోయి స్తంభితురాలయింది వాసంతి.

"ఎన్నాళ్ళనుంచో పడుతున్న ఆదుర్దా అంతా పూర్తిగా తీరిపోయింది. సుధ భర్తని పొందగలిగింది. బాదల్ తన తండ్రిని పొందగలిగాడు. ఈ కాస్త ఆలోచిస్తేనే మనస్సు ఇంత ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతోందేం ?" అని అనుకోసాగింది వాసంతి.

అహం. తనకికూడా ఎన్నో లాభాలే సమకూరాయి.

అయినా ఆమె తనని నిందించుకోలేదు తన హృదయంలో

నిభృత కక్ష్యని చూసి, వణికిపోవటంలేదు, భయపడటంలేదు. వాసంతికి సాహసం వుంది.

పురుషుల స్నేహాన్ని స్వీకరించగలిగినంత అతిసాహసం....

స్త్రీ పురుషులకి స్నేహం కలగటం నిజంగా అసంభవమా ? స్త్రీ మనస్తత్వంలోని మరీ స్త్రీత్వపుకథల్లో మెదడుకి మేత పొందలేకపోయిన వాళ్ళు, వైచిత్ర్యానుభూతిని పొందలేని వాళ్ళు, స్త్రీ స్వభావంఅంటే సరి పడనివాళ్ళు అలాంటి స్త్రీ లెక్కడా అసలు వుండనేవుండరా ?

వారు తమ హృదయంలోని స్నేహక్షుధ తీర్చుకోటానికి తక్కిన జగత్తుకేసి చూడనే చూడరా ? అక్కడ ఎవరైనా ఇలాంటి వాళ్ళు కన్పిస్తే తమకి వారికి ఆలోచనా సామ్యంకూడా వున్నప్పుడు వారిని స్నేహితుల్నిగా స్వీకరించినంత మాత్రాన ఏ తధర్మం అధఃపతనమై పోతుందా ? సహజమైన ధర్మమేదయితే వుందో అదే సతీధర్మం. కాని దానికోసం ప్రయత్నం చెయ్యనఖ్ఖర్లేదు.

కొందరి పురుషుల్లో అసహిష్ణుతనేదే వుండదు. శశిధర్ బ్రతికి వున్నందుకు అదేదో తనమీద శశిధర్‌కి అపారమైన దయ అయినట్లు అతడి అతిస్నేహానికి నిదర్శనమయినట్లు, కృతజ్ఞతతో విచలితుడయి నాడు గౌరాంగ్. శశిధర్‌కూడా కృతజ్ఞుడు కాకేం ? ఓవేళ అతడు ఎప్ప టికీ కనుక తిరిగి రాకపోయినట్లయితే ? బాదల్ తండ్రితో ఏదో గుస గుసలాడుతూండటం చూసి శశిధర్ పరిహాసంగా "ఏమిట్రా అంత రహస్యం మాట్లాడుకుంటున్నారు బాదల్ ? నాన్న దగ్గిర మామయ్యని బాగా తిడుతున్నావ్ అనుకుంటా" అన్నాడు.

బాదల్ సిగ్గుతో ముఖం తండ్రి వెనుకవైపుకి పెట్టుకున్నాడు. గౌరాంగ్‌కూడా పరిహాసంగా "అహఁహఁ. వాడు నాటక సమాజాన్ని పెట్టటానికి ఇంకా యెందుకు ఆలస్యం ?" అని అడుగుతున్నాడు. ఇవాళ రాత్రి ప్రారంభిస్తే నష్టమేమిటంటాడు. అరె ! బాబూ ! గిల్లుతావేమిటి? బాదల్ యేమంటున్నాడో తెలుసా ? పాటలకోసం ఇంక బెంగెట్టుకో నక్కర్లేదుట ! బాబుగార్లయింట్లో గ్రామఫోన్ రికార్డులు విని విని మూడు పాటలు నేర్చుకున్నాట్ట !" అన్నాడు.

చెప్పేది అబద్ధంకాదతడు. మంచి జ్ఞాపకశక్తి కుర్రాడిది.

"కొన్నాళ్ళు వెంటపెట్టుకు వెళుతూండే వాడిని. వెళ్ళగానే వాళ్ళు వాణ్ని పిలిచి లోపలికి తీసుకువెళ్ళేవాళ్ళు. అక్కడ గ్రాంఫోన్ వింటూ కూర్చుని, నేర్చుకున్నవన్నీ అత్తయ్యకి విన్పిస్తుంటాడు. ఆ పాటలన్నీ మాత్రం నాన్నకి పాడి వినిపించొద్దురా బాదల్ ?" అన్నాడు శశిధర్. వాసంతికేసి ఓసారి ఓరకంట చూసి, చిరునవ్వు నవ్వి తనమాట పూర్తి చేశాడు శశిధర్ "అదే సూరేళ్ళకి సఖుడు కన్పించాడు.రాధిక ఉల్లాసంతో ఉప్పొంగిపోయే పాట :

వాసంతి ఆకటాక్షన్ని మళ్ళీ అన్నాచెల్లెళ్ళ యిద్దరియెదుట త్రిప్పి పంపింది.

శశిధర్ నవ్వుతూ"మీ వృషకేతు అభినయం చాలావరకు నామీది నుంచే పోయింది. ఏమంటారు మాష్టరుగారూ ! కాదురా బాదల్ ! తెగిపోయి మళ్ళీ అటుక్కున్నాను" అన్నాడు.

ఇప్పటికి ఎలాగో తేరుకుంది నిభానని. అంచేత అల్లుణ్ణి అవహితుణ్ణి చేయటానికేనేమో ! పైకి చూస్తూ "అది అబద్ధంకాదు. బ్రతుకు తాడనే ఆశ యేమీలేకపోయింది. కాకపోతే జయచండీదేవికి ఎన్నో పూజలు చేయిస్తానని ప్రలోభ పెట్టటంవల్ల పిల్లవాణ్ణి మళ్ళీ నాకు యిచ్చింది. మా శశిధర్‌కి ఒకవిధంగా నవజన్మ" అన్నది.

శశిధర్ గౌరాంగ్ బుజం నిమురుతూ "అమ్మ నిజమే చెప్పింది భాయీ ! నిజమే చెప్పింది. అభాగ్యుడైన నీ శశిధర్‌దాకి నవజన్మే ప్రాప్తించింది నిజంగా. నవజన్మే సంభవించింది. జంతు జన్మనుంచి మానవజన్మ !" అన్నాడు.

అంతపెద్ద దాంధికవ్యక్తి కరుణాపూర్వకమైన స్వీకారోక్తి అక్కడ వున్నవారినందర్నీ ఆశ్చర్యపరచకుండా వుండలేదు. అవగుంఠనం చాటున వాసంతి విశాలనేత్రాల్లోంచి రెండు పెద్ద కన్నీటిచుక్కలు గాలాయి. సుధ యథావిధిగా కళ్ళు తుడుచుకుంటూనే వుంది. ఈ నిస్తబ్ధతని పోగొట్టటానికేనేమో "సంచార సమాజం ఇంక అక్కర్లేదు నాన్నా ! పెద్దనాన్నగారు రాసినవన్నీ తగలబెట్టేశారు" అన్నాడు బాదల్.

"తగలబెట్టారా ?"

గౌరాంగ్ చకితుడై ముఖంఎత్తి ఆశ్చర్యంగా చూశాడు మాష్టరు

ముఖంకేసి. ఆ కాయితాలనేవి మాష్టర్‌దా కెంతటివో తెలియనివికావత డికి.

అతడి విస్మయం మాష్టర్‌ని కదలించనేలేదు. ఆ ప్రసక్తిని ఎగర కొట్టేసే భంగిమతో మరొకవైపుకి చూస్తే "అక్కర్లేదంటే ? తప్ప కుండా పెట్టాల్సిందే ! తగలపెడితే ఏం ? తగలపెడితే యేం ? మళ్ళీ నేనేం రాయలేననుకున్నావా ? అన్నీ కంఠోపాఠమే నాకు. చూడరాదూ ఈసారి మంచి పుస్తకంలో రాస్తా. మంచి పుస్తకంలో రాస్తా" అన్నాడు.

* * *

కలలుకనటం సరదా అయిన స్టేషన్‌మాష్టర్ ఈ ఆశ కేవలం దురాశ కాకపోవచ్చు. బహూశా అతడు తగలపెట్టిన కథన్నే మళ్ళీ అతడు చక్కటి పుస్తకంలో రాయొచ్చు....

బహూశా జీవితంలోకూడా అప్పుడప్పుడు ఎవరో కొందరు అదృష్టవంతులకే ఇలా జరుగుతుందేమో ! భాగ్యదేవత అశ్రద్ధగావున్న సమయంలో కొందరి కొందరి జీవితాల్లో బూడిదయిపోయిన కథల్ని మళ్ళీ కొత్తగా రాయటం సంభవిస్తుంది. ఆ కథలు మంచి పుస్తకాల్లో ఎక్కుతాయి" అన్నాడు.

"కాని అది దైవికం"

వస్తుతః భాగ్యదేవత చాలా జాగ్రత్తయినది. మోసగించి ఎవరైనా ఈ జీవితాన్ని సులభమైనదిగా జేసుకోగలరు - అన్నది దాని సంవిధా నంలోనే లేదు. ఆ విధానంలోని ప్రతి విభాగంలోనూ జీవితం అన్నది ఎంత జటిలమైనదో విశదీకరింపబడే వుంది.

* * *

అంచేత డబ్బు, నగలు మూటకట్టుకుని, ఉద్భ్రాంతురాలై పరు గెత్తుకు వచ్చిన అపర్ణ - ఆత్మగోపనం చేసుకుని మళ్ళీ వెనక్కి తిరిగి వెళ్ళాల్సి వచ్చింది. ఎవర్ని కాపాడుదామని పరుగెత్తుకువచ్చిందో — అతణ్ని ఇంట్లో తనకుటుంబంలో హాయిగా వుండంగా చూడటం తట స్థించినప్పుడు - ఇంక చేయవలసిందేముంటుంది?

బాసుల్‌పూర్ గడ్డమీద కాలుమోపగానే - అప్పుడు ఊరందరూ గౌరాంగ్ లీల గానం చేస్తున్నట్లు వినవచ్చింది.

గూటి పట్టున వుండేవాడు మళ్ళీ గూటికి చేరుకున్నాడు.

వృధాభయంతో దారులూ - డొంకలూ పట్టి తిరగవలసిన అవస రం లేదింక అతడికి. దారులు - డొంకలూ - మళ్ళీ అతడి వైపుకి చేయిచాచాలని ఆశించటం - అది అవివేకం.

పోనీ ఒక్కసారి బాదల్ నయినా చూసే అవకాశం కలిగితే. కాని చూడాలనుకోగానే అతడొచ్చి కన్పిస్తాడా?

ప్రయోజనం ఎక్కడయితే తీరిపోతుందో - అక్కడిహ పరి చయాన్ని తెల్పుకునే ముక్క వుండదు. ఇహ అక్కడికివెళ్ళి కన్పిం చటమంత హాస్యాస్పదమైన దేముంటుంది?

ఉహూఁ అలా అన్యాస్పదురాలుకావలసిన అగత్యంలేదుఅపర్ణకి.

* * *

మహా వృక్షపు చరిత్రే రచింపబడుతుంది. కాని అడవి మొక్కలు గడ్డిమొక్కల గాధలు వ్రాయబడవు. అవికూడా ఎప్పటికైనా ప్రఖర సూర్యరశ్మి పిపాసతో పృదివిని విదీర్ణంచేసుకుని తలలెత్తుతాయి - జ్ఞాప కం పెట్టుకునే బాధ్యత యెవరు వహిస్తారు?

వాటి స్వల్పమైన ఆశలూ, నిరాశలూ అన్నీ అల్పమయినవి. అయితే వాటి ఆశలూ, నిరాశలూ అల్పమైన అభావం. అల్పమైన సమ స్యలూ - వాటికి ఏ అనుభూతి నయితే కలిగిస్తాయో - అవి మహావృక్షాల సుఖమూ - మహత్తరాలైన నిరాశలకంటె తక్కువ తీక్షమైనవా? వాటి స్వల్పమైన చైతన్యానికి - రవంత గాలి సోకితే చాలు - అదే దురలత మైన వైశాఖ మాసంలోగా లివానవి చవిచూడ చేస్తాయి.

ఎవరికిక నాటకసమాజం పెట్టటమే. తమ ఆశలకి పరమావధియో ఎవరు నిరుద్దేశంగా వెళ్ళతలచుకున్నా ఈ విశాల ప్రపంచంలో ఎక్కడా ఇంత మహా వృక్షపు చరిత్రే రచింపబడుతుంది కాని, చిన్న చిన్న గడ్డి మొక్కల కధలు ఉల్లేఖింపబడవు. అవికూడా ఎప్పుడో ఒకప్పుడు ప్రఖర సూర్యరస్మి పిపాసతో పృధివి ని విదీర్ణం చేసుకుని తలలెత్తుకుని పైకి లేస్తాయి. అన్నది జ్ఞాపకం పెట్టుకునే బాధ్యత ఎవరు వహిస్తారు?

వాటి, ఆశానిరాశలు, సుఖదుఃఖాలూ అల్పమైనవే కావొచ్చు. అయినప్పటికీ వాటి అల్పములైన ఆశలూ, నిరాశలూ, అల్పసమస్యలూ

వాటికి కల్గించే అనుభూతులు, మహావృక్షాల సుఖాలూ, ఆశా చేతస్సులకు చిరుగాలుల తాడికికూడా భయంకరమైన పెనుగాలులు అనుభూతిని చవి చూపిస్తాయి.

ఒక నాటక సమాజ స్థాపనే తమ జీవిత పరమావధిగా భావించిన వాళ్ళు - నిరుద్దేశంగా వెళ్ళిపోదామన్నా ఈ విశాల పృధివిలో రవంత ఆశ్రయం దొరకనివాళ్ళు - స్వల్పమైన పరిధిలోనే గుడి గుడి కుంచాలు తిరిగి తిరిగి జీవితాల్ని ముగించేవారు — వియోగాంతంగా ముగియవలసిన నా జీవితాలు చివరికెలాగో సుఖాంత ప్రహసనాలుగా పరిణమిస్తే వారి యితిహాసాన్ని రచిస్తే మాత్రం లక్ష్యపెట్టేదెవరు ? అవహేళనా పూర్వకంగా ఓ నవ్వు నవ్వి ముఖం అటుత్రిప్పుకోవచ్చు. అయినా అలాంటి నగణ్యులైనవారు మరింతకాలంపాటు జీవితంలో తిన్న దెబ్బల్ని, ఎదురుదెబ్బల్ని కథగా గ్రుచ్చి యెత్తటం జరిగింది.

మరొక అల్పజీవి గాథకూడా ఈ కథలో ఉల్లిఖితమైంది. అతడా హోటల్‌లోని వంట బ్రాహ్మడు. ఎన్నిరోజులు గడిచాయో, ఎన్ని వసంతాలు, గ్రీష్మాలూ గతించాయో - యిహ ఇప్పటికీ అతడు మిట్ట మధ్యాహ్నవేళ - హోటల్ పెరటి గుమ్మంతలుపు తెరిచి ఒకసారి అటూ ఇటూ చూస్తూనే వుంటాడు - ఎవరైనా అక్కడ కాచుకుని వున్నారేమో - ఆ చెత్తకుప్ప ప్రక్కగా - ఆబూడిద పోగు ప్రక్కగా ఎవరైనా నాలుగు మెతుకులు దొరుకుతాయనే ఆశతో. అటూ యిటూ పచార్లు చేస్తున్నారేమోనని.

ఆ "పైన్" హోటలు అన్న నీచమైన అన్నమే కావొచ్చు కాని తోటిమానవునికి సహృదయతా స్పర్శవల్ల అవ్యాజ స్నేహ స్పర్శవల్ల అదే వారికి పరమాన్నం అవుతుంది....







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B105 |
| పుస్తకం పేరు | నవజన్మ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 181 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | susmitha |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |